సీ. ఒకనాడు నే సముత్సుకత నానారత్న మండనాలంకృతాంగుండ నగుచు
117 గజరాజుమీఁద సింగారంబు దీపింప వలనొప్ప గూర్చుండి వైభవమున
రాజమార్గమున రారమణియొక్కతె సౌధమెక్కి చూచి విరాళిఁ జిక్కఁగ
నీ వభిజ్ఞుఁడవుగా నే డేమిచేసిన నలపుటవీకునో తెలియు మనుచు

గీ. చెప్పిపంపిన యాచోటి చిత్తమెఱిగి ప్రేమ మీరంగ నారాత్రి పిలువనంపి
వచ్చినను గూడి తనిసిన వనితసొంపు మదిదలంప బ్రహ్మానంద మదియ కాదె.

సీ. అల మహానవమి లే యద్దాలమేడలోపల పైడితఖ్తుపై కొలువుదీర
నపుడు మంత్రులు బడాఆద్మీలు మొదలుగాచాల సజమ్ముజరాలుజేయ
118 వరుసగిరిజా సర్వస్సలామని చోపుదార్లు, పరాకంచు తగువిధమున
కటికెముల్ హెచ్చరికలు దెల్ప లష్కరయందు దీపములు నిండార వెలుఁగ
బల్కు చేతి జేసి బర్ఖాస్తు గావించి ప్రియసతి జేటిచేఁ బిలువనంపి
నగ్నులమై భూషణములూడ్చి గద్దెవద్దనె వేడ్కతో నిధువనము సలుప
కెలయ నిర్వంకల నిలువుటద్దములలో నవోఽన్య ప్రతిఫల నములచే న
నేక మంచములపై హాళికూటముల పరంపరలు జూపట్టిన పరఁగఁజూచి
'యిట్ల గోపస్త్రీల కేన నేకాకృతుల్ దాల్చి రాసక్రీడఁ దగసలిపితి
నింపార మనమునేఁ డిన్ని రూపములుగా నిప్పోటు క్రీడించు టిది విచిత్ర,

గీ. మంచు తెపతెంపలానించి కొంచెమెదురుగా దిరిగి యద్దములలోన గాంచినవన్ని
లాడి క్రీడించి తృప్తులమైనవిధము మదిదలంప బ్రహ్మానంద మదియ కాదె.

సీ. కుతకుంద సందష్ట సుందరబింబంబు పోలికనున్న కెమ్మోవితోడ
119 కరరుహ పరిలూన కరమర్దన మ్లాన ఘనమంజగులు బోలు చనులతోడ
గండభిద విరహణ కలుషీకృతి సరోవరాభ్ర పుష్పాస్త్ర గేహంబుతోడ
ఘానుమతయూఖ సంపర్క పరికాంత లలితోపమాన గాత్రంబుతోడ
వితతనిశ్వాస మారుతమలినీకృత ముకురంబు క్రియనొప్పు మోముతోడ
గీ. కాంతసురతాంతకాంతయై కనులు దేలవైచుచు మందసవిన్యస్త బాహుయుగళ
యగుచు దొడలపైబవళించినట్టిహోయలు మదిదలప బ్రహ్మానంద మదియ కాదె.

సీ. ఒకనాడు భూపుటీరములోన కెందమ్మి విరులపాన్పున నేను వేడ్కనుండి
120 కనకాంగి యొల్లలోకములతారు కావించువిధము గాదే నొక్క వింత సేతుఁ

బరికింపు మని శిర మర్విపైమోపి కాయంబు పైకెత్తి కాళ్ళుముడిచి
వెనుకకుఁ బడకుండ 1 వెసలేచి పట్టుక రోకటిచే రోలఁ బగిలిమిట్టు
గీ. మించి శబ్దంబులాడవ గిరిడించి యోర్వలేనన సమంబుగా బవ్వళింప జేసి
చెలికి రతిదృష్టి గలుగఁజేసిన ఘనుండు మదిదలంప బ్రహ్మానంద మదియుకాదె.

సీ. ఇరువురకును బ్రేమ లెసఁగ నెన్నాళ్ళకో తటిస్థైన దన్నిరా తడవుగాల్ల
నరుడేచ నూటికితెఱపుజూచుచు చీచునిటుకన్న ఝల్లని చెక్కరించు
నదెవచ్చె నిదెవచ్చె ననిజూచి యొందు గన్నట్టుకుండిన నింటి వారివంన
వడకేమికల్గెనో యని దూతినంపి యేమియును దోచ కొయ్యన మేనుమరచి
గీ. యుండనదివచ్చెనటమూడ్చి యొడిని చేరి సరిగనదిబట్టుకొని జెన్న స్వప్నమనుచు
నాలికిపడ దన్నికూడినయువతిహాయలు దిసలంప బ్రహ్మానంద మదియుకాదె.

సీ. బ్రేపల్లెకీ వేగి బ్రేతల రాధిక నిళిను సందర్శించి యింపుమీఱ
దుష్టరాజుల నెల్ల దునుమాడి శ్రీఘ్రంబెవచ్చెద నంగనక వగలు దగ్గి
యతిధైర్యమున నుండు డనుచు నామాటగా చెప్పి యూరడింప చేసి వేగ
తమ్మన, నుద్ధవుం డన్నెయి వ్రజమున కరిగి గోపాల సుందరులగాంచి
గీ. పరగ నేకాంతమున వహించిబల్కినట్టి పలుకులన్నియు వినిపి వ వారు మరల
నతనితో నన్నమాటల చతురతయును మదిదలంప బ్రహ్మానంద మదియుకాదె.

సీ. చిన్నవాడని చంక బెట్టుక ముద్దాడ పెసరుచంబులుపట్టి పెదవియానె
నురుత కూకటినాఁడు చెలరేగి మాయింట్ల బళ్యతో హారవృతి బాలుద్రావ
వగవారు లేనిచో దగ బొంమకొనువచ్చి మగపోడుములు చేసి మసలుకొల్వె
భూరిగోవర్ధనోద్ధారణాదులచేత యూపదలణచి మమ్మరసిబ్రోచె
కాత్యాయనీపూజ గావించుతఱి మొలచీరలు ముచ్చిలి సిగ్గుగొనియె
విపినమధ్యంబున వేణుగానము చేసి కామవేదన మాకు గలుగచేసె
పైకబ్రాంద్రుసతులకు పెక్కురూపంబులు లీల గైకొని రాస కేళిసలిపె
యమునాతరంగిణీ హ్రదములో మముగూడి వేడుకతో జలక్రీడలాడె
గీ. మఱియు మధువైరి [illegible] గూడి [illegible] మతతోడ చేసిన వైఖరుల్ జెప్పవశమె
మహాత్ముని లీలావిహార ప్రేమ లెద దలప బ్రహ్మానంద మదియుకాదె.

పా, 1. వెసనిరాచి

సీ. అకలంకమైన మా యౌవనంబంతయు సుందరాకారుడై చూఱగొనియె
124 పతిసుతాదుల వీడి భావంబు తనయందె సన్నిధంబున చేర్చి నమ్మియున్న
మము విడనాడి తా మధురాపురికి బోయె నింత నిర్దయుడుర్వి నెంచగలమె
దానింక రాకున్న దడువుగా నిచ్చోట నోడల బ్రాణము దాల్చి యుండలేము.

గీ. స్త్రీహననపాతకంబది చెందకుండ శీఘ్రమువవచ్చి మమ్ము రక్షింపుమనుచు
హరికి జెప్పుమటంచు వా రన్నమాట మదిదలంప బ్రహ్మానంద మదియకాదె.

సీ. అనియిట్లు పల్లవాంగనలుబల్కిన నిష్ఠురోక్తు లాకర్ణించి యుద్ధవుండు
125 గ్రక్కున మధురాపురమ్మున కటుబోయి శ్రీహరి కెఱిగింప జిత్తగించి
ద్వారకాపురి కేగి వరుస రుక్మిణాదిసతుల వివాహమై సంభ్రమమున
చైత్యప్రముఖ దుష్ట సంహార మొనరించి భూభార మణగించి బోలుపుమించి
గణపతి పూజన కాల మందున గ్రమ్మర రాధికను గోప భామినులను
గలసి ప్రేపల్లెకు గడువేడ్క జనుదెంచి వారలగూడి దుర్వారభంగి

గీ. పావనంబున రమ్యబృందావనమున నిండుపుమీరగ గ్రీడించి సుఖింపుచుండె
నట్టి కృష్ణుని లీలావిహారమహిమ లెద దలంప బ్రహ్మానంద మదియకాదె.

సీ. రతిరహస్యానంగ రంగ కొక్కోకాది సముద్రగ సత్కళా శాస్త్రములను
126 జెప్పినట్టి విదగ్ధ లప్పటి జాతులవిధమును సత్వాది భేదములను
గాంచి స్థాన స్పర్శనునగణి సుత్రోపధాన లచే నగలకు దరుణులకును
గలరహస్యంబులు దెలిపిరి యనియె నిశ్శాలంబునకు సరి గాక యున్న
బరగ నిష్పక్షకల బహుజనానుభవ సిద్ధామేము వివిధోచితాంశ లను.

గీ. నీశతకమందు మరుగుగా నింపు మెరయ దెలియజెప్పితి నీజాడ తెలిసిచతుర
లంచితముగ క్రీడాసౌఖ్య మనుభవింపు డార్యులార బ్రహ్మానంద మదియకాదె.

సీ. పదియారు కళలును బహురహస్యము లిందుపాసగంగూఢంబు గాస్పష్టముపర్చి
127 నరలేని చోటుల జిరకాల మభ్యాస మొనరింప నొక్క కొన్ని యుత్సుకమున
యున్నవి చక్కగ నుపలక్షకలవారు యోచించి వేసట నొందకెలమి
గవచ్చు త్వరలోన ననుభవ నకష్టరాకుండ వినమాత్రమున భావ
బోధంబు గాకున్న బోగ విదగ్ధులకు గాకున్న విజయములు గావటంచు.

గీ. దొరకదరలదు పరమ లీ తెలుగులన్ని దెలసి సుఖియించి తనివియత్న్యలర మేలు
సత్కృపకచింత్యగు బ్రహ్మసౌఖ్యమొందు డార్యులార ? బ్రహ్మానందమదియకాదె.

సీ. సజ్జనులార ! యీశతకంబు కేవలశృంగార మని విరసింపకలదు
శ్రీకృష్ణు డింపార బృందావనంబులో చతురత గోపికాసతులఁగూడి
చేసిన శృంగార చేష్టలన్నియు చాల మోక్షప్రదములని మున్ను మౌని
వరుఁడు వ్యాసుఁడు శ్రీభాగవతంబులో శిష్టసమ్మతముగ జెప్పలేదె.

గీ. కృష్ణలీలావిహారంబు లెవ్వ రెన్ని గతులు గొనియాడినను దప్పుగలదె సాధు
జనులుపాదేయమని విని సంతసింపు దంచితముగ బ్రహ్మానందమదియకాదె.

సీ. ఈశతకంబున కేపద్యమునను మాకవిలాసము జెప్ప నిచ్ఛగలిగె
నావిలాసంబున కనుగుణ సంగతులన్నియు స్పష్టంబు లగుట కిట్లు
క్రమ మొప్ప నాల్గు పాదములను విధిమాని వలసినపాదముల్ వరుసగూర్చి
సీసపద్యంబులు జెప్పితి చరణంబు లెక్కువ యని తప్పు లెంచవలదు

గీ. పదము లధికంబులైనట్టి పద్యములను మాలికలుగా గ్రహించి సమముగను
సర్వభావార్థము లెఱింగి చతురులెల్ల ముదముగనుడు బ్రహ్మానంద మదియకాదె.

సీ. అఖిలలోకైకసుందరుడైన శ్రీకృష్ణుని శృంగారచర్యలు రంగుమీఱ
యీశతకంబున నింపుగా గలుగుటజేసి దీనిరచింప జేసినట్టి
పృథివీశునకు నదివినవారలకు విన్నవారికి నర్విభు భూరికరుణ
యవనిలో దీర్ఘాయురారోగ్యములు బుత్రపౌత్రాభివృద్ధి సంపత్సమృద్ధి.

గీ. ధైర్య గాంభీర్య సద్గుణౌదార్య వినయ విజయ సౌశీల్య సౌజన్య విత్తలాభ
పారధర్మార్థ కామ మోక్షములు గలుగు మదిదలంప బ్రహ్మానంద మదియకాదె.

( మొరువ పద్యము )

సీ. ప్రమదా కళా శ్రీము • పతన వారణమును
వరకళా పరిపూర్ణ • స స్వతంత్ర
తయు, బాహ్యారతమున • దరుణి కళాస్రావ
ణము, యోనిసంకోచ • నంబు, యోని

శ్రీరస్తు

# రామావధూటితారావళి.

సీ. శ్రీరాధికాకుచాశ్లేషజ సంతోషవివశుఁడౌ శ్రీకృష్ణవిభుని కెరఁగి
సకలవిద్యావ్యాప్తిసాధనభూతయౌ శారదాంబకు నమస్కారమిడి
యైహికానంద ప్రవాహపూరకమైన శృంగారరససమాత్మ నిరవు కొల్పి
పదనసామ్రాజ్య సింహాసనారూఢులై బురణించు రసిక శేఖరుల నెంచి

గీ. వివిధరతితంత్రపాండిత్యవిభవమహానుభావములె పదార్థములుగ నేరుప్పచి సీస
పద్య నక్షత్రమాలిక భావవిదుల మనములలరంగఁ గూర్తు రామావధూటి.

సీ. చక్కని కెమ్మోవి సరసపు బలుకులు బారైనకురులు బోల్పారుబోమలు
సొగసైనచూపులు సోగకన్నులు తళుక్కుదేరు చెక్కులు కొండు లూగు నొసలు
తీరైనచుబుకంబు దిద్దిన శ్రీమూర్ధ్న రేఖలు మృదువైన లేతనగవు
కుదురైన రదనముల్ గుమ్మగుబ్బలు నందమగు నాస నాసికా మండనములు

గీ. కలిగిచెలివొందు నీమోము దలఁచి తలఁచి తాళ్మిచెడి బెట్టుకై కొంతధైర్యమూని
గుట్టుచెడుకను కాలంబు నెట్టుచుంటి మరునిరతనాల పేటిరామావధూటి.

సీ. కనుమూసినంతలో గలకల నవ్వుచువచ్చి కౌగిటఁజేర్చి ముచ్చటలాడి
మోముమోమునఁజేర్చి ముద్దులనూరార్చి సారెసారెకు మోపి జప్పరించి
'నన్నిట్లు నెడబాయ న్యాయమా నీ' కని యత్తిష్ఠురము లాడు నంతలో న
మేల్కాని నలుదిశల్ మిణుకుచు జూచి కన్నీరు మున్నీరుగా నెగడ బ్రతిది

గీ. నంబు రాత్రులునిటులుండెనా యవస్థ యిట్టుకలలోన నన్నలయించకుంటె
వారిజాక్షి నాతోడ వచ్చి యిటునె మమతతోనుండరాదె రామావధూటి.

సీ. నీమోము నీగోము నీమోవి నీతావి నీసౌరు నీతీరు నీకుదగునె
నీచనుల్ నీకనుల్ నీకొను నీమేను నీతొడలు నీనడలు నీకుదగునె
నీతళుక్కు నీబెళుక్కు నీనీటు నీగోటు నీహొయలు నీలయలు నీకుదగునె
నీగుట్టు నీబెట్టు నీకుటిలు నీమరులు నీచెల్మి నీతాల్మి నీకుదగునె.

గీ. నీకు దగినట్టి పురుషుఁడ నేన, నాకు దగినసుందరివి నీవగా దలచి చాల,
వలచి యన్యోన్య మకనుని గెలిచిమిగుల మంచితోనుంటిమిగదె రామావధూటి.

సీ. ఒకనాటి కలలోన సకియసకాలి పాదేవులలో జందెంబు చిక్కి-నట్లు
ఒకనాటి కలలోన సకియసే చేతిపాచీలోన నాజుట్టు చిక్కి-నట్లు
ఒకనాటి కలలోన సకియగాఁగిట జేర్చ తటిగంబె నగ్ధాన దాకినట్లు
ఒకనాటి కలలోన సకియ మెల్లననాదు గూబలో నుక్కురో కూసినట్లు

గీ. ఇన్ని విధముల కచ్చట నున్ననాటి వన్నెలన్నియు గలలోనవచ్చి యిచట
గాని గూర్చున్నవి నిన్ను బాసి యెట్లుమరులు నిలుపంగ నేర్తు రామావధూటి.

సీ. నమ్మినవాని నన్యాయంబు సేయుట కాశిలో గోహత్య గాదె కలికి
వలచి వచ్చినవాని వంచనల్ సేయుట నరహత్య గాదె పున్నాగవేణి
చెల్మిగోరినవాని జేపట్టి విడుచుట బ్రహ్మహత్యయె కాదె పంకజాక్షి
ఆడితప్పినదోష మన్నిదోషములలో మొదటిదోషము సుమ్ము మోహనాంగి

గీ. నిన్ను నమ్మితి వలచితి నీవు నన్ను బ్రేమచేపట్టితివి యింక విడువననుచు
బాసచేసితి విప్పుడే పగిది గూర్మి యణచిపోవంగ దగునె రామావధూటి.

సీ. చంద్రిఖండంబుపై జంద్రఖండము రేక నుదుట గుంకుమవంక బదిలపఱచి
కొండలపై మంచు నిండియుంచిన రీతి జనులపై వెలిరైక జక్కపఱచి
కలువరేకులఁ దుమ్మెదలు వ్రాలి యున్నట్లు కనుదోయినంజనంబునుఘటించి
బంగారు ప్రతిమల బటికనార్చినరీతి లలిజిలుగు మల్లుసెల్లాధరించి

గీ. అంగజప్రభు విజయ కాహళులపగిది గాళ్ళ సందెలుపాంజేవుల్ ఘల్లుమనుచు
మ్రోయ మెల్లనవచ్చి నామ్రోలనిలుచు టీవి మఱువంగదరమె రామావధూటి

సీ. ఒకవాఁడు మేడపై నొంటిగా కిటికీలెల్ల బిగించి నిద్రించువేళ
నల్లగా నేవచ్చి మెల్ల మెల్లన కోకముడివిప్పబో దుల్కిపడి బిగాన
లేచి చెంగటనున్న జూచి 'సెబాసురా' రండి, యటంచు నురంబుపైకి
తిరిగి నాచుబుకంబు దిపురుచు మధుర వాక్యములనన్ మరులుకొల్పి

గీ. సరసులైనట్టిమీవంటి జాణలిట్లు చెలులమాన బులను బయల్ సేయదగునె
యనుచు మంచిగ బోధించు నట్టినేర్పు నదికె మఱువంగదరమె రామావధూటి.

జేసిన నేమాయెం జక్కిముడిలేక విచ్చలవిడి రతులలో మెలగవలయు
మెలగిన నేమి యు నెడబాయ దెల్లప్పు డేకీభవించి వర్తింపవలయు

గీ. అటులవర్తింప నేమాయె నవ్విధమున జడని ప్రేమలతో దనుల్విడవలయు
హాహా యివియెల్లబూర్వ పుణ్యములు లేక మనుజులకు పొలుపడునె రామావధూటి

సీ. మేడలో జన్నెళ్ళు మెండు చల్లించి తడియొత్తి యొత్తి చాపలిడి సుమ్మృదుల
తల్పంబుబఱచి చెంతల మిఠాయిలు సర్బతులను సోడావాటరులును గల్గు
సీసాలు చక్కెరకల్ జీడిపప్పులు బాదముపప్పులను మంచిద్రాక్షపండ్లు
కజ్జాయములు ముంత ఖర్జూరముల్ గలపళ్ళెముల్ ప్రేమతో భద్రపఱచి

గీ. భోజనమొనర్చి నేను రాంగ గొలుసుప్రియా శయ్యపైని జేర్చి యుపచారములను
వేసంగిపగళ్ళ సుఖియింప జేసినట్టి సంతసంబు మఱవంగదవను రామావధూటి

సీ. కమలాక్షి! నీమోము గనుగొన్న నాకన్ను లేమియు గనుగొన నేవగించు
బింబోష్ఠి! నీమోవిని గ్రోలు నాడహ్వా యేమియు గ్రోలంగ నేవగించు
కలవాణి! నీ పల్కులు విన్న నాచెవు లేమియును వినంగ నేవగించు
కనకాంగి! నీతోడగలిసిన నాయంగమే నేమి సుస్పృశియింప నేవగించు.

గీ. సరసిజహస్త్రగంధి! నీమేనిపరిమళంబు గొన్న నానాసయెదియును మూర్కొనగబోదు
అహహ! పంచేంద్రియములు నీయందె నాటి మరలవిక నేమిసేతు రామావధూటి.

సీ. సౌధంబుపై నీళ్ళు చల్లించి చిమ్మించి చాపలు పఱపించి చారురత్న
కంబళంబులు వేసి ఘనహంసతూలికాతల్పంబు బఱపించి తమకమలర
అందుపై ననుజేర్చి యగరుగంధములుబూసి చలువపన్నీరులు చల్లి మల్లె
పూదండలను జాజి పూదండ లురమున వేసి చల్లని గాలి వీచుచుండ

గీ. రమణ నీరీతి వేసవిరాత్రులందు రాగమెచ్చంగ నిష్టోప భోగములను
నన్ను సుఖియింపజేసిన నాటికూర్మి మదిమఱవంగ వశమె రామావధూటి.

సీ. ఉదయమే లేచి నిద్ర వదలలేకైనారుగడి గులవరకుండ కదలిమేడ
దిగివచ్చుచో వాకిటికి మందుగుబగుబ నీవేగి యీవల నావలగని
'స్సై' యన నేవేగ జని బసంగోగల పనులెల్లదీర్చి సాపాటుచేసి
గంధంబుబూసి వేడ్కలమించి కెలకుల నమ్మలక్కలు బెంగ గండిమాడ

గీ. నీటుగా వచ్చుచోఁ జూచి 'నేడు దృష్టి తాకు!' నని పొద్దిగుంకిన తక్షణంబు
జీడిగింజల దృష్టి దీసిన విధంబు మఱచిపోవంగదరమె రామావధూతి.

సీ. ఊరు నేడే బైలుదేరుట నిశ్చయంబైనచో నెదురు మాటాడలేక
మోము వెల్వెలబోవ ముచ్చటలాడుచునుండి ధ్యానంబు వేఱుగాఁ దల్లడిల్లుచు
ఆమాట యీమాట లడుగుచు నుచితోపచారముల్ సేయుచు గారవమున
భోజనాంతరంబునను దమ్మము గుడాన్వితంబుగ నిచ్చి యవలఁజేయి

గీ. చేతులోనుంచి యూరికి క్షేమముగను బోయి శీఘ్రము బురమ్మని పొలుపు మీఱ
నన్ను బంపిన యానాటి నైపుణ్యంబు మఱచిపోవంగదరమె రామావధూతి.

సీ. కడుపులో గ్రమ్మని కాంక్షలూరుచునుండు నినుజ్ఞాపకము సేయ గనకగాత్రి
కనులకేమో తఱచు క్రన్నను తాల్మిగాదోచు నిన్నెన్న సౌదామినీలతాంగి
నిలువెల్ల నేమేమొ పులకపులకించు నీ తీరు స్మరియించ శీతసుముఖి
సారెకు నేమేమొ నోరూరుచుండ నీ మాటలు దలప బింబాధరోష్ఠి.

గీ. యోచనగనుండు మదికేమి తోచకుండు దిగులుగానుండు మరుమాయ దెలియకుండు
దైవమిక మముందెటులు సేయదలచినాడో మనకుఁ దెలియంగరాదు రామావధూతి.

సీ. ధరలో ననేకులు దగులుందురైన వారలయందు నెందు నీవలె నెనుంచి
గుణములు విశ్వాసంబు కుదురు సత్యము తప్పకుండుట యుక్తమయుక్తమెఱిగి
తిరుగుట వినయవిధేయత లభిమాన మాదరంబు దయా మయాంతరంగ
మందంబు చందంబు వలుకును కలుకును సమయంబునమ దెంపు పౌజ్ఞనంబు.

గీ. తగిన సరసుని జేపట్టి తప్పులొవ్వ నెఱిఁగి విడువక ప్రేమించి యేలికొనుట
తెలివితేట లుపాయముల్ లలితవాక్యమాధురియును నిన్ని గలవె? రామావధూతి.

సీ. కలగంటి నొకరాత్రి కనకాంగి నీతోటి సమరతిలో గేళి సల్పినట్లు
కలగంటి నొకరాత్రి కలకంఠి నీవుపరతిలో నను ఊపాల్పఱచినట్లు
కలగంటి నొకరాత్రి కలికి గాఢాలింగనాదిసౌఖ్యంబుల నలరినట్లు
కలగంటి నొకరాత్రి కమలాక్షి నీతోడ బంధలీలల జాల బడలినట్లు.

గీ. ఒక్కరాతిరి కలగంటి సొక్కి నేను నీదు కెమ్మోవి యానుచో నీవు నాదు
పైపెదవి నానుచును రెప్పలేక మన్ముఖము జూచునట్లు రామావధూతి.

సీ. నీయాత్మ నాయాత్మ నిజముగా నొకటంచు నామనంబు జాల నమ్మియుంటి
నాతోడఁజేసిన నమ్మిక లెప్పుడు నాఱిపోవని రూఢి పఱచియుంటి
నెవరెన్ని చెప్పిన నికనన్ను విడనాడ వంచు నామది నిశ్చయించుకొంటి
మనశరీరము లున్న నట్టులు మనసులోన పొరకల్గదని తలపోసియుంటి.

గీ. వనితరో యిప్పుడిటు కాలవశముచేత మనల యెడబాటు కల్గె నీకు విరక్తి
బొరయ లోకదుస్సంగతుల్ మఱచిపోవ సన్మార్గముగాదు రామావధూటి.

సీ. ఘనమైన మోహంబు గలవాడనౌటచే వలన నే నీకింత వలపువలసె
పటువైన యభిమాన పడు వాడనౌటచే దెలిక నీకింత బోధింపవలసె
క్రౌర్యాంగనల కాసపడు వాడనౌటచే నింతి నిన్నింత ప్రార్థింపవలసె
జెలిమి వైలక్ష్యంబు గలవాడనౌటచే వనిత నీకింతగా వ్రాయవలసె

గీ. గాక తమతమ యుక్కులల్ గడుపుకొనెడు వారలందఱిసాటి వాడనైన
నింతయేటికి ? నీకు నొక్కింతయైన మానమునను దయలేదు రామావధూటి.

సీ. కొంతకాలము నీదు గుణగణంబు లెఱుంగనేరక భయముచే నూరకుంటి
గొంతకాలము నీకు గోపమేమో యని సంశయంబున జాల జంకియుంటి
గొంతకాలము మది గోర్కులూరఁగ సంతసపురాయబారముల్ నడుపుచుంటి
గొంతకాలము నిన్ను గూడియు పల్లారుమాటలు మనములో నాటియుంటి.

గీ. గాని యీయూరులోనుండు కాలమందు నైన తమివీరరతులలో నలరనైతి
నేమిసేయుదు నయ్యయో యిప్పుడిటుల మదినిదపియించవలసె రామావధూటి.

సీ నీమోము నేనొక్క నిమిషంబు గనుగొన్న శశియేటి కనిపించు చారువదన
నీమోవి నేనొక్క నిమిషమానిన దొండపండేటి కనిపించు బల్లవోష్ఠి
నీకనులే నొక్క నిమిషంబు గనుగొన్న పద్మమేలనిపించు దరళనయన
నీబొమల్ నేనొక్క నిమిషంబు గనుగొన్న విల్లేటి కనిపించు విలసితభ్రూ

గీ. నీదు చెక్కులు నేనొక్క నిమిషమైన గనిన నద్దంబులేటికి ననుచుదోచు
నిట్టి నినుబాపియున్న నాకిపుడు జన్మమే వృథాయనితోచు రామావధూటి.

సీ. శ్రీమించు నెమ్మోము శ్యామరసపద్మంబు కన్నులు వికసిత కైరవములు
కుదురైన రదనముల్ కుందకుట్మలములు తీరైన నాసిక తిలసుమంబు
తగశాధరోష్ఠంబు దాసాని పుష్పంబు పాలుపైన పొక్కిలి పొన్నపువ్వు
ఆదోకలకు జఘను లరటిపూమొగ్గలు స్మరమందిరము శిరీషప్రసూన

శ్రీ ర స్తు.

# గణపతీయము.

(స్కాందపురాణాంతర్గతము)

క. శ్రీలక్ష్మీవక్త్రాంభోజ వి
శాలాస్తనవిలేప - చార్వంకిత న
వ్యోలావణ్య త్రిలోకీ
పాలనగుణగణ్య గోప - బాలకరేణ్యా!

వ. అవధరింపుము. సకలసుమతశోభిని యగు కాంచనమాలిని సమస్తపురాణోక్తకథారహస్యావృత్తవిప్రుండగు యజ్ఞ్వప్రున కిట్లనియె.

ఉ. ఇప్పుడు నీవు చెప్పిన య - నేకములైన రహస్యవార్తలం
దొప్పగ నామనంబలరి - యున్నది విద్యలకెల్ల నొజ్జవై
మెప్పులగన్న వాల్గమప్ప - మేటికి నిచ్చలు బ్రహ్మచర్యముం
జొప్పడియుండె నేమిటికి - చోద్యముగా వివరించి చెప్పుమా!

క. అని కాంచనమాలిని ప
ల్కినవిని విప్రోత్తముండు - క్రీతబూగాధ
వ్యాధియున్నవాడు గావున
మానసమున సంతసంబుబొంది - మగువకుననియెన్

క. వంకరతుండము వేలుపు
పొంకముగా బెండిలాడఁ - బోవకునికి నే
సంకలిపెట్టగ నుడివెద
శంకిలకను వినుము మనను - సందియ మెడలన్.

సీ. ఒకనాడు గౌరి వే - డుక దనకౌఁగిలి
యందు గుల్కాడు శిశు - వైనగుజ్జ
వేలుపు లతవలె - వ్రేలు తుండము బొట్టి
కడుపుఁ దమ్ములవంటి - కన్నుదోయి

గని భ్రమపడి రహాళిం – గను తన వ్రేలితో
నాడింప నది పిన్న – యయ్యెగట్టి
పడి నిల్పినను నాకు – పోనవ్వును దాల్చియు
భావించి నివ్వెఱ – పాటుజెంది

తే. గీ. మోహవార్ధి మునింగిన – మొఱగి మూరు
డది విలోకించి నగి సమ – యం బిదే య
టంచు దొలివగ నిటుదీర్చి – సంచులోకు
లెంచ బూచిలు కెదనాట – నేసినమును

వ. తదనంతరంబ

ఆ. వె. మనవసునందు బోడము – మన్మథ వేదన
చేత నమదినంబు – చింతజిక్కి
గారి పవలు తిండి – గానక రాతిరి
నిదుర లేక తమిని – గినుకుచుండె

వ. అంత.

ఉ. కడువేడ్కన్ మలపట్టి రొయ్కతరి జ.. ల్కంబాడి చెంగావి పా
వడపై దెల్లనివల్లెజెంగులుదరి – గ్గన్ గట్టి వజ్రంపు మే
ల్త్రాడవ్రల్ దాలిచి చన్ను చేసిన సుశోభం నక్కనం బాల్చి న
ల్లడలం దెవ్వరు లేరుగా యనుచు జ–క్కగ గాంచి లేకున్నచో న

క. తనహావభావను నకున్
మనమున నగాదంది చన్ను – మఱగి కుడుచునంద
నుని వీనులందు గుసగుస
యను చప్పుడు గాంగ నిట్టు – లాముని బల్కెన్.

తే. గీ. నిన్ను గడుపునగన్న నా – నిందుడెంద
మిట్లు మరులంది యుండగా – నెంత గడుసు
లైన తెలి తెలివలు మకు – లందు కొంత
వింత నిను జూచినంతనే – వేడ్క కొడిక !

తే. గీ. కాని నీ యూడు లేతయై । కానుపించి
యుండ మర్మావయవము బెం । పొందియుండె
నైన బెంపొందువారల । కైనసుఖము
నీకు నెబ్బంగి గల్గును । బ్రాకటముగ.

క. గజనరవిద్యలు రెండును
నిజముగ గలిగినట్టినీవు । నిపుణుగైయుంటన్
గజిబిజి నొందక నుల్లము
ఋజుమార్గంబున న్వసించె । నేమందునొకో?

చ. గొనబుగ నీకు తెల్పెద । నొకున్ బరికింపుటకై మదీయఘా
తనువునగల్గు వంగముల । దాచక నీదగు చూపుకోవ నే
సనువుగనుంతు నారసి త । దంగములన్ మది నుప్పతిల్లగా
నొనరిన యంగమొద్దినవ । రూఢిగ నిప్పుడె నాకుదెల్పవే.

వ. అనిపలికి నిగ్రహంబగు సంతోషుంపనంబున నాసుందరవదన లజ్జావనత వదనయై కదన ప్రియుండగు మదనప్రదరబాధితహృదయయై లేచి యాక్షణంబ.

సీ. ఎడలేని దడచేన । దడును దానున్నట్టి
పొటవుటువ్వరిగెత । యుప్పులు బిగించి
తడబాటుచే గన । గద వడంకెడు కేల
బొడికొక్కడప్పునడి । తొడవు నీల
సడలించి వడిపోక । ముడివీడజేసి న
గుడిసువా న్కనయగు । వెడవపిలువు
కడగొని మదుగెపా । ల్కడలిని గెలుదులు
జడిగాద్పు గాడిగ । ప్పెడు వదువున

తే॥ గీ॥ పుడమి నంతట గప్పన । ప్పుడు బెడంగు
టడలున బడంతి వెడవింటి । గదును గిదును
టడిదమున నిల్వబడియుండ । బుడుతకొడుక
డుడిగిపోనట్టి వెడగున । జడసికాంచె

శా. అంతట పార్వతి పుష్పసెజ్జపయి దా - నాసీనయై జానుగా
నెంతో కూరిమిఁ బారసాచి సుతు - నల్లేతేరగా బిల్చి యా
ద్యంతద్వేశము నందు నుంచి ఘనమో - హాభ్రాంతి జన్మార్గ ము
త్యంతాశక్తి దలిర్పమూర్కొనుచు గా - ద్గద్యంబుతో నిట్లనెన్.

క. కటకట యేమిదియఘటిత
ఘటనానిర్వాహకుడగు - కాముడితని హృ
త్పుటమందు నిలిచి యాశల
నిటు బుట్టగ జేయుచుండె - నేతలపోయెన్.

తే॥ గీ॥ అట్టుగాకున్న నీతడు - యందమెుల్క
చుటుకు జూపున నిట్టట్టు - జూచినాడు
యూరుయుగలక్ష్మిపాయల - నలకచలన
మించుకయు లేక నెందుకు - బొందుచూడు.

వ అని యిట్లు పార్వతివల తెలకట్టుతనమతియుం దలిరయు నుత్సుకంబు
వితర్కించి చతురోక్తి నగ్గపతిను ద్దేశించి యిట్లనియె.

చ బాలుమడి యెక్కువింట వడి-పొంకపుచూపుల కోరి దార్ప్రియ
భ్రమము నలక్కట్టినాని విరి పానుపు పోజేసునేల గుత్తునా
తమంయుదలింపుకోడ గప - తం తనుపోటులయాట మాటిసే
యుముననునీ నెదర్చి యటు- లోపమి యెచ్చటి ముద్దుగొమ్మనన్.

ఆ. వె. పలికినంత సేపు - పాపజందె ము వేల్పు
పక్కకొండకద్ది - కెక్కువంక
కొండపై చిగుర్చు - గోనబుపాకుడు కిన
యైన మాలగేల - నాడశేసె.

ఆ. వె. అపుడు పనుచు మెఱుపు - టద్దంబు బింకము
గ్రక్కనగట్టువట్టి - పొక్కలీగు
సెలమవెడలి సుతను గలతావి కీడుగు
తావి వానిముక్కు - గ్రోవి సొచ్చె

ఆ. వె. సెలమనడుమ బెళుకు – గలచాలునకు నిరు
వంకలందు బొంగు – పరలుమోవి
కెంపుగవ వెలుంగు – గిడసజేజే కన్ను
దోయి కలుకుమించి – తూలఁజేసె.

ఉ. అత్తఱి పిన్నచే దన ర – హోంగము నాలఁడు యూడ్చిచూడరా
చిత్తఱియైన సత్తియుది – వేడుక లూనుకొవంగ గుంద్రగా
నొత్తుకయున్న స్వేదయుగ – మొయ్యన దా నెడకొల్పి తూరుగా
జ్యోత్తమమందు బుత్రివతి – నొప్పుగపట్టముగట్టె దిట్టయై.

చ. తనయుని జూచి సంతసపు – తావిపుడెన్నగ నీమచేతికిం
గనులకు లోగియుండ నల – కాయముఁ డెవ్వరివాడటంచు జ
య్యన గిరికన్యబల్క వెస – కాయ్యన స్మరాలయశీర్షమింపుగాఁ
దన చిత్రవేలం ద్రుమవ్వ శశి – ధాత్రికి గుండియ ఝల్లుఝల్లుమన్.

క. సంతోష మినుమడింపఁగ
నంతటఁ దనుజూచి నగుచు – యటుగేజెను త
త్సంతానపురుషుఁ గని య
క్కాంతాతిలకంబు బలికె – గాద్గద్యముతోన్.

చ. మురిపెపు టెక్కుజక్కునిట – ముందెఱుగందగు యీడు లేదటం
చటిముటి నెంతునే భళి! గ – ణాధిప నీ వరలేక గట్టిగా
నెఱుఁగుదు విల్లు మైకమున – నిద్దరిముం బడియున్న వార మి
త్తఱి దడవేల తుండసుర – తం బొనరింపుము కోరిక దీరగన్.

క. నేనునుడివిన నుడు విదియే
మానని తలపోయబోక – ననువుగ నోడులో
గా నీతుండము పొనుపుము
దానికి శైథసగుణంబు – తవులు గణపతీ!

వ. అని పలికిన

శా. గండోష్ప్రక్ జననీవచోవిభవ మ । శ్యాంతుండు యాలించి పై
నిండారన్ ఘనమోహవల్లి యెసంగ । న్నే ర్పేర్పండగా శన
చ్ఛుండాపాశము జక్కదిద్ది గుదె । పోద్యంబుగా జేసి నే
దండాస్యుం డటు తల్లియల్లకడనా । తలోర్పగా దీసెగా.

వ. అయ్యెడ.

మా. సరసంబౌ రతిరల్పు నెంతయు మదిన్ । శర్వాణి వాంఛించి త
త్సురతానందము యబ్బినట్లలరి యా । త్సాశంబుతో వర్తుల
స్ఫురితాద్రిప్రతియా నితంబము మఱిన్ । జొప్పేర్పడ న్విచ్చి త
త్కరివక్త్రోన్నత తుండ కామమును త । ద్వర్తక్ జనంగానిడెన్.

కం. అని యివ్విధంబున దా నుడి
విన కథవిని చిగ్గుగఱచి । వెరగందిన శాం
చనమాలిని భావముగను
గొని యప్పారుండు బలికె । గుతుకితమతియై.

సీ. ఇలగల్గు పడుచుల । నెల్ల కోరియు డిలిట్లు
గరగను ఇదియె । యబ్బురముగాదు
నిబ్బరంబుగనుండు । సిందారుమరులతో
గాసి కోన్నాడి సి । శ్రమగ నుండు
గాని యెన్నడు హాయు । గల్గదు మూడవ
యుగమందు ద్రోవది । సొగసత్తైన
పట్టిం దంద్రడిసి దోడం । బుట్టువుజూచిన
కొలలకు యొడికట్టు । చెన్నుగిల్లు

తే॥ గీ॥ ననుచు గరివేల్పుతోనంట । వినగలేదా
గాననిటువలె కొండరా । కూన బసిన
వెతల్పై పవ్వబోక నీ । వెఱగుమాని
యవలి కతవిను కొనదాశ । ననుచుబలికె.

వ. అయ్యవసరంబున,

ఆ. వె. మదను తాకచేత — నదుగు బాబా కామ
మాడ్కి పెద్దయగుచు — మసలుచుండ
మదనమైనంతమిసి — బొదలుచు కొడుకవ
భాగ్యముపిరమంచు — బరగ నదుము

మత్తకోకిల

ఇట్టి కొండొ యక్కటా! భరి — యింప నెవరుయోళ్ళనా
రట్టి సీగరికొన్న తుండము — నబ్బ! యుత్తర సెంచన
నట్టులిట్టులు సేసెనొవ్వున — హాళినీ పజకాముతో
గట్టిగాగతిసల్పి యన్నదె — కావుమంచనెఁ గాళిదాన్

వ. ఇట్లు పలికిన,

తే. గీ. నిప్పులంబుగ నెక్కులు — నిగుడ గౌరి
దిగులుపడి పల్కెనసి వావి — దెగడు కొడుకు
సెలఁగి లెనరును యలుకును — సిగ్గు నెదలి
యట్ల నడిపించె నిశ్చన — వ్యాపాతముగ.

ఆ. వె. అప్పుడు నొప్పిచేత — నలిచెడు దుర్గపై
నగిరి నగియె నసఁగ — నెసగు మన్మ
ధాలయంపుకొప్పు — యకాక్కమయదలిన
నగిరి విచ్చుచుండె — నేపురిూఁజ.

కం. పాపడు కవపనిసేయుఁగ
గోపుర మెగిరెగిరి వెనుక — గుదుకుగలిగి తా
నేవ్వాని కెంపు మొగడల
రూపున నిల్కడనహించె — నటముజలిర్పన్.

ఆ. వె. అట్టివిసువుతల్లి — గట్టిగా గవిసెడు
వేళ సెలమకొప్పు — విరివిఁగాంచె
సెలమలోని సెలమ — శీఘ్రతరంబుగ
తుంపధండమునను — త్రుళ్ళినడచె.

గని వేడ్క నవ్వుచుఁ – గాఁగిలింపుచు నీదు
లేని యానందము – బూని యొసఁగి
నట్టి నీవంటి దయా – శాలి కేలి
నెనరైన బ్రత్యుప – కృతిని యేమి
తే. గీ. సేయనేరను, యిటుగానఁ – జెడుగులైన
యన్యకాంతల నుద్వాహ – మ్మాడి నేను
కొనక నిష్టల పటుతత్వ – మెనసి యుందు
మదియె ప్రత్యుపకృతి యని – యెంచుపుత్ర!
ఆ. వె. నాదు భాగ్యమిట్లు – నను రక్షించువానికిఁ
గాక నేరికైనఁ – గలుగ దెందుఁ
గాన నన్ను నీవు – నైన నన్నెప్పుడు
నెనసి సుతను దనపి – మనుము పుత్ర!
కం. అను జననిపలుకు విని కొడు
కనుమతమునఁ బొంది పెండి – లటు దెగి నలుఁడై
జఁ నీమనోహరుండై
మనె. నవ్యాసము దాఁగివపాలు – ష్మాకీ రుచి యగునే?
కం. అని చెప్పి గర్గకతఁ దెలి
పినఁ గాంచనమాలి నలరి – విస్మయింపకఁ జిగం
తనవృత్తాంతం బొకట్టి
వినవలతున్ గరుఁ జెప్ప – వే విప్రవరా!
కం. శివుఁడా మోహినియగు వి
ష్ణువుతో రతిసల్పి యొక్క – సుతు భైరవు నిం
పుపరలగని సౌఖ్యంబుఁ
దివిరెనఁట గణింప దీనిఁ – దెల్పుము విప్రా!
వ. అని యడిగిన కాంచనమాలిని కఖిల మహిమాన్విత విప్రుండగు యవ్విప్రుం డిట్లనియె.

(గ్రంథ మింతవరకు మాత్రము సముపలబ్ధమైనది)

శ్రీరస్తు

# శిష్యవిజయము

క, "శ్రీకంఠుని తలమీఁదను
కూర్చొంటివి ముఱికితొత్త! ♦ కూర్చోఁ నటవే
నీ కెట్లు మేనుజిక్కెను
పూఁకా" యనుసతుల మెచ్చు ♦ పురుషుఁ దలంతున్.

ఆ. వె. గంగ చున్ను లంటు ♦ గా జేయునత్తంగ
లోన చంకయీఁకె ♦ లూనిపట్టి
లాగు గౌరి నెంతు ♦ వేగ దాసిని తూఁల
గసరు విభుని మెచ్చు ♦ గంగఁదలంతు.

ఆ. వె. పట్టువట్టుమంచు ♦ పదిమందినైనను
డెంగగలవె! దూలఁ ♦ దీర్చగలవె!
విడువవేల నున్న ♦ పడతుల! నను రాధ
మాట కులుకు హరిని ♦ మదిదలంతు

క. "జాలా నీ చనుగొండలు
వాలుటకున్ గారణంబు ♦ వచియింపు' మనఁ
"మూలమునఁ బట్టి త్రవ్వఁగ
కూలవె!" యను నట్టి రాధ ♦ కున్నతిఁ జేతున్.

ఆ. వె. జవతపాలచేత ♦ సర్వకాలంబులు
మసలువాని కింట ♦ మంచమేల!
వల్లులెక్కుటకునా! ♦ నాకొఱకా! యని
వాణి పలుక, నేడ్చు ♦ బ్రహ్మఁ గొలుతు.

ఆ. వె. "అబల! యింటనీవు ♦ నరగడియైనను
మెలఁగ నెట్లుకూడ ♦ గలుగుదు! నన

"పప్పు వెల్లబెట్టి ♦ పదుకొందు నీకొఱ"
కంచు దెప్పవాణి ♦ నాశ్రయింతు.

♦ సీ. వ్యాసునినోటిలో ♦ పాసాకింత విదల్చి
వాల్మీకి కంచులో ♦ భాగమిచ్చి
కాళిదాసుండుంచు ♦ కాంతను సడదెంగి
భోజుని నోట నా ♦ మొడ్డపెట్టి
శ్రీహర్షునిల్లాలి ♦ సిండబ్రబద్ద చేసి
దండి వేలికి నాదు ♦ దండమిచ్చి
భవభూతితల్లిని ♦ పలునూర్లు విపయించి
మాఘుపెద్దత్తకు ♦ మచ్చికపడి
తే. గీ. నన్నయాభిఖ్యసతిగొల్లి ♦ సలగదెంగి
తిక్కకవియాలి చనుమొన ♦ లొక్కి నొక్కి
శప్పవిజయంబుఁ జెప్పెద ♦ చదువుకారి
కేకదంతుండు నిచ్చుత ♦ సింతబొచ్చు.

---

ఈపద్యము కవి జాతబేద మువిధముగా బ్రచారములో నున్నది.

సీ. ముందుగా వాల్మీకి ♦ మునిలితొప్పెను బ్రమొక్కి
వ్యాసునిశిశ్నంపు ♦ పాసుకడిగి
భట్టమయూరుని ♦ వట్టలు పూజించి
శివభద్రునాతులు ♦ చిక్కుదీసి
భవభూతి మొదలైన ♦ బహుగ్రంథకారుల
పృషణాలపొక్కులు ♦ వెదికిచితికి
కాళిదాసుని పింగు ♦ గాగిటగదియించి
మొల్లగొల్లికి నాదు ♦ చుల్లజూపి
తే. గీ. మార్తిగవినోట గాడిద ♦ మొడ్డపెట్టి
పెద్దనార్యునిగుద్దకు ♦ పేకుకొట్టి
చెప్పెదను శప్పవిజయమ్ము ♦ చిత్తగింపు
డేకదంతుండు మీకిచ్చు ♦ నింతబొచ్చు

చ. ఒకనిక విత్వాము న్వ్రాయుచు ♦ నూరక, యుండను, నాకవిత్వమం
బొక రొకతప్పుదిద్దు నెడ ♦ నూకొని చూడను, రంపక త్తితో
సిక మెయిద లంటఁగోసెదను ♦ చెప్పునఁగొట్టెద మోముదన్నెదన్
పక పక నవ్వి వ్రూసెద ♦ న పండితనోటను మొడ్డపెట్టెదన్

వ. సకలాభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పం బోవు కప్పవిజయంబునకుఁ గథావిధా ం బెట్టిదనిన.

తే. గీ. అనుఁగుదమ్ములతో రాముఁ ♦ డడవియందు
నున్న, వాల్మీకి చనుదెంచి, ♦ యోనృపాల
చంద్రమా! యన రాముఁడు ♦ సఱగవాని
సమితవిధులను బూజించి ♦ యుసియె నిల్లు

కం. మునివర! నాకొకసంగతి
వినుపింపగవలెను సురులు ♦ వేడుకతో దే
విని గొనివచ్చిరి భూమికి
నవయము భూసురులటంచు ♦ ననుచుంద్రుకదా

కం. అన విని నవ్వుచు రాముని
గనుగొని వచియించె నిటుల, ♦ కౌసల్యాసుతా
వినవయ్య తగినసంగతి
వినియుంటిని నేనుతొల్లి ♦ వివిధంబులుగాన్.

కం. పెనమునగల నూనెను నే
గిఁబూరెవిధాన వార్ధి ♦ కిన్ మధ్యముగా
గనువట్టు లంకయయ్యాది
ఘనద్వీపంబంను రాది ♦ కవిభాంచోతుల్.

ఆ. వె. వాళ్ళుతిల్లిదెంగ ♦ వర్ణించియున్నారు
యింకనింతయైన ♦ శంక లేక
మగుడదానినేల ♦ మాటిమాటి వర్ణింప
చదువువారికక్క ♦ జంబు గొలుప.

ఆ. వె. ఐనగొంతవఱకు ♦ నైనను వర్ణింప
కుందునేని కవులు ♦ మ . . డ . చు
దిట్టగలరు, గాన ♦ నట్టి యూరంకను
బాగడఁ ధాతయైనఁ ♦ దగదు తగదు.

తే. గీ. శుక్రుడును మున్ను గల్గు న ♦ సురలు విశ్వ
కర్మదరికేగి వానియూ ♦ కెలను చిక్క
దీయఁగా నట్టికేలకు ♦ దివ్యమైన
పట్టణముగట్టి లంక నాఁ ♦ బెట్టిబేరు.

తే. గీ. మట్టుగలకాంతలను పసి ♦ పెట్టినేని
మువ్వతివ్వలబెట్టుచు ♦ తోప్పదూర్చి
ర క మొల్కుచునుండగా ♦ రతిక దూర్చి
దప్పి విడిచెడి ఘోటక ♦ తతులు గలవు

తే. గీ. అచట యేన్గులు విమయించు ♦ నపుడు కాళ్ళ
క్రిందనున్నట్టి కొండలు ♦ కెడలి నలగి
పిండిగారాలి వారధి ♦ నుండ దాని
నిసుక యంచును బల్కుదు ♦ రెల్లవారు.

తే. గీ. పట్టణము స్వర్ణమయ మటంచు ♦ భాసిలంగ
మేడలనుగూడ వర్ణించ ♦ నేడ, మాదు
పద్యముఘబాదు గానేల, ♦ బాగు బాగు
భవనములుగూడ నట్టివై ♦ వన్నెకెక్కు.

తే. గీ. అచటగల పూలవనముల ♦ యందు గల్గు
పూవులెల్లను రక్కసి ♦ పూవుబోండ్లు
పూనుకొం దోఁపుకుందురు ♦ పుష్పమాన
మైనచో వానిబాగడ న ♦ వ్వానితరము.

తే. గీ. లంకగలరాక్షసుల యొక్క ♦ బింకమైన
మంత్రములు పోకమానుల ♦ మించియుండ

వారి యాకారముల నేల । వర్ణనంబు
చేయువలె ప్రాజ్ఞులెల్లరి । స్సీ యనంగ.

సీ. గడ్డికుప్పలబోలఁ । గలయట్టి చన్నులు
కరిగర్భములవలె । గర్భములును
బండి చక్రములట్లు । భాసిల్లు పిఱుదులు
గాన్గులంబోలిన । కంఠములును
ఆదికూర్మముబోలి । నట్టి పాదంబులు
మందరగిరివంటి । మధ్యములును
బారలతోఁ గొల్వ । నేరని యూరువులు
జగతిలో లేనట్టి । జంఘములును

తే. గీ. గల్లుకాంతల పూకులఁ । గల్గినట్టి
పెండ్రుకల దీర్ఘములజెప్ప । వేధ తరమె!
యుల త్రికోణపుబిలముల । యావరణలు
లోతులంగన్నఁ గన్నట్టు । నూతులవలె.

తే. గీ. ఎట్టి చెలియైన తనకొంగు । నెత్తియుచ్చ
బోయ నయ్యాది యొకక్రోసు । పొడవు బడును
పురుషులు గూడ నట్టులే । పొతుకేని
మించుపో యంతకంటెను । కొంచెమంత.

తే. గీ. సంగలంజాపి "గాదెంగు । దెంగు" మనుచు
కొంగు తెగదీసి యాపురి । కోమలాంగు
లంగడులలోనఁ దిరుగుదు । రనుదినంబు
దొంగ మేఢ్రంబు లెల్లను । దోపుకొనుదు.

తే. గీ. పురిస గల రాక్షసులు మేఢ్ర । ములనుజూచి
కొట్టునెడ తాళవృక్షముల్ । గూడ నేల
పడుచు నందుదు కాంతలు । పక్కచేరి
దోపుకొందురు పూకుల । లోపలగను.

తే. గీ అట్టి లంకాపురిని గల్గు - నట్టిదివ్య
భవనములలోన, నొకమహాభవనమందు
పెన్కపావడి(పక్కను - పెద్దపూల
తోటలో కుంభకర్ణుడు - తూగియుండె.

సీ. ముకురంధ్రములనుండి - పోయివచ్చుచు నున్న
గాలిచే తరువులు - గదలచుండ
తొడలలో తాబుర - మడిబాగోగా
రజము కుప్పలుగాక - రాలుచుండ
లవ్వు దవ్వుకు పిత్తి - నట్టియా పిత్తులు
గర్జనంబులబాకి - గానటింప
కనుగొలంకులనుండి - కారుడు పుసినీరు
ముద్దముద్దలు గట్టి - పులియుచుండ

తే.గీ నాపులించిన భూతము - లవలభార
నొత్తిగిల్లిన మృగములు - సర్వవేది
ప్రక్కలంబడి (మగ్గున - పారసిన
నిద్రనుండె యారజ - నీచరుండు.

తే. గీ. తవదు కువకాంత మిక్కిలి - తత్తరమున
పూకపై నీకెలప్పయు - బుగ్గతోడ
నీకొని మట్టుస్నానంబు - చేసితగిన
భూమలం దోడిగియుండాల్చె - పుట్టమొకటి.

తే. గీ. పుట్టుముప గట్టి నడుటను - బొట్టుపెట్టి
వేచి యుంచిన మాంసంబు - వేడివింత
నంజుకొంచును చల్దియ - న్నముకు గుడిచి
మిట్టమధ్యాహ్నమున రతి - మనసుకల్గి.

సీ. పట్టినొక్కము దల్లు - గట్టిగా చేతుల
సంచుతెలకదు సడ - లించినటు

ముద్దుబెట్టుము బుగ్గ ♦ మోహంబు రేగఁగా
నంచును మూతి కం ♦ దిచ్చునట్లు
కౌఁగలించుము మేను ♦ కసికీఱిపోయెను
వగిదినంచును ముందు ♦ నడిచయట్లు
మూర్ఛ మింగున మొడ్డ ♦ దూల దీఱెను రీతి
వే యని పూకెళ్ళ ♦ బెట్టి [illegible]

తే. గీ. స్వప్నమాయంగనె పాపము । స్వచ్ఛమైన
కోటగుమ్మంబులా గున్న । కొమ్మగోరి
కన్న దాతఁగ గాంచిన । కారణమున
మెదలె నాకుంభకర్ణుని । మేఢ్రమంత

తే. గీ. మెదలి యేతము వలెలేచి । మిన్నుముట్టె
నేరు వర్ణింపనేర్తురు । [illegible]
కొలత గుదియేమొ య[illegible] । దలచి స్వర్గ
వాసులెల్లరు దేవేంద్ర । నాలికేగి.

కం. దేవా యేమని తెల్పుదు
మీవిట నదేమొగాని । యేర్పడె దాసిన్
భావింపగ నిర్భేద్యము
[illegible] వింపంగన్

తే. గీ. ఇంద్రుడైరావతము నెక్కి । యింపుగుంభక
ర్ణుని మేఢ్రంపు । గుండు జూచి
[illegible]గ్రామునోఁ బుట్టె నదియేమొ । స్వాంతమునకు
బోధపడకుండెనని తాను । బోయెవేగ.

తే. గీ. మనబృహస్పతి యెఱుగు నీ । మాయ వాని
బిలువ నంపింతునని యెంచి । పిలువనంపె
భటులుకొందఱు వారేగి । వాసవుండు
తమకొఱకు మమ్ముబంపెనో । తాపసేంద్ర!

కం. అని పలుకగ విని యాతడు
మనమున సంతోషమంది – "మానిని! నే నిం
దాకిఁ జూడఁజోవవలె నీ
తనిఁ జూడుమ ప్రీతి" నని – సుధానిధిఁజూపెన్
తే. గీ. ఎచటకేగిన నీతవి – నేల నాకు
నొప్పఁ జెప్పద రోక మీకే – యుండె నొక్క
వీనిపైఁ బ్రీతి నేలేని – దానివలెను
గానుపించెదనే మీదు – కన్నులకును ?
కం. అని వానితోడబలికిన
విని యంత నతండు జరుగు – విధు లరయుటలో
మునిగిఁకొని యుండ తారా
వనితామణి యాత్మనిటుల – భావించుకొనెన్.
తే. గీ. పోవఁ డింకేలనీమది – ముండకొడుకు
జామగా వచ్చె పిలుపంది – జాగుసేయ
కుండె నని పోనిలేదని – పోగకనులు
చందురుని మీదబజిపె – నా చంద్రవదన
తే. గీ. గురువుగా రేగుమన్నారు – గురుని పనులు
బడియె నీ తలపైన నీ భారమెట్లు
మోపెదవో యంచు దరిజేరి – ముద్దుపెట్టి
తారకారాజ నా తార – తాటితాటి
తే. గీ. తారకా రాజవా నీవు – తారనేరు
మనలమాత్రమె యుంచి తా – జనును కాదె
భయముచేతను నిద్దుర – బట్టదికను
నీవుకుంగూడ నావంటి – నియతిగొనుము
తే. గీ. పాడు వేదమ్ములెల్లను – బఠనచేసి
చకచదనముఁ గొంతుక – చక్కదనము

బాడుజేయుచు నుంటి — పాట నీకు
నేర్పెదనుగాన నాయొద్ద — నే పరుండు

తే. గీ. అపకర్మంబులనుజేయు — నట్టి వేద
మేల చదివెదు ఛీ! నాకు — చాలకష్ట
మట్టి వేదము విందు వహా! — యిదేమొ
కాంచ గూడదెమటి కొన్ని — గ్రంధములను?

తే. గీ. ఒడుగు చేయింతునో చిన్ని — బుడతవాని
కహహా! పెండిలి చేయింప — నరుగువాడ
వా? పఠియింపుము యేటికీ — పాడు వేద
మెవరు బోధించిరయ్యొ నీ — కిది వృథాగా

తే. గీ. క్రొత్తవారలుదీనిని — గొప్పగాను
భావనలు చేయుచుందురు — ప్రాతవడ్డ
వినుకుగొందురు పనులేరు — వినిన మెత్తు
రక్కటా! కైతగానమూ — హావరింపు.

తే. గీ. కవనమల్లుట నేర్పెదఁ — గాకయున్న
వీణెనేర్పెద సంగీత — విధులలోన
ప్రాజ్ఞునిగ జేతు నేర్చుకో — పాడువేద
మెవరు మెత్తురు? దానియం — దేమి ఘనత?

తే. గీ. కదన మల్లిన సంగీత — కళయెఱిగిన
పనులు కొనియాడు చుందురు — పట్టుపట్టి
కామినులు నీదు కూటమి — కైదలంతు
రయ్యయో వేదమేల నీ — యందమునకు.

తే. గీ. చదివితిని కావ్యములుకొన్ని — చాలవరకు
శాస్త్రముల జూచినావు ర — సమ్ములెల్ల
నేర్చితివి. గాన కవనము — నేర్పెదేను
కాతతో మైత్రిమాని పె — త్తనము బూను

తే. గీ. తాత పెండిలిఁ జేయగా – తరలునపుడు
పోయెనటె నీవు, బియ్యపు – మూటమోయ
చదువుచుంటివి వేద [illegible] – [illegible]చాలు
వేద మెటువంటిదో [illegible] – లేను నీకు

తే. గీ. భాగ్యపై రోతబుట్టించు – భార్యయైన
పతిని మెచ్చని యట్లు చే – ద్పరచు, పరుల
కాంతనై నను మోహింప – గడఁగనేని
వలవ దనిపించు వేదమ్ము – శాస్త్రమమ్మ.

తే. గీ. మంత్రిసత్తించు తుదకు సం – తుష్టిఁ గ్రాంచి
సొగసు చెడగొట్టు [illegible] – దిగులబెట్టి
ముదిమి గనుపించు రోతను – ముట్టడించు
వెఱ్ఱివెంకన్నలకుదప్ప – వేదమేల?

తే. గీ. తాతతోఁగూడి నీవును – తాతబుద్ధి
నేర్చుకొనఁబోకు. నావలె – నీవు భార్య
దుఃఖపడు నిన్ను గాంచియే – తుదిని నేను
ప్రాణములతోడ నుంటి ని – ప్పటునందు.

తే. గీ అనుచు కన్నీటు తన జాణ – తెమ్మ జూచి
వంతలో చందురుడు వేగ – నరిగె గదికి
తారయుంగూడ – నాతనిజేరఁ జరిగి
కంచుకము దీసి యాసుధా – కరుని కొనగ,

తే. గీ. 'ప్రాణమా, వీపుపై జూడు – మబ్బ! చీమ
ప్రాకుచున్నది' యన వాడు – బాల వీపుఁ
జూచుచుండగ పయ్యెద – చెంగుజార్చి
కసరు వంతయు బరికింపఁ – గావలెనని

తే. గీ స్వర్ణమయకాంతులం దేలు – చానవీపు
చేతితో [illegible]

'అచట గా దిచ్చటగా — దిచట' యనుచు
మెల్ల మెల్లనఁ దసచీరె — నెల్ల విప్పె.

తే. గీ. 'ఇదిగో కంఠంబుపైఁ బ్రాకె — వెదకు' మనుచు
వస్త్రహీనంబుగా వాని — వైపు దిరిగ
పాప మాతండు కంఠంబు — పైని చీమ
వెదకుచుండెను. వెదుక నా — విద్రుమోష్ఠి.

తే. గీ. బంగారపుబొంగరాలను — భంగపడఁగఁ
దొరికొనఁగలయట్టి యా చను — దోయి వాని
యొమ్ముగం జేర్చి "యదిగో కం — ఠమ్ము దాటి
మధ్య కరుదెంచె చూడు చీ — మనుచు 'తాకి
చూచు' మని జూపె చన్నుఁ దా — రావధూటి.

తే. గీ. వస్త్రహీనంబులై యున్న — వనితచనులు
కనులారంగ వీక్షించి — కాని చీమ
ప్రాకనిదె యంచు చన్నుల — బట్టి యెత్తి
పానుపున నుంచి చంద్రుండు — పలుకరించె.

తే. గీ. పానుపున బెట్టి చన్నుల — బట్టి మోవి
పలువిధమ్ముల నాని యా — కలికి తమ్మ
లమ్ము పొదను గరచి వే — నెమ్మి మోజు
రతికి దార్కొన శశి యను — రాగమునను.

కం. బట్టినచన్నులఁ బట్టుక
పెట్టిన యాపెట్టు మగుడి — విడుపకే దానిన్
దిట్టముగా రచియించెను
నెట్టిన తమకంబుతోడ — నియతి దలిర్పన్.

తే. గీ అంత నాతారవాసిని — పంతమూని
క్రిందికిం ద్రోసి పైకెక్కి — పొందు చెంద

జేసి తమిహెచ్చి యుపరతి – చేయఁదొడఁగె
నత్తి యాతని నెమరొత్తి – యొత్తుమనుచు.

తే. గీ. పికిలిపిట్టలవిధమునఁ – బెనఁగి పెనఁగి
జాగిలంబులపోలిక – సాగి సాగి
పాము లట్టుల మెలికలు – పడుచు విడుచు
సమరతికి సంతసంబొందె నా – చాన తాను

తే. గీ. ముద్దునకు ముద్దు తగు వల – పునకు వలపు
దెప్పునకు దెప్పు తిట్టుకు – దిట్టు మఱియుఁ
గాటునకు కాటుగాను చీ – కాకులంది
సమరతులఁ దేలిరంత నా – చాన విభుడు.

తే. గీ. మూడురతులిట్లు దేలి యా – ముగుదమిన్న
చన్ను నొకచేత బట్టి యా – చన్ను మొనను
వానినోటి కందీయఁగ – వాఁడు బాలు
మాడ్కిఁ గ్రాఁవుచుండగా – మందయాన.

తే. గీ. వానితలబట్టి తనచన్ను – వానియెదను
నానునట్లు సేయ వేరొక – చన్ను మొనను
రెండు వ్రేళ్ళను నుంపగా – "దుండగి" యని
ముద్దులం బెట్టి వాని న – మ్మోము తార.

తే. గీ. "మగువ కోరిన చనువీయ – దగదు యెంత
కైన" నన వానిపుట్టము – రతిరయమున
లాగివైచియు 'దెంగు నే – వేగ' ననుచు
వాని బ్రతిమాలఁదొడఁగె న – వ్వాఁడు వేగ.

తే. గీ. వస్త్రహీనంబుగా నున్న – వనిత నడుము
బట్టి దరి జేర్చుకొనియె నా – బాల వాని
క్రింద పడద్రోసి తన దగు – క్రిందపెదవి
చప్పరించియు నిలబడె – యొప్పునటులఁ.

క. నిలబడి నవ్వినదానిని
గని విభు డతిలజ్జ చెంది - కాళ్ళ న్మ్రొకువన్
వనితామణి విడదీయుచు
గనుగొని చేపట్ట ముద్దు - గన్మని పెట్టెన్.

తే. గీ. ముద్దు బెట్టినతోడనే - మొదటి తెఱగు
గాను చుల్లను నొకచేత - గూని పట్టి
"నీద? నాదా?" యటంచును - వాదకూడి
"నీదె" యనిపించె వానిచే - నెఱతతుదకు.

తే. గీ. "నీవె యివి" యంచు - చన్నులు నేర్పుగాను
చేతులకు నిచ్చి "నాదిది - చేతు" ననుచు
మగుడ సంధింపగా జేసి - బిగువుచూపి
కౌగలించెను దగ్గర - గాను జేర్చి.

తే. గీ. కూరుచుని యుండియే కొంత-గొడవజరిపి
యున్న కాంతను జూచి యా - చన్నుగవను
పట్టి పడద్రోసి పైబడి - బాలకుస్పృహ
తప్పునట్టుగ గూడె పె - త్తనము గాదె!

తే. గీ. చన్నులంబట్టి పడద్రోయు - చున్న యట్టి
సమయమున జ్ఞప్తికలదు, పై - సమయమునను
జ్ఞప్తిమాత్రము లేకయె - తృప్తిగనెను
నహహా ! యెంతటివాడు సు - ధాకరుండు.

తే. గీ వ ద్దుబెట్టుట యెరుగదు - మోము నెత్తి
పెదవి యానుట యెరుగదు - గదియజేరి
రతి నొనర్చుట యెరుగదు - రాజు పాన్పు
దిగుట యెరుగదు యేమని - తెలుపవచ్చు

తే. గీ. పాన్పు దిగి సోముడు దాని - వలువసర్ది
తాను తనవుట్టమును గట్టు - తటిని చనుల

గళమున రుద్రాక్షలు నుం
గలవానిలజూచి నవ్వ — గడంగరె రసికుల్

క. పగలనక రాత్రి యనకయు
తెగగూడుచు నుండె విభుడు — తికమక పడుచున్
తగురీతి నతడు విసిగిన
తగులుకొనక జట్టువిప్పి — తారయు నతనిన్.

తే. గీ. పూలతోటల మాలతి — పొదలలోన
పాన్పుపై సేల్పుపై చెంగు — బఱచుకొంచు
పట్టపగ లింట తలుపులు — బయలుచేసి
మెలగు చుండిరి యేమన — గలరు పరులు?

తే. గీ. అన్నిటికి యేమిగాని యా — యబ్జ వదన
వంటచేయుచునున్న యా — వట్టునైన
మనసు పుట్టిన మడివిప్పి — మరులుకొనుచు
దగులు కొనుచుండు విభుతోడ — దగవులాడి.

తే. గీ. ఎన్నడేయు మడివిప్ప — దేవికాంత
'తొందరగ నున్న"దనుచు విభుని 'పటంబు
విప్పి రి" మ్మని వంటింట — వివిధగతుల
గూడుచుందురు మితిలేని — కూర్మితోడ.

సీ. స్నానంబు చేయించు — చలువ పన్నీటను
పట్టుపుట్టము గట్టి — పెట్టుతాన
అన్నముం దినిపించు — నదె బ్రతిమాలుచు
విడిచిన యన్నంబు — గుడుచుతాన
తిలకంబు దిద్దిము — ద్దులు మూటగట్టగా
పీటపై గూర్చుండ — బెట్టుతాన
ముస్తాబుచేయును — మురువు కొల్పెడురీతి
విడియంబు నోటను — బెట్టుతాన

తే. గీ. పాన్పు శుభ్రముగా జేసి ♦ వచ్చి స్నాన
మాడు సందాక తనయొద్ద ♦ నతని నుంచు
మనుచు బ్రార్థించి తరువాత ♦ ననుపమాన
మైన తెలుగున ముస్తాబు ♦ లై చెలంగు.

తే. గీ. అంత ముస్తాబుగా తయా ♦ రౌచు తైక
మాత్రమే తోడుగ మనుచు ♦ మాటిమాటి
కల్లవానిని బ్రతిమాలి ♦ యతనిచేత
కోరి తొడిగించు కొనుచుండు ♦ కొమ్మ సతము

తే. గీ. ఆతఁడే నగలిచ్చిన ♦ యానగలనె
యాత డేచీర లిచ్చిన ♦ నద్దిమాత్ర
మాతడే తైక నొసగిన ♦ నదియు గాని
తానుమాత్రము స్వాతంత్ర్య ♦ మూనదెపుడు.

తే గీ. అది యతండొక్క రీతి త ♦ యారులగుచు
నిలువుటద్దంబు దరికేగి ♦ నిలచి "మనల
లోన బాగుండునది నీవ ♦ నేన?" యనుచు
తగవులాడుచు, తుదకెల్ల ♦ తగవు దీఱ.

తే. గీ. కేలు కేలను గాని వేగ ♦ బూలపాన్పు
దరికి జని పైకి యెక్కి యా ♦ తలిరుబోణి
'నీవ నేనా' యటచున ♦ నేకవిధుల
బలుక దొడగునుసుధాకారి ♦ మొలక లెత్త.

తే. గీ. దినదినంబును వారిదే ♦ తీరుగాను
సంతతానందవార్ధిలో ♦ స్నానమాడి
మెలగుచుండంగ నట దేవ ♦ తల గుమంపు
వాసవుని జేర నిద్రుండు ♦ వంగి మ్రొక్కి

కం. 'అనఘా! యీయుచితాసన
మున నుండు' దనిన దేవ ♦ నాఖ్యుం "డటులే'

యని శూర్ప్పని పిలిపించిన
పని యెయ్యది' యని దేవ ♦ పతి యిట్లనియెఁ.

తే. గీ. 'మొన్నటను లేదు, నిన్న నే ♦ మొదలి సీత
నెయ్యదో యెఱుంగఁగఁ గోరి ♦ యిపుడు మిమ్ము
పిలువనంపితి మన మేగ ♦ వలయు' ననగ
నాతఁడా యింద్రు డీశకొండ ♦ కేఁగి జనిరి.

తే. గీ. దేవగురుడు మహేంద్రుఁడు ♦ దేవగణము
వారి వెనువెంటనే స్వర్గ ♦ వాసులెల్ల
రేగి రద్దాని గాంచి ప ♦ ఛించె గురుఁడు
'పార్వతీపతి లింగమె ♦ వచ్చెననుచు.

తే. గీ. అనుచు నాటింభకర్తల ♦ యనిమిషుల
మేధమును జూచి గురుఁడు "స్వా ♦ మీ" యటంచు
మ్రొక్కి నత్తరి సండలు ♦ మొక్కెడిదిరి
తగినవిధి జొత్తు గురుఁడని ♦ తలచి తలచి
వ. అప్పు డింద్రుఁడు

తే. గీ. భటులరావించి శివ్వు డింద్రు ♦ పట్టణంబు
గాంచ నరుదెంచి లింగంబు ♦ గాగమారె
నెల్లవారిట పూజించి ♦ రోగు' డనుచు
చాటగాబంచె పౌరులు ♦ సంతసింప

ఆ. వె. ఇంద్రునాజ్ఞగాన ♦ నెల్లవారలు మన
సార నిష్టతోడ ♦ స్నానమాడి
యింతకంటె భాగ్య ♦ మెయ్యది యని దాని
పూజసల్పు విధుల ♦ బూనుకొనిరి.

తే. గీ. దేవతలు దేవకాంతలు ♦ దివ్యమైన
పగిది ముస్తాబులై స్వర్గ ♦ పట్టణముల

పత్రముల్ పళ్ళు పూవులు ♦ పలురకముల
ధూపసంభారములతోడ ♦ నేపమీరఁగ.

తే. గీ. అటుల సురలెల్ల గటకేగి ♦ రంతలోన
రంభ యూర్వశి మేనకా ♦ రమణులెల్ల
ననుపమానంబుగాను త ♦ యాడు లౌచు
వచ్చుచుండిరి యంచల ♦ వలె చెలంగి.

తే. గీ. ఇంద్రుడైరావతము నెక్కి ♦ వేడ్క మీరఁగ
దేవితోఁగూడ తనవెంట ♦ దేవగురుని
నిల్పుకొని వచ్చె శివపూజ ♦ సల్పుట కయి
వచ్చున త్తరి పలువురు ♦ వచ్చిరంత

తే. గీ. కుంభకర్ణుని మేఘంపు ♦ గుండు మాట్లు
కలుగు చర్మమ్ముపై దేవ ♦ గణము నిలిచి
యుండ నింద్రుఁడు కులసతి ♦ నందెనుంచి
గురునితోఁ, గూడ వచ్చె నా ♦ గుండు దరికి

తే. గీ. అట్లువచ్చి బృహస్పతి ♦ యధికవిధుల
మంత్రములనెల్ల జదివి స ♦ న్మంగళముగ
జేసె నభిషేక మెంతయో ♦ చెలువుమీఱ
కుంభకర్ణుని మేఘంపు ♦ గుండునకును

తే. గీ. వాసవునినాతి చేతితో ♦ బట్టుకొనిన
యగరువుల్లలు చేజాఱి ♦ యందుబడిన
కాలెఁ నాగుండుఁ దాగాల ♦ కాంతిదప్పి
వాలిపోయెను చెప్పగా ♦ వశమె పైని

తే. గీ. అందుగొందరు గెంతలే ♦ నతని మేఘ
మూలగాఁ గొనిజాఱిన ♦ యున్నవారు
స్వర్గమునుండి జాఱి ♦ వారు మొదల
చిక్కగానున్న నీకెల ♦ జిక్కిరంత.

తే. గీ. ఈం కెలంజిక్కి పైకి రా ♦ లేక వనిని
డాంగి యున్నట్టి మేకలా ♦ పోగుగాను
మెదలుచుండగ నింతలో ♦ గదలె కుంభ
కర్ణుడారవమూసాంత ♦ కాలముననను.

తే. గీ. నిద్రమేల్కని క్షౌరకు ♦ ని తనదరికి
బిల్చియాతనిచే తల ♦ ముందు బోడి
గాను జేయించుకొని మొల ♦ క్షౌరమంత
వానిచేతను జేయించి ♦ వరిలు తరిని

తే. గీ. మంగలాతడు నారాచ ♦ మందిరమున
కప్పముల నెల్ల పోగుగా ♦ చక్కబరచి
వారిధిలోన నా పోగు ♦ బారవైచె
తేలియే తెంచె దరిగల ♦ దేశమునకు.

తే. గీ. అందులో చిక్కుపడిపోయి ♦ నట్టిసురలు
సాగర ప్రాంతమునుండి ♦ సాగిరాగ
"హరిహరి" యంచు నారదు ♦ డల్లవారి
సురలుగా బోల్చి వీరు వ ♦ సుధకు నెటుల
దిగిరో యని యెంచి 'మీరలు ♦ దేని చేత
వచ్చినా' రన్న వారలు ♦ వలుక నిజము

తే గీ కుంభకర్ణుని మే ధంపు ♦ గుంపువలన
భూమికిం దిగు సురు [illegible]ట ♦ భూసురు లని
పేరు బెట్టుచు [illegible] జాల ♦ జేమీరు
బ్రతుకుచుం డంచును వారల ♦ వరము జేసి

తే గీ. ఇటువారిజేసి నా[illegible]దు
డటునుండి మహేంద్రపురికి ♦ వరిగిన నతడి
పటుతాడనునకు మొక్కివ
[illegible] జేను ♦ మా మహేంద్రా!!

## శమ్భువిజయము

తే. గీ. పూని చంద్రమ సోముని – మహిమోపర్తు
శంకరుఁడు మొన్న లింగ – మై స్వా హామి
చూడవచ్చెను పూజించి – వాసిబంద
గలిగినారము మా పూర్వ – ఫలము వలన

తే. గీ. పాకశాసనుఁడీరీతి – బలుకు నటకి
పక్కనునవ్వి యొంతటి – పాపకృత్య
మాచరించిరి! యది రావ – ణానుజుఁడగు
కుంభకర్ణుని మేధంపు – గుండుసుమ్మీ.

తే. గీ. రామ స్వప్నంబునను రాగ – రాక్షసాధ
మునకే మేధంబులేచి యీ – పురము ముట్టె
దానిశంకరుడంచును – దలచిమీకు
గురుఁడు పలికెను వైదిక – తెలుగు దోఁచ.

తే. గీ. అట్టిమేధంబు వ్రాలుచు – న్నట్టితఱిని
మీరలెల్లరు స్వర్గంబు – జేరుకొనిరి
కొండజాల దాని నుండి యా – కువలయమున
కరుగుదెంచిరి నేఁగంటి – నచట వారి.

కం. సురులయ్యును మేఘముచే
బరతెంచిరి భూమికంచు – భావించి భూ
సురులని పేఁడు వారల
నరవరులకు నప్పజెప్పి – నాడ మహేంద్రా!

తే. గీ. అనవిని సిగ్గుఁజెంది దే – వాధినాథు
డయ్యె తాపసచంద్ర! మీ – రమలమతులు
పసులతో దీని దెప్పగా – వలవదనుచు
సామగ్రి మ్రొక్కెను సిగ్గుచే – వేగ వచ్చి.

తే. గీ. వేగ నారదు డేగి శ్రీ – విష్ణుతోడ
బలుక నారదు ధాతతో – బలికె నంత

చ అనఘుడ నిన్ను బాసినది - యాదిగ నే దిగులొంది యుంది న
మ్మనమున గంది వందిగతి - మాటకి మాటికి వేడుకొన్న నీ
మనసు కరుంగ దాయె బ - మా ఫలమా నరువంటి బేలపై
గసికరముంచ కిప్పగిది - గాసిఁ జేసితి వేమి సేకరా.

ఉ చిత్తజమేల్శరాళికి వి- శేషవగాళికిఁ జల్లగాలికిన్
మత్తమరాళికిన్ శశిస-ముగ్రకరాళికిని సత్యముం ద్వా
యత్తముసా విరాళికి కుళా ళి పికాళికి జిక్కితింక నీ
చిత్తమ నాదుభాగ్యమిక - జెప్పెడి దేమి రసజ్ఞ శేఖరా.

ఉ. నీ సముదార బాహువుల - నీటును మాటలగోలు నాగుదే
ర్కీసము దీరు మోమునకళ - మేలివిలాసము లొప్పునాగు మేల్
హాసము సౌరు నెన్నడ యొ-య్యారము గన్నులసొంపుగంబు చు
ల్లాసము నెంచిన న్మదిగ - లంగెను తాళనురా మనోహర!

ఉ. నీ సరసత్వము న్నసరు - నేర్పును నోర్పును నీటిగోలులున్
నీ సుగుణస్వభావమును - నీకుప్రభావము ని రసోక్తులున్
నీ నొగసైన చర్యయును - నెమ్మది నెంచి నిరంతరంబు బే
రాస నినున్ రతింగలియు - నాత్మ దలంచెద నా సుహృద్వరా

చ. ఎలమిని చిన్ననాడు మన - మిద్దరి మొద్దిరిఁ బల్లకూటమం
దలి బుడుత ల్గనుంగొనగ - దర్పకునాయు ఘటింపుచుండనో
జ్జలు గని మీకునుం జదువు - నామును రెండొనగూడెనింక మీ
రలసితి రింటికేగి సుఖ - మందు డటన్నది యాదిలేదుగా!

చ. కుసుమశరార్తికి న్మగుల - గుందితి గందితి వేడినెన్నలం
భసలరసమ్ములం జెపులు - బ్రామితి నోమితి మేలు నీకుగా
వినువక నీ కువాదములు - వింటిని విప్పుడు నీకు పోడుముల్
మసలక నింక నైన రతి - మన్నన నన్నలయింపు మోప్రియా

ఉ. చూడవ దేమిరా మొగము - జూపులరంగ జూచిమా
టాడవ దేమిరా మనము - నందున జెందినయట్టి కోపమున్

వీడ వదేమిరా మిగుల — వేడగ, జూడగనుంచు వింతె నన్
గూడ వదేమిరా రతులఁ — గోరిన కౌఁగిళ లెత్త నాయకా!

ఉ. బాలి మనంబునం బొసగు — బల్కిన నీదగు నోటిముత్యముల్
రాలునటోయి! నీదగు క — రంటు గరంబు దెమల్చి పట్టగా
బోలదటోయి! నిన్ను ప్రియపూర్వక మెచ్చ రతిం గఱింపగా
జాలనటోయి! జాలమిక — చాలిటు రమ్ము విటాన్వయాగ్రణీ!

ఉ. చందురునంత మొందిన ప — సందగు ముద్దుమొగంబు డంబు ద
ళ్కొందనం బెసంగు నను — కుందనము౯ దిలకించుమేను మేల్
జెందు మృధుస్ఫురక్స్మధువు — జిందు రసోష్ఠ మొడంద విస్తృతం
బంధము జూడ నాత్మ నెన — యం దమి మీఱె విలాసమన్మథా!

చ. చిలుకలు గూయు తెతెరిలఁ — జిత్తజు డమ్ములనేయ గందుతే
టులు విశ్రమోయ వేడిగ గ — దు న్వడగాడ్పులు డాయు జందురుం
డలయక గాయు నీవిరహ — మగ్గలమాయె బరాకుసేయగా
వలదిక రార నావలపు — వడ్డికి బాఱసి ప్రాణనాయకా!

చ. సలిపితి వెంతయుం జెలిమి — సంగతిమీఱ ననంగశాస్త్రముం
దెలిపితి వంతరంగమున — దేవతగా నతిగౌరవంబునన్
నిలిపితి వెప్పుడు న్భళిర! — నిక్కము మక్కువ లల్లదాసిపై
నిలిపితి విట్టి నీనునను — మర్మ మెఱుంగగనైతిఁ జెల్వుడా!

ఉ. మారుడు క్రూరుడయ్యె నల — మందసమీరుడు ఘోరుడయ్యె గ
ర్పూరము నీరమయ్యె నలరున్ శుకవారము వైరమయ్యెఁ గం
జారి మదారియయ్యె నిక — నైన ననుం గరుణించి నాపయిం
గూరిమిమీఱ గూడి రతి — గొబ్బున నేఁగదయ్య వల్లభా!

ఉ. ఆసలుగొల్పి నిన్న విడ — నాడ నటంచు దుటారిపల్కులన్
బాసలుజేసి యిప్పు డెడ — బాసి ప్రియుం బెదరోసి దానియిల్
డాసి మనోజబారి నను — దక్కగ ద్రోసితివౌర యింక నీ
మోస మెఱుంగనయ్యె చల — మీ మది నాపయి నాయకాగ్రణీ!

ఆ. వె. ఆర్చి పేర్చి మారుఁ - డారీతి నేచంగఁ
గూర్చి కూర్చి సాదుఁ - గార్చుకొనుచు
మూర్ఛఁ దెలిసి తనదు - ముంజేయి యోనిలో
దూర్చి యుతనిఁగూర్చి - దుఃఖపడుచుఁ। 42

ఉ. హా! యతిపారసుందతర - రాంచితవిగ్రహా! నిన్నుఁజూచి నే
నాయతమోహపాశవశ - నైతిని; నన్నకనన్న నిప్పుడే
మయఁగ వచ్చినా భగత - టస్ఫుటఘట్టితపంచసాయకా
మేయశలీముఖచ్ఛటల - మీటి రమింపుము నీలభూవర। 44

క. వారస్త్రీలకు మెచ్చగు
మారుంక వటంచు జనులు - మఱిమఱి యెన్నం
గా రూఢిక విషియుందు; ను
దార విరహతాప మార్ప - దగదే నీకిఁకన్॥ 45

క. చూచినయప్పుడె పైఁబడ
జూచి మరులుకొంటి వార - సుందరి నగుటన్
నీ చతుర కార్యపద్ధతు
లేచొప్పున నొప్పుననుచు - నెంతయుఁ బ్రేమన్। 46

క. వాచె మొగంబు భగంబు
నీచరణము లాన యింక - నీవిట నాకున్
గోచరుఁడవు గమ్ము మిసన్
రాచ నృపకుమార! వార! - రమణీమారా!। 47

క. వలరాజు చేత యాతన
బలువయ్యెను, దాళఁజాలఁ - బ్రిత్యక్షుండవై
చెలిమిని రమింపు మిందున్
గులుకును నీలాద్రిభూప! కోమలరూపా! 48

క. చలమేటికి రాకొమరా
బలుపుగ జూడంగ నాదు - పజ్జకువేగన్
గులుకొప్ప వచ్చి భగము బ
గల దెంగుము చండ్లుపట్టి - కసిదీరంగన్ 49

క. సొమ్ములు కోకలు రూకలు
దెమ్మని నినుఁ జిక్కఁజేసె - దీకొని ఖరబం
ధమ్మున దెంగుము వడిగా
నమ్మము పెక్కేల? వార - నారీలోలా! ॥ 50

క. చలమేటికి! రమ్మింక, కో
మలరూప! పింగళనేత్ర! - మన్మథబాధల్
తలపంగ మనముఁ దీరఁగ
బలుపుగ దెంగంగ రాదు - పజ్జకు వేగన్ 51

వ॥ అని మహోన్మాదావస్థచే దేహస్వాస్థ్యంబు లేక చీకాకు పడుచు దుర్గంధ బంధురంబై గొట్టెముక్కవలె ననవరతంబు ద్రవించు తన యుపస్థంబుజూచి యుపస్థతో నిట్లనియె. 52

ఉ. నమ్మినవేశ్యఁ బ్రాతపని - పావడపై కెగదీసి వైచి చో
క్కమ్ముగ గుద్దక్రింద నొక - కమ్ములదుప్పటి నెత్తువెట్టి మే
ఢ్రమ్మునిగుడ్చి లోనికిఁ ద - మలున నంచులు మోయదూర్చి నీ
తిమ్మిరిఁదీఱ వాఁడెపుడు - దీకొని తాకునొ యో త్రికోణమా! 53

ఉ. ఎండలు పొందుఁగూడి విష - ముంచిన నిర్ద్రవమై నితాంతమున్
గెందలిరాకుడా ల్వోయులు - గీల్కొనఁ బొంగుచు దెంగుమంచు లో
గందకఁ దీటలీటక ని - కాసత నొందెదు నీకు దృప్తిగా
మందుఁడు నీలరా జెపుడు - మగ్గము వెట్టునొ! యో త్రికోణమా!

క. అకా! పోఁకా రూకా
కోకా! మేఁకా! మతేమి - గొనియిచ్చెను తా
నీ కాతనితో నేవని
పూకా! యీ కరణి నేల - పొరలెద వయయో! 5

సీ. తురకల మొడ్డలు - దూదేకు మొడ్డలు
గులాపు మొడ్డలు - గొల్ల మొడ్డ
లాబోయి మొడ్డలు యులకావు మొడ్డలు
చాకలి మొడ్డలు - సాలె మొడ్డ

లబిసీల మొద్దులు వలఁవులమొద్దులు
బావసమొద్దులు - భట్లమొద్ద
లింగిలీజలమొద్ద - లీడిగమొద్దలు
పింజారిమొద్దలు - శెస్త్రమొద్ద

సీ. తెన్ని దూరించి దెంగిన - నించుకైన
జడియ కుండెడిదాన, వా - శ్చర్యమిపుడు
నీల నరపతి చచ్చు మొ - డ్డేలనీకు
కాంతుఁ గైకొను మో దోఁగ - కాఁకపూక। 56

ఆ వె. తృప్తిపడియె దేల - చిల్లిలోపల వాని
మల్లవెట్టినిన్ను - గిల్లికొనుచు
నల్లిబిల్లి దెంగ - నుల్లవిల్లెదవు నీ
గుల్లిపాయచాఁబ - గొల్లికాయ। 57

వ॥ అని మఱియు మనోజాత నిశాత చూతనాయకవ్రాత ఘాతయాతనాధూతచేతోరవిందయై కందికుంకుచు, గొంవలం బాధుచు వైవర్ణ్యంబు జెందుచు, బాన్పుబయిఁ బడుచు, బొరలుచు, లేచుచు, వంగుండుచు. దొంగుండుచు, దెంగుండు దెంగుంటనుచు, వెక్కి వెక్కి యేడ్చుచు, వెడవెడం గన్నులు తేలవేయుచు, విహ్వలించుచు, విసుపుచు, విన్నంబోపుచు, పీణం బాణుల ముట్టక, బట్టకట్టక, బోనంబు మెసపక, సురాపానంబు సేయక, ప్రాతబొజంగులం బలుకరింపక, నాయాసంబు పొందుచు, నారాటంబునం గుందుచుఁ జింతించుచు. జేతులు పిసికికొనుచు, జినఁబోపుచు సీత్కారంబు సేయుచుఁ జిడిముడి వడుచుఁ జీకాకునొందుచు జెమ్మటలన్ దోఁగుచుఁ బలవరించుచుఁ బండ్లుగొరుకుచు, బైలు కౌఁగలించుచు, బరవశం బగుచుఁ బెంగగొనుచుఁ బిసరుపాంబుకుందిట్టుచు. బిరబిర శరీరం బెఱుంగక మనుమందిరంబునం గిరికొని గాఢంబులై వంకరత్తెవరలు నిడుదసొగపొరంగు మెఱుంగు వెంట్రుకలు దెగలాగి పాఱవై

చుచు, నలుదిక్కులు కలయంజూచుచు, నవ్వుచు, "హా! నీలాద్రి నర
పుంగవా! వచ్చితే" యని లేచి "నా కుఱువుపయిం గూర్చుండు"
మనుచు, బరిపరి విధంబుల మతిదప్పి, వెఱ్ఱిగొనిన వేఁపి తెఱంగున
నాడె సాలెపురువు చందంబున, మగ్గంబులో నాడెడి నాడెక్కైనడి
మధుపానంబు చేసిన వానరంబు పోలిక, మానికఱచు వక్కలెక్కను
బిడుగుమొత్తిన జనుని చందంబున, మూఁగ లాగున, ముల్లెపోయి
పొరలు ముండవిధంబున, ముక్కుచు, మూల్గుచు, ముఱికి పిత్తులు
పిత్తుచు, మూకుఁడువంటి మూత్రద్వారంబు మొగివిప్పుచు,ముడుచుచు
మొగంబు దిగవైచుచు, మూర్ఛిల్లుచు, దెలియుచు, మోహదాహాతి
తాపంబునం దల్లడిల్లుచుండె, నయ్యవసరంబున, 58

క. వేంకటసాని కిదంతయు
గింకరు లెఱిఁగింప దుఃఖ - కీలితమతియై
కొంకుచుఁ గూతురి నునుప
ర్యంకము చేరంగఁ బోయి - హాహా! యనుచుం। 59

తే. గీ, బిడ్డకో! నీకు మునుపుండు - నడ్డగరలు
పెక్కుమాఱులు తగిలిన - సుర్కిక్కీవె
మాన్పుకొంటివి; యిటువంటి - మమత నాఁడు
కలుగదయ్యెను వట్టి దు - ష్కర్మ మొదవె। 60

క. అరయ నీలనృపాలుని
బేరున బెంపేమి? యతని - పెద్దలు మున్నే
తీరున నుండిరి? యాసిరి
వీరాగ్రణి విజయరామ - విభు డొసఁగఁడా। 61

తే. గీ. ఇంతె కాని, జమీందారుఁ - డే యతండు?
పరమ మూర్ఖుండు, బహులోభి, - పాపచిత్తుఁ
డాత్మ దాసీరతుఁడు, వాని - కాస చెంది
యిహపర సుఖంబు లేదు; నీ - దేటి వలపు!॥ 62

ఆ. వె. ఎదురు పెట్టివేడ్కఁ – జదరంగమాడెడు
పగిది నీకు గల్గ – నడుపుకూటి
నొమ్మిసంగి చేర – రమ్మన్నఁ గైకొను
వట్టివాఁడు ముద్దు – పట్టి వినుము! 63

సీ. పండ్లుతోమఁడు గుద – ప్రక్షాళనము సేయఁ
డమవసనాఁడైన – హరిదినంబు
నందైనఁ గడు నూఁర – బందిమాంసము లేక
కూడు భుజింపఁడు, – గురుముఖంబు
గాఁడు తమ్ముల, జేర – నీఁడు, సత్కవులకు
వైశ్యుల పెండ్లిండ్ల – వలన వచ్చు
కట్నముల్ తా దురా – గ్రహముఁప లంకించి
లంజెలకిచ్చును – లజ్జమాలి,

గీ. వినయమునఁ దండ్రి తద్దిన – మునను విప్రు
బిలిచి యొకకాను తప్పఁడు – బియ్యమీఁడు
పతితుఁడును, లోభి, చింతల – పాటి నీల
రాజు, ఛీఛీ యతనిమీఁద – మోజదేల?! 64

ఉ. పూచిన శాల్మలీద్రుమము, – బోలిన లోహిత దీర్ఘ దేహమున్
గాచసమానపీతరుచిఁ – గ్రాలెడు కొంచపుఁ గన్నుదోయి, క్రే
పాచపలాక్షిఁ ద్రేలెడు వి – శాలతరాస్యముఁ గల్గువాని సం
కోచము లేకచూచి వల – గొంటివె? వారవధూశిరోమణీ! 65

క. సానులకు గబ్బి బెబ్బులి,
పూని కనుంగొనినవాఁడు – పోనీఁడు గదే.
హాని యొనరించు, హా! రతి
కూన! సరగఁ బాటిపొమ్ము – కొట్టామునకున్! 66

ఆ. వె. నలమందును గంజాయి – కలుఁ బోతు
పిచ్చుకల మెక్కి విను వాఁడు – పిత్తదె-గు
పత్త చినిఁగిల విడువఁడే – పాపి; వాని
దుడ్డువలెనుండు మొడ్డపై – దుంగలెత్తె! 67

క. కత్తియు పత్తియుఁ జివఁగఁగ
మొత్తును మత్తిల్లి, నీదు - మొత్తకు దండిం
బొత్తకుమని వేఁడిన వినఁ
డత్తులువబొజుంగు, వాని, - కాఁకింతురె? 68

క. పాపి. విను, వట్టియాసలు
చూపియ్యఁడు డబ్బ లంజె - సొమ్ము భుజించున్
పాపాత్ముఁడు పశుకర్ముఁడు
మాపని రేపని భ్రమించి - మగ్గమువెట్టన్ 69

క. పిచ్చిలు వడివడి రాయఁగ
గుచ్చులు మెయ్యంగ వాఁడు - గొనకొని తాఁకన్
గచ్చంత పగిలి సలుపుచుఁ
జచ్చేవే చంద్రరేఖ - సాంద్రసురేఖా 70

క. పెద్దల నెఱుఁగడు. మాటలఁ
బద్ధులు పచరించు, గర్వి, - భామకు రతిలో
నెద్దుపలె మెలఁగు, నీకా
బుద్ధివలదు. మానుమమ్మ - పుత్తడి బొమ్మా 71

క. ఖలుఁడైన సీలనృపుఁ డీ
యిలపై నన్నాళ్ళు బ్రతుకు - నే! నరసాంబా
గళకలతకసకమయమం
గళనూత్నోత్కృష్టమహిమఁ - గాక కుమారీ 72

తే. గీ. కొక్కరిచ్చెదు నిటుఁజూచి - దక్కినట్లు
తక్కుచును బొల్లిమాటలఁ - దనుపుఁగాని
నిక్కముగ మానసంబిదు - నిశ్చయించి
వారకన్యక యారీతి - వలచు నటవె? 73

క. ఎక్కడి సిలాద్రినృపుం
డెక్కడి యడియాసకి వలపు - లిపికూడ, నఁకన్
గుప్పిక్కిన పేను తెఱంగుఁ
గిక్కురు మనకుండఁ జనుము - గేహంబునకున్ 74

వ. అని వినయ విస్రంభగంభీరసంరంభంబులు గుంభింపం బలుక నచ్చెలుకలకౌలికి కంతకంతకు వింత వింతలుగ దురంత నితాంతవిప్రలంభ వేదనాభరంబు భరింప రాకుండం గరంబు దళంబుగాం బరవశత్వంబు నొంది మాఱుమాటాడనోడి, యోడిన కోడిచందంబునం దల వ్రేలవైచుకొని; కదలమెదలనేరక కన్నులు మూసికొని, యూరక శరీరంబు నీరు విడువ శయ్యనొయ్యనవ్రాలి తూలం గనుంగొని బెంగను లోంగి దుఃఖాంబోధి మధ్యంబున మునింగి కన్నీరు లేఱులై పాఱ వెల్లివిరియ డిల్లపడి తల్లడంబున నుల్లం బనియ మెల్ల మెల్లన నప్పల్లవము భూతంబున కాత్రగతిం జల్లని పనులు సేయం దలంచి తన దాసీజనంబులుర దానును దాని నిజశయ్యాతలంబున జేరి.

సీ, భగనుత్యమున మంచి - చిగురుప్పం గూరించి
పైం గొండనల్లేరు - పరిస్తరించి,
లంబస్తన ప్రదే - శంబున రేవడి
దూలగొండి చిగుళ్ళు - గీలుకొలిసి
కన్నులలోన న - ర్కక్షీరములు నించి,
ముక్కుగూండ్లను నావ - ముద్దలుంచి
వీనులలోపల - వేండి నూనియపోసి,
నాలుకం జెముడు పా - ల్బాలం బోడిచి
గీ, మేన ఱాసున్న మెంతయు - మొత్తి, నత్తి
గొత్రగి, నిమ్మపులును గంట్ల - గ్రుమ్మి, లోని
కిముడ నేపాళము లొసంగి, - యిట్లు శిశిల
కృత్యములు సేయ, నప్పుడ - కేతన వనిత 76

క. బడబడం బిత్తులు పిత్తుచు
బడిబడి బహుభంగిమీఱం - బొఱలుచు మఱిశా
నొడ లెఱుంగక పెనుమూర్ఛం
గడు సోలంగం దల్లిగాంచి - కటకట పడుచున్ 77

ఉ. వేంకటసోమయాజి కిది - వేగమెఱుంగగం జెప్పకుండినం
గింకవహించి దుఃఖపడు - గ్వేల మాతఁడె దీనిగన్నవాం,

డింకట మండనేల! యని - యేడ్చుచు నాతని, జేర యంతయున్
జంకక చెప్ప నాతడును - సంభ్రమదుఃఖభయార్ద్రచిత్తుడై।

తే॥ గీ॥ వెఱ్ఱి లంజెవు, కాకున్న - విషమబుద్ధి
శిశిరకృత్యంబు లీరీతిఁ - జేతువటవె!
చల్లయును, నన్నమును బెట్టి - వల్లమందు
లోనికిప్పించి చేయింపు - తానమిపుడె। 79

క. ఈచందంబున జేసిన
నీచిన్నది బ్రతుకు నిపుడు - సిక్కము దాఁకం
జూచెది నన గ్రతు వ్రాసితి,
నీ చోటుం దరలిరాగ - నిది చెడునుగదా॥ 80

ఉ. చన్నుల జందనం బలది - జానులవంటి చిగుళ్ళగప్పి వా
ల్గన్నుల గప్పురంబు గలి - కంబిడి, బాహువులందు బొందుగా
దిన్నని తూండ్లుజుట్టి. నను - దేవియ మోవిసజేర్క, వేగమే
చిన్నది తెల్వినొందునిక - చిత్తములో వగబూననేటికిన్। 81

క. అది తెన్నుగ నున్నంతట
మనమున నీలాద్రిరాజ - మోహంబున నీ
సదనమున కరుగు దెంచును.
పదపడి మనకిరువురకును - భాగ్యముఁ దెచ్చున్। 82

క. వస్తాడు నీలభూపతి
తెస్తాడు ధనంబు, నీక - తి ప్రమదముగా
నిస్తాడు, విరహ వేదన
జస్తాదా? నమ్ముమదిని - సందియమేలా। 83

ఆ. వె అనుచు దెలియజెప్పు - నామోదహృదయయై
సరగ నరిగియట్లు - సలుప, చంద్ర
రేఖ రేగుబువ్వు - వైఖరి దెల్పచే
పలవు గులకరింత - వలరుచుండె। 84

క. లీలాద్రినృపుం డచ్చో
సోలుచు విరహాసలార్తి - స్రుక్కు వగచుచు

జాలింబొందుచు నేడ్చుచు
వాలారుచు నింకనేటి - వలవనుకొంచున్॥ 85

సీ. దాని జానగు మోనిలో - ఘటింపనిమహో
ద్దండ దర్పితకామ దండమేల?
దాని కోమలసుధా - ధరము గ్రోలని మధు
రస రుచివ్యాలోల - రసనయేల
దానిలంబస్తన - తాండవం బబ్బని
వరికవాటోపమ - వక్షమేల?
దాని జానయుగ మ - ర్దనముసేయని దీర్ఘ
దర్వీ సమాన హ - స్తంబులేల?
గీ దాని నిర్ఝరమధుమదా - హీనదేహ
గాఢ పరిరంభసంభోగ - కలనలేని
భూరివిస్తారశాల్మలీ - భూజతుల్య
పుష్టియుతఘనమద్దేహ - యష్టియేల? 86
క. దానిని మఱువఁ దొడఁపైఁ
బూని కనుంగొనని రాజ - భోగంబేలా?
యీ నెఱవయ సేలా? యని
మానని చింతాభరమున - మఱఁగుచు మఱియున్! 87
ఉ. చందురుకావిపావడయు, - సైకపుబంగరు వ్రాతచీరయుఁ,
ముందులకుచ్చుగచ్చు, తెలి - మొగ్గలకంచెల. మించుచేమవూఁ
గుందనపుంగడేలు, వగ - గుల్కెడి క్రొమ్ముడి, వట్టుబొందు. సో
వందెను దాని మేనిసొబ - గద్దిర! నామదిఁ గొల్లలాడెడిన్! 88

వ. అని దురంత చింతాక్రాంత స్వాంతుండై, 89

సీ. గ్రుడ్లుత్రిప్పును, బండ్లు - గొఱుకును, మూల్గును.
నీల్గును, మిగుల గ - స్సిరుచుండు,
అనురసురను, పింగు - పిసికికొనును, నోరు
మోఁదుకొను. "నంజె - ముండ యిచటి

కేఁ వచ్చెను! దాని నేల చూచి విరాళి
చెందితి" వనుకొను - జెడితి, బడితి
నెవ్వరిబంపుదు! - నేరీతి నదివచ్చు
నేమిసేయుదు! - దైవమిట్లు వెతల
గీ. పాలుగా జేసె, నాటి న్బ - పాలకోటి
లోన నగుబాటు లయ్యె గా - లూనరాని
విరహపరితాపభరమున - వేగదరమె!
యంచు బలవించు దలవంచు - నార్తిగాంచు. 90

సీ. తములంబు తినడు, భోగమువారి నాడింప
డన్నంబు గుడువడు - కన్నవన్నె
కోకలు గట్టడు, - కొలువుగూర్చుండడు
జలకమాడడు, గంద - మలదుకోనడు
వేపులతో దాడు - వేటకు బోవడు
ననుపుకత్తెలగూడి నవ్వుకోనడు
వేంకట ముఖ యజ్ఞ - వీధి, గనుంగొనడు, భా
గవతుల వేష మై - ఖరుల గనడు,
గీ. కటకటా! చంద్రరేఖావి - కటకటాక్ష
విక్షణాక్షీణవాతూల - విజితదేహ
బాలభూరుహమై డవుచున్న నీలవృపుడు
పరవశతి లేచి, వనలతా తరుల చూచి! 91

క. కమ్మవిలుకాని తూవన
నమ్మఖశాలాంగణమున - నగపడిచనె, నో
యమ్మ త్తకొమ్మ! నీవా
క్రొమ్మెత్తని మేనిపాని - కొమ్మంగనవే. 92

క. వింటివో లేదో, శుకవకవు
దంటెనువలె బిట్టుబిగిసి - తలగని వలపుల్
గొంటివి గనివది పొంకలుగ,
కంటెపు మోకా! యిదేమి - తబ్బిబ్బో కా!

ఆ. వె. కప్పు సివ్వు గలుగు - గొప్పకొప్పులరారు
నప్పొలంతి చొప్పు - త్రిప్పుకిప్పు
డొప్పు మీఱ మీరు - చెప్పరే గువ్వున
మెప్పులిత్తు నుప్పి - తుప్పలార, 94

క. మీరంద ఱొకటి వైపొలు
పొంగిగల మూన బల్కి - యతిరయమున నో
కోరింద డొంకలారా!
సారేందు ముఖిలలామ _ జాడ దెలుపరే. 95

క. మారార్త్రి నెంతవేడిన
మారాకడ దెలియజెప్పి - మా రాడక యో
జోరీగలార! మీ రా
నారీ రత్నమును దెచ్చి - నాకొసగరుగా? 96

క. చింతలపాటి కులీనుడ
చింతాసంతాపచలిత - చిత్తుడ నైను నేఁ
జింతామణిగా నెన్నద
చింతా! యక్కాంత తెరువు - చెప్పుము వాకున్. 97

సీ. ప్రణికిణాంకితయోని - గణికాలలామ నా
లోకింపరే తుమ్మ మ్రాకులార!
తుంబీఫలమాన - లంబమానోరోజ
బాడగానరే బట్టు - కదుములార
యింగాలకంబళ - శృంగారతర కేశ
పాశ వీక్షింపరే - పాశలార
క్రకచదంష్ట్రాంకురా - గ్ర మృదుత్వ సంయుక్త
దేహ గానరె తిప్ప - తీగలార!

గీ. ఉష్ట్రరదసచ్ఛదోపమా - నోష్టబింబ
నీడ జూడరే మీరు - జిల్లేడులార
మర్దళ సమాన విపరీత - మధ్య జంద్రి
గాంచరే విక్కముగ నేడు - గారలార. 98

ఉ. పొదలప్రాకులార! కడు - బూచిన పీఠికితుమ్మలార! బల్
బాకిదచెట్టులార! ఫలభాగ్యసముష్టికుంజంబులార! యీ
వేమఱకత్తె చిత్తమున - వేడుక మీఱఁగ వేగిరంబు మీ
నీడకు నీడకొల్ల సర - ణిం బఱతెంచదుగా వచింపరే! 99

క. బెండా! మారోఁడా! యీ
దొండా! మీ యండకిపుడు - తోరముమీఱఁగన్
దాండవ మాడుచు మేలిమ
సిం డందందెల చంద్రి రాదె - చెప్పర జెపుడా! 100

క. నా యెదలోపల విరహము
చీకాకుగఁ జేయుఁ జొచ్చె - జెప్పర నీవు న్
కాకీ! మూకీ! కేకీ!
పూకీదగుమేని సాని - పొడ జూపరుగా। 101

క, కృకవాకులార! మాద్య
త్కృకలాసములార! గవయ - కీశశశశునీ
వృకజాతులార! బోగపు
సకియలతలమిన్న చంద్రి - సానిం గనరే। 102

క. ఉకుతాపకరణ కారణ
వరతామర పాశుగములు - వైచి మరుఁడు, లి
స్ఫురితాంగిఁ జూపుమింపు, డో
యుఱుతా! మామాట సేయు నొప్పినఁ గొఱతా!। 103

క. వందీ! నీగాత్రసదృ
క్సౌందర్య కళావిలాస - చంచన్మార జి
న్నందనమందిర యగు నా
యిందీవర పత్రనేత్రి - నిటు చూపగదే। 104

క. నీతీరు గలుగు రూపము
చేతన్ విటకోటి వవము - చేయుచు గడకన్
జాతర లాడెడి వడుపుం
గోతిని వీక్షించినావె - కోతిప్రతతిన్। 105

క॥ కల్లు కడుఁ దాగివి ప్రేలుచు
హాలీసక మాడుకొనుచు - నది యిచ్చటి కు
ద్వల్లీల రాదె? బల్లీ!
పిల్లీ! కడుముద్దుఁజిలుకు - పిల్లలతల్లీ!॥ 106

క॥ నీలాద్రి రాజనాముఁడ,
వాలెంబున దాఁకఁజూచి - వలచితి నేఁడా
స్థూలోపస్థాన్వితగణి
కాలలఁక చంద్రరేఖం - గంటివె? ఖరమా?॥ 107

వ॥ అని మఱియును 108

చ॥ మనసిజమాయలం దగిలి, - మ్రాఁకులఁ దుప్పలఁ బక్షిజాతులన్
ననమృగ కోటలం దలఁచి - వారక యీగతి వేఁడి, వేఁడినీ
రు నయనపాళి జాలుకొన - రోదనమెంతయుఁ జేసికొంచుఁ, బూ
చిన విషముష్టిభూరుహము - చెంగట నీలశిలాతలంబునన్। 109

క॥ చేరి కళేబర మచ్చోఁ
జేరిచి, హా! చంద్రి! నాకుఁ - జెప్పక పలవం
గారణమేమి? మ ఱెవ్వని
కోరిక దీర్పంగఁ దలఁచు - కొంటివొ చెపుమా॥ 110

క॥ కోకలు రూకలు నాకులు
పోఁకలు మేఁకలును బట్టు - బొందులు సొమ్ముల్
నాకంటె మిక్కిలీగల
రాకొమరుఁడు గలఁడె యీ ధ - రావలయమునన్! 111

క॥ చక్కనివాఁడ, రభసమున
కుక్కుట మార్జాలశునక - కూర్మరతులచ్చోఁ
జొక్కింపంగలవాఁడ,
జిక్కులుపెట్టంగ నీకు - జెల్లునె? చంద్రీ!॥ 112

క॥ రమ్మా, నాయభిమత మిపు
డిమ్మా, యిమ్మాడ్కి నేఁచ నేటికి? హొన్నుల్

గొమ్మా సమ్మతి నిచ్చెద
గొమ్మా! నెల ముద్దుగుమ్మ! - గుబ్బలగొమ్మా! 113

ఉ॥ జాలముచేసి మారశర - జాలము పాలుగ జేయ నాయెమా
తాళగజాల, నీ విరహ - తాపభరంబు కరంబు హెచ్చె, నీ
తాళఫలోపమానకుచ ద్వగకు చద్వయ మక్కజేర్చి నీ
లాలలితోపగూహనక - లాకలనన్ సుఖయింప జేయుమా॥ 114

శా। శోషించెన్ మదనోపతాపమున న - క్షుద్రోన్నతిస్థూలసి
ద్ధోషోద్యత్తనుయష్టి. పుష్టిగను వం - దుల్ చేసినన్ గాఢహో
రోషం బూనక నేడపాం కరుణా - గాఢాత్మసంక్లేద నై
యోషిద్రత్నమ! చంద్రి! నీయధరపీ - యూషంబు నాకీయవే।

కం। పెక్కు తెలుంగుల నీకున్
మొక్కెద జలమేల? నాదు - మోహము తీరన్
చక్కెరవిల్తుని కూటమి
మిక్కుటముగ గేల్చి యేలు - దాసునిగాన్। 116

కం। మేలెంచెద, సామ్రాజ్యం
బేలించెద దొంటిసతుల - యెల్లసిరంబున్
లాలించెద, బాలించెం
దేలింపుము రతుల నన్ను - దేశవ మాజన్। 117

కం। చక్కెరవిల్తుని బానన్
జిక్కితి నీపాదయుగకు - శీకరయములకున్
మొక్కితి, దక్కితి, సకి నీ
తక్కులు దిగద్రొక్కి నన్ను - దయజూడగదే। 118

తే। గీ। గంధ మత్తరు జవ్వాది - కస్తురియును
దొడ్డయొడ్డాణమును గమ్మ - ద్రోయి క్రొత్త
పట్టుచీరలు కుచ్చుల - బావిలీలు
రొక్కమివె గొమ్ము నీలంజె - టక్కు మాని। 119

తే। గీ। తాళజాలను, నీవింత - జాలమేల

నేలుమీా వేగ మాటాడి ♦ ఫాలలసిత
సరసనవచంద్రరేఖ! యో ♦ చంద్రరేఖ! 120

ఉ! తియ్యని ముద్దుమాటలును, ♦ దేఁయగారెడు బొల్లిమోవియ్యు
బయ్యెదకొంగులో బొదలు ♦ బల్బను గుబ్బలు, మంగలంబుతో
గయ్యముసేయుమోము, నలి ♦ గన్నులు, తోరపుగొనునాకుజూ
పియ్యెడ మాపుకేళి గడు ♦ నేలను. జాలముసేయు కింతయున్

మ. అమలంబై, తరుణారుణద్యుతిసమే ♦ తాశ్వత్థపత్రాభ మై,
రమణీయస్ఫుటదీర్ఘలింగయుత మై, రంగద్ధ్రిఘోపేత మై.
సమనమై రోమవిహీనమై, వెడదయై ♦ జానొప్పు నీ మారగే
హము, నాకిప్పలి జూపి ప్రౌఢరతినో ♦ ల్లాడించు చంద్రోదయన్

వ! అని మఱియును, 123

ఉ! హా! యను. జంచరీకనిచ ♦ యాంచితకుంచిత రోమ కామగే
హా! యను, దానవమానితను ♦ హాద్వీపమోహానమోహానైకబా
హా! యను, గంకకాకవాహి ♦ హా శితమూర్భగాతిదే
హా! యనుఁజంద్రి! తాళనహ ♦ హా! యెనుభీతిశిరోరుహా!యనున్

ఉ! డాయగ రాకు నన్ను మకు ♦ డా! యను, నేచగ లనే రిక్కఁతే
డా! యను, వద్దు వద్దు చను ♦ డా! యను, సోకక పొమ్ము గాలిపీ
డా! యను, చంద్రితల్లి పఱ ♦ డా యను, వెంకటశాస్త్రి నేమరా
డా! యను, కూతుగూర్పదగ ♦ డాయను, నేగతి! దేవుడాయనుఁ

క! ఆకరణి నుడివి డేరా
మేకువలేఁ బిఱ్ఱబిగిసి ♦ మిట్టిపడు నిజా
స్తోకసుమకామదండము
జేకొని చీకుచును బుద్ధి ♦ జేప్ప దొడంగన్! 126

ఉ! చాపలమోపు చంద్రివిను ♦ జక్కఁగ జక్కెరవింటిదంట పెన్
గాపురపింటిలోపలికి ♦ గ్రిక్కన దూరి సుఖింపకుండ సం
తాప మొనర్చి, యేగె నటు, తాళుమటన్నను దాళ కేల యు
ద్యాపనశక్తిజూపెదవు ♦ దండను నీకు మనోజదండమా! 127

ఉ. గచ్చులు మచ్చులచ్చెరువు - గాగడలన్ వెదఁజల్లు జంద్రిబల్
పచ్చని తొక్కుడోయి గల - పక్కి హుమాయివజీరు సంటిలోఁ
జొచ్చుచువచ్చునిమ్ముగఁ - జొక్కుచు గీడయొసర్చుచుండగాఁ
నిచ్చలు దృష్టిచేసెదను - నిల్వవె కొంచెముసేపు దండమా.

ఉ. పెక్కు తెఱంగులం గరని - పీడన మే నొనరించి వంచిసన్
స్రుక్కక మిట్టిమిట్టి తల - జూవుచు సన్నివపంచెఁ జించుచున్
మొక్కలపాటుఁ జూపెదవు - మున్ను త్రికోణము లెన్నె జూపితిన్
ప్రొక్కెద నిక్క మానుమతి - మూర్ఖమనోభవదీర్ఘ దండమా.

ఉ. కాయలు గాచె నీదు తల - కాయ యహా సుకుమారవారక
న్యాయతకచ్ఛపోపమభ - గాంతరసిత్యగతాత్రమో
శ్రేయసముగ్రఘట్టనవి - శేషతరాపద నైన నింక నో
కాయజదండమా? వినువుఁ గైకొని యూరక నుండలేవుగా. 150

ఉ. పంకము లంటె నాకు బహు - భంగుల నీ కతన న్విలాసవ
త్పంకజపత్త్రినేత్రలను - బల్మిని బట్టగఁ దద్విశాలమో
నాంక గృహాంతరాళభవి - త్వాత్మజలప్లుతపాంసుసమ్మిళ
త్పంకము నీకు నంటెఁ గద - పావపు మేఁడ్రమ! యిట్లు సేతురే.

ఉ. ఎందఱి వేఁడుకొంటి? మఱి - యెందఱి పాదము లంటుకొంటి? మం
దెందఱి నాశ్రయించితి? సఁ - కెందఱికిన్ బ్రణామిల్ల జేసెదో!
కొందల మందెడి న్మనను - గొబ్బున నా మన వాలకించి, యా
బందెలమారి చంద్రి భగ - భాగ్యముఁ గోరను మారదండమా.

సీ. కమలపత్త్రస్ఫూర్తిఁ - గనుపట్టు భగములు
మించుటద్దమ్ముల - మించుభగము
లశ్వద్థపాండుద - ళాకార భగములు
పనసతొనలఁ బోలు - ఘనభగములు
దింటుఁ బూవుల - వంటిభగంబులు
సితగింజలరీతి - నెసఁగుభగము
లలపందిముట్టెల - నలెనుండు భగములు
కాకిపిల్లలనోళ్ల - గతిభగములు

గీ. పెక్కు జూపితి నీవును - నిక్కుకొనుచు
సన్నిలోడవెట్టి వెడలితి - వకట యిపుడు
చంద్రభగ మేమి! భాగ్యమా! - సైపుమా! ము
డుంగులింగమా! చాలపో - డుంగుమాని. 133

క. తులువలు వడివడి దాకగ
లకి, జినిగిన ప్రాక దెంగు - లకు వెలిచున నీ
తలబ్రద్దలగును రానిం
దలచి నిగుడబోకు మదన - దండము యింకన్. 134

సీ. కొంకేది బాఁకస - గుడిసెలు దూఱుట
పరికించిచూడక నీ - కొఱకుగాదె!
బత్తిని దొమ్మరి - తొత్తుల నిల్పుట
గొనకొని యున్న నీ - కొఱకు గాదె!
గోడిగలను గొని - గూడులగట్టుట
కొంచ కెంచెగ నీ - కొఱకు గాదె?
బాలవిధవలకు - నోలిమాన్యములిచ్చు
టరసిచూడంగ నీ - కొఱకుగాదె!

గీ. వారకన్యకలకు నేన - వారితముగ
గోకలును రూకలిడుట నీ - కొఱకుగాదె
కూళతనమాను బిల్ల నీ - కొఱకుగాదె
యోమకారోత్వమా! శాంత - మూనుకొనుమ! 135

ఉ. కేనియకంపు పెంపుగల - తేజము ఝల్లున జెల్లువారగా
గోనెలలీల దేను చను - గొండలు సిండయు దాంకవింపగా
గానుగజోలుబోలు మెయి - కంపిల బైకొని మేఢ్రదండమా
దాని వకార కొమ్ము నెగ - దాకక వ్రక్కలుసేయు టెన్నడో!

ఉ. కుక్కుటమాలికా భగన - గొల్లి నఖంబులగిల్లి మెల్ల నే
చొక్కపు మన్మథాలయము - జుంబన మెంతయు జేసి దానిలో
గ్రక్కున మోపిదూర్చి వగ - గైకొని పీల్చిన జంద్రి మిక్కిలిం
జొక్క రమింపనిచ్చుగద - సొంపుగ నో లవడా తడాలునన్.

శా. ఆభూతాకృతిచంద్రిసాంద్రతరకో - ద్యాంచత్త్రికోణంబులో
నాభోగస్ఫుటచండతాండవమహా - వ్యాపారకేళీకలా
లాభం బందెదవంచు నిక్కినమనే - లాసారె గారించెదో
శేఫస్తంభమ దాని - పొందెటుపలెన్ సిద్ధించు నీకిత్తఱిన్.

ఉ. గొల్లెవకంభ మంత నిను - గొల్లి, చోకారపు వల్లతీగల
ట్లల్లికగొన్న రోమములు - నద్రిగుహోపమ మౌ బిలంబునన్
తెల్లని కొఱ్ఱగంజి పస - మించు ద్రవించును గల్గు చంద్రి మా
రెల్లెపు డీవుసొచ్చెదవొ - హెచ్చరికన్ బహుదీర్ఘ శిశ్నమా. 239

ఉ. నీచతకోర్చి బంధుజన - నిందకు రోయక దొల్లి గార్ధబిన్
జూచియు నీవు మిట్టిపడ - జొచ్చిన నీచవలంబు దీర్పగా
లోచితవృత్తి గైకొనియు - నొద్దిక మీరగ దాని యోనిదూ
రించినాడగాదె! నిను - రిత్తగజేయక నాదు మేఢ్రమా.

చ. వినువిను, వద్దువద్దు. యవి - వేకము బూనకు. చంద్రి పూకుపై
మనసిడకంచు జెప్పినను - మానక మిట్టిపడేవు జొచ్చినన్
ఘనమగువుంగ్లుమున్ సెగయు - గడ్డలు వంటి చెడేవు మానుమీ
యనుపమరూపనిర్జిత మ - హాగజదండమ! మారదండమా. 141

వ. ఇట్లనేక ప్రకారంబుల మనోవికారంబుచేతం జేతనా చేతన జ్ఞానవిహీనుండై యాసీలాద్రిరాజన్యశతమన్యుం డుద్దండంబు గదండ నుండి గండుకొని వచ్చు కుసుమాయుధవిధునులయాచల సమాగత వాతపోతమధువ్రతపరభృతకీరశారికావారంబుల గురించి దూషింపం దొడంగె. 142

క. మదనా! మదనాశుగచయ
మదనా! చెలరేగి యేయ - నాతతశశభృ
ద్వదనా! మృదులోపస్థా
సదనా! యెదనాటెనిపుడు - శంబరమదనా! 143

తే.గీ. సకలపురుష హృదయార్తి - సంఘటించు
సాని నీచంద్రరేఖాభి - ధానమూస

కేరుచున్నది, దానిపై - గినుకమాని
తద్విరహి నన్ను నేచంగ - దగునె! చంద్ర 144

క. ఫణిరోమరేఖ యను న
గ్గణికాంగనమీఁద బోవ - గా వెఱ సమీ
రణమా! మేమయు నేచగ గా
రణమేమి? తెలుంగు సత్వ - రత నన్బుద్ధిన్. 145

ఉ. మిమ్ము జయించు మించుగల - మేలినునుం బెనుగొప్పు చేతనే
మమ్మును నోధన ప్రకట-మార్గణజాలము పాలుచేసి తా
గిమ్మన కేగె దానిదరి-జేరను, చంపకగంధి యంచునో
తుమ్మెదలార! మీరిచట త్రుళ్ళెదరక్కట! శౌర్యహీనులై.

క. ఆవెల పొలంతి గని నే
నేవల విరహార్తిచేత - గృశియించెడిచో
నీవు చెవుల్ చిందరగొన
గోవెల! కూయకుము నన్ను - గొఱతన్ వేయన్

క. పరమ పురుషార్థంబంతయు
హరియించును నేచు చంద్రి - యంచితబింబా
ధర మాని సుఖంపక. త
త్పరపశు నను నేచ నేమి - ఫల మగు? జిలుకా! 148

చ. అని యనివార్యమానమన - నాపదచే సకలప్రపంచమున్
దనువును బేరునన్ మఱచి. - తన్మహనీయవియోగవార్థిలో
మునుగుచు దేలుచున్, బరమ - మూర్ఖతచే బలవించుకొంచు, న
జ్జనపుంగవుండు కడు - సత్త్వము పెంపుదొఱంగ మూర్ఛిలెన్.

తే.గీ. అనుచు శ్రీనంబి నారసిం - హార్యవర్యు
డానతిచ్చిన, శివభూసు - రాగ్రగణ్యు
డైన వీరన విని యద్భు - తాత్ముడగుచు
బిదప కథ జెప్ప డతులిత - ప్రీతిననుడు 150

క. మారారాకారా! కారా
గారాంతర విహారణోగ్ర - కర్మఠ! పారా

వారావృతధరణీతల
వారవధూజాల! నిత్య - వర్ణితశీలా! 151

మాలిని:—హరిగుణగణ ఖేలా! యంగజవ్యాధిలోలా!
పరిచితవిటజాలా! బాలరండానుకూలా!
నిరతరచితజాలా! నీచదాసీకృపాలా!
దురితచయవిశాలా! దుర్గుణౌఘాలవాలా। 152

—♦ గద్యము ♦—

ఇది శ్రీమజ్జగన్నాథదేవకరుణాకటాక్షవీక్షణానుక్షణసంలబ్ధ సరసకవితా
విచిత్ర సలలితాపస్తంబసూత్ర కౌండిన్యసగోత్ర కూచిమంచి కుల
పవిత్ర గంగనామాత్యపుత్త్ర సూరితా నూనసమాస నానా
విధసంస్కృతాంధ్ర దేశ భాషావిశేష భూషితా శేషకవితావిలా
సభాసురా ఖర్వసర్వలక్షణసారసంగ్రహోద్దామ శుద్ధాం
ధ్ర రామాయణ ప్రముఖబహువిధ ప్రబంధ నిబంధన
బంధుర విధాన నవీనశబ్ద శాసన బిరుదాభిరామ
తిమ్మకవి సార్వభౌమ సహోదర గురుయశో
మేదుర వివిధవిద్వజ్జనవిధేయ జగన్నాథ
నామధేయప్రణీతంబైన చంద్రరేఖా
విలాపంబను హాస్యరస ప్రబంధ
రాజంబునం ద్వితీయా
శ్వాసంబు
సంపూర్ణము.

—:0:—

శ్రీ ర ను.

# చంద్రరేఖా విలాపము

## తృతీయాశ్వాసము.

శ్రీ రతి సతీ - మనోహర
చారుతర స్పృహాయమాన - శష్పావృత వి
స్తారభగాన్విత చంద్రీ
నీరంధ్రా శీవ్యలోల! - నీలనృపాలా॥ 1

వ॥ ఆకర్ణింపుము తావకీనకథావిధానంబు, యథార్థంబుగాఁ దొల్లి శ్రీశివబ్రాహ్మణవర్ణాగ్రగణ్యుం డైన వీరభద్రభట్టారకేంద్రు నకు శ్రీమద్వైఖానసవంశోత్తంసం బగు నరసింహాచార్యపుణ్యాండవ్వాలి కథ యిట్లని చెప్పం దొడంగె. 2

క॥ అంతటఁ బటుఘటితగృహా
భ్యంతరమహిపానువుప్ప - బంధురబలవ
ద్ధంతయుతశయ్య నమ్మహి
కాంతుఁడు లేకున్న దాసి - కలు డాసి కడున్। 3

క॥ కళకళ మందుచు, మన మిటఁ
గొలగొల మనుకొంచుఁ జట్టు - కొని యుండఁగఁ గో
మలగతి నేడకుఁ జనెనో?
తెలియ దహా! దైవమాయ - తీరెట్లగునో?॥ 4

సీ॥ పిక్క లూనులు కాళ్ళ - పిల్లసేవకులచే
గ్రుద్దించుకొనుచుండెఁ - గొంతసేపు,
పాటకు ల్పలుకేటఁ - బాడించుకొంచును
గొల్వు దీర్చియుండెఁ - గొంతసేపు,

హితవు మీఱంగ భాగ - వతుల మేల్పోవాల
వింత కన్గొనుచుండెఁ - గొంతసేపు,
మద్దెల మ్రోయంగ - గుద్దద్రిప్పుచు నాడు
నింతి గన్గొనుచుండెఁ - గొంతిసేపు,
గీ. మంచ మెక్కి యొక్క తేఁకోడ - మదనకదన
మెంతయును జేయుచుండెను - గొంతసేపు.
తమలము మెసంగి. పొగచుట్ట - త్రాగెఁ గొంత
సే, పతం డంతె సం దేఁగె? - జెప్పరమ్మ! 5
క. ఏ లంజెయింటి కేఁగనో!
యే లీలావతిని బలిమి - నెనయించెనో? తా
నేలాగు మాయ మయ్యెను?
నీలాద్రినృపుండు కామి - నీలోలుఁ డహా!! 6
క॥ వేంకటశాస్త్రిల యజ్ఞము
పొంకము చూడంగలేచి - పోయెనో? శే దా
వంకఁ బులి మ్రింగి పోయెనో?
జంకయ్యొడిఁ జెప్ప రమ్మ - జవ్వనులారా!! 7
సీ॥ ఇంగుఁ దా వెల్వడి - యెందు వేంచేసెనో
మాసామి జూపరే - మ్రాఁకులార!
సన్నకసన్న నే - సకి గూడి యుండెనో
మా తేని జూపరే - మధులార!
వేఁపుల బట్టుక - వేఁటకుఁ బోయెనో
మా గొరఁ జూపరే - మదఁ గులాల!
యిందథ భ్రమియించి - యేటికిఁ బోయెనో
మా రాజఁ జూపరే - జాములార;
గీ॥ మమ్ము నేలిన నీలాద్రి - మనుజవిభుఁడు
పూలపాన్పుఁ బెనునిద్ర - పోయిపోయి
లేచి యొక్కరుఁడును మా క - గోచరముగ
నెచ్చట నడంగెఁ జెప్పరే - వచ్చులార!! 8

క॥ ఎల్లీ! మల్లీ! పల్లీ!
పుల్లీ! మా రాజు కూసు – పోవకె మీమీ
గొల్లెలకై రాఁకు గదా?
కల్లలు పలదింకఁ జెప్ప – గదకే వేగన్। 9

సుగంధి॥ నేలతేఁడులార! మంచి – నేస్తులార! విక్రమా
భీలశూరులార! పిన్న – పెద్దలార! గుప్పునన్
బూలపాన్పు డిగ్గి యేడఁ – బోయినాడొ చూడరే
నీలకాశ్యపీ వరుండు – నిన్న రేయి యొక్కఁడున్॥ 10

మ॥ అని గగ్గోలుగ వారు రోదనము సే-యన్. నాయకుల్ గాయకుల్
చనవర్లున్ గణికాజనంబు లనుజుల్-సామంతులుఁ మంత్రులున్
వినిశోకాకుల చిత్తులై కదిసి, త - ద్వృత్తాంత మాలించి, యా
యన నన్వేషము సేయఁబోయిరి సమీ-పారణ్యమధ్యంబునన్ 11

క॥ గట్టుల దరిఁ, బుట్టల కడఁ,
జెట్టుల చెంగటను, జెఱువు – చెంతల, బలు, పె
న్గట్టల సందుల గొందులఁ,
బట్టుగఁ బ్రవహించు నేటి – పల్లము లందున్। 11

క॥ రోయుచు హా యని కేకలు
వేయుచు, హా! నీలభూప! విస్మయముగ నీ
వే యెడ కేఁగితొ? వెస రా
వే యనుచును మోఁదుకొనుచు – విహ్వలు లగుచున్॥ 13

క॥ మూఁగి అరయంగ, నాతిని
తోఁ గూడం జనిన వేఁట – తోరపు గుక్కల్
సైగలు సేయుచు సాగగ
నా గతి గని చనిరి వార – లందఱు వెంటన్॥ 14

క॥ చని కనిరి చంద్రరేఖా
తను రూపవిలాసవహ్ని – దగ్ధశరీరున్
ఘన చింతాభావున్ నూ
తన జనిత దశావికారుఁ దన్నృపమారున్। 15

వ॥ ఇట్లు కనుంగొని సకల పరివారంబు లతనిం జుట్టుకొని యాక్రందనంబు సేయుచు నాశ్చర్యధుర్యమానసంబులతో నిట్లనిరి,

క॥ వాతము పట్టెనో? పని చెను
భూతము గొట్టెనో? మ ఱెట్టి - పాద గుట్టెనో? హా
హా! తెలియ దేమి మాయయొ
యీతఁడు పడియున్న చంద - మెంచి కనంగన్॥ 17

సీ॥ బహుళద్విజద్రవ్య - భక్షణోద్భవ మహా
పాతకంబున నోరు - పడియె నొక్కొ?
కవిమాన్యహరణ దు - ష్కర ప్రభూతాతి
కలుషంబుచే జిహ్వ - పలుకదొక్కొ?
పరసతీవ్రతభంగ - కరణప్రభవపంక
గతిదుర్బలాంగంబు - గదలదొక్కొ?
సుజనులఁ బెడఁ జూచు - చూడ్కిఁ జుట్టినకోలఁ
గడుఁగనుంగవ మూఁత - పడియెనొక్కొ?

గీ॥ వితర నిజదాసికాజన - నికరములను
బలిమిమై పట్టపగలిటుఁ - బట్టి మిగుల
సమరతులఁ దేలఁ బొడము దో - సమువనొక్కొ?
నీలనరనాథుఁ డిట్లొంటినేలగూలినాఁడు॥ 18

వ॥ అని మహాదుఃఖావేశంబున నిట్లనిరి. 19

సీ॥ కొలువు దీర్ప వసేమి - గురుతరతరుసార
భాసురలక్ష్మి వి - లాసమునను?
కూర్చుండ వది యేమి - ఘుమఘుమామోదగుం
భితసుచందనకాష్ఠ - పీఠమునను?
తేఱి చూడ వదేమి - దృఢతరలావణ్య
గణ్యపణ్యస్త్రీని - కాయములను?
పలుకరింపవ దేమి - బహువేషభాషాతి
బంధురాశ్రితబాలఁ - భాగవతుల?

గీ॥ నకటా! నీలాద్రిరాజ! భో • గానురక్తి
మాని యీ, ఘోరకాంతార • మహిని బండఁ
గారణం బేమి? యేరిపైఁ • గాఁక పూని
తేగి యిటకు వచ్చి యిట్లు ని • ద్రించె దివుడు

క॥ కేళిభవనాంతర వరి
కేలిమతల్లికాంత • కేసలశయ్యా
లోలుఁడవై యుండక
నేలపై బండ నేల • నీల నృపాలా! 21

సీ॥ విజయరామమహా • విభుఁడు పిల్వఁగఁ బంచె
రాచి రాజకుమార • లేచి రమ్ము
మెఱుకవాఁ డిదె పంది • నేంసి మాంసము దెచ్చి
కాచుకయున్నాఁడు • లేచిరమ్ము
వేఁటకుక్కలఁగాన్క • వెట్టిపంపిరి దొరల్
చూచువత్తువు గాని • లేచి రమ్ము
కొత్తపారావారు • కొలువంగ వచ్చిరి
రాచయేనుఁగు నున్న ! • లేచిరమ్ము

గీ॥ దాసి! యొక్కతె నీ పొందు • కాస చెంది
వాఁచియున్నది విసయింప • లేచిరమ్ము
సలుపుఁ గొల్పెడి పుండ్లు బూ • చులకు మందు
రాచికొన నీలనృప! వేగ • లేచిరములే! 22

వ॥ అని మఱియును.

క॥ కదలఁడు పలుకఁడు ధాతవు
పదకరముల నుండఁ జూచి • బ్రతుకునొ! లేదో!
పెదరకఁ జెప్పు మ దెట్లు
న్నదొ! యీతని కో ముడింబి - వరసాచార్యా! 23

తే॥ గీ॥ అనిన, నాతండు దగ్గఱ • కరిగి ధాతు
గతి పరీక్షించి, యితనికిఁ • గామరోగ

మంకరించిన, దీక్ష మీరు । జంకు మాని
సరగ శిశిరోపచారముల్ – సలుప, లేచు। 24

క॥ అని చెప్పిన వా రందఱు
జనితామోదంబుతోడఁ – జల్లని పను లే
ఫ్పనఁ జేయఁగ సమకట్టిరి
మనుజాధిపు చెంతఁ జేరి – మక్కువ మీఱన్ 25

క॥ పసుపును నూనెయుఁ గరపద
బిసరుహముల రాచి, విసముఁ – బిండి శిరమునం
దిను మంతి గోతిగి వడి విడి,
వెసఁ జెవి వెల్లుల్లి యూద – వ్వగమే తెలిసెన్, 26

ఆ॥ వె॥ తెలిసి యున్నవాఁడు – నలుదిక్కులను జూచి
సైగ సేయ, వారు – చల్లఅగంజి
వంటకంబు బిసికి – బోయ, మెల్లన
గుటుకు గుటుకు రనుచు – గ్రోలి సోలి। 27

క॥ తెప్పిఱి కూర్చుంటి యతం
డప్పుడు తన చంద మెల్ల – నాప్తులతోడన్
గుప్పున నేకాంతంబున
జెప్పిన విని, లంజె యెంత – చేసె న టంచున్। 28

క॥ బొక నాసి గడ్డ సెగయును
నకటా! యీ నీలవిభుని – కంటించిన యిం
టికి నొంటికి హానిగదా!
ప్రకటంబుగ బుఱుగు లురలి – వడి చచ్చుగదా। 29

క॥ పట్టుడు కట్టుడు కొట్టుడు,
గట్టిగ దల బోడిచేసి – గాడిదమీఁదన్
బెట్టుడు; పురి వెడలంగా
గొట్టుడ" నిరి యందఱొకట – గోపముమీఱన్॥ 30

వ॥ అప్పుడు నీలాద్రి భూమివిభుండు 31

ఆ॥ వె॥ దాని బట్ట బూను - తజిబీజు గనుగొని
సాని విట్లు సేయు - జనదు, నాకు,
గూర్మి మీఱ మీరు - కుస్తరిం చిటు త
తెచ్చి కూర్పవలయు - నిశ్చయముగ॥ 32

క॥ తల గొఱిగించుట కంటెన్
మొలగొఱిగించుటయె మేలు - ముగ్ధయగుట జల్
సలుపున గోర్వక యుంచిన
దిల విటులకు నింత భాగ్య - మేదీ జగతిన్ 33

క॥ సమమై రోమ రహితమై,
యమిత మృదుత్వంబు గలిగి - యశ్వత్థదళో
పమ, మై స్నిగ్ధం బై, వెలు
పమరెడు భగమిచ్చు భాగ్య - మందుకు శాస్త్రీ॥ 34

ఆ॥ వె॥ ఇన్ని లక్షణంబు - లెన్న దాని త్రికోణ
పాళి నుండు డనుచు - పాళి నాదు
నంతరాత్మ దోచె; - నయ్యది సౌభాగ్య
వతియె సుమ్ము. పెక్కు - వాక్కు లేల!॥ 35

ఆ॥ వె॥ దాని యోని తీరు, - దాని చన్నుల చెన్ను,
దాని మోము గోము, - దాని మోవి
కావి కేవి చెప్ప - గా మాకు శక్యమే?
రోమములు వడంకు - భీమరాజ!॥ 36

క॥ సిద్ధాంతివి, పండితుడవు,
సద్ధర్ముండవును, నాకు - సఖుడ వెపుడు నే
నుద్ధతి దాని రమియించెద?
శుద్ధగతిం జెప్పు శాంతి - సుబ్బన్న మాకున్॥ 37

వ॥ అని పలుకునవ్వాడు, పండితుండును నిష్ఠాగరిష్ఠుండును సుజ్ఞాననిపుణుండును హితుండును బ్రహ్మణ్యాగ్రగణ్యుండును శాంతుండును సకల జన సమ్మతుండును జతురుండును బ్రయాగనంశోత్తముండును, నగు బాపన్న, రాపన్నుం జూచి యీ పగిది వాపోవుచు

గన్నులు తేలవైచుచున్న యా నీలాద్రిమన్ను జేనిం గనుంగొని, వినయవిసంభ్రమగాంభీర్యంబులు గుంభింప గంభీర భావంబుల మెల్ల మెల్లన యిట్లనియె. 38

క॥ పరనారీసోదరుఁడవు,
పరతత్త్వవిశారదుఁడవు, - బహురాజసభాం
తరనుతకీర్తివి, వేశ్యా
తరుణీమైథునము సేయుఁ దలంపఁ దగునే? 39

సీ॥ చెఱువు చేసితివిగా - చెలఁగి బాడవ, క్రింద
సద్రాజ లెన్న స - ముద్రముగను,
వనము నిల్పితివిగా - వర్ణింప రాకుండ
వీఁక నరట్ల కు - ప్పాక నడుమ
మాన్య మిచ్చితిగా - మహిమీఁ మాలంబున
శాంతి సుబ్బయ్యకు - క్షుద్రభూమి
నా కిచ్చితివిగదా - నాలు గైదు వరాలు
పేశలగతిని వ- ర్షాశనముగ

గీ॥ వివిధసంగ్రామ జయరామ - విజయరామ
రాజశరుణాశబాహ్మణి - ర్వ్యాజలబ్ధ
సకలసామ్రాజ్య ఖనివి; ని - వకట! యొకట
పుప్పి బోగపులంజకై - పొగులఁ దగునె॥ 40

క॥ ఇల్లును నొళ్ళును గుల్లగు,
బెల్లడరెడు రాజ్యలక్ష్మి - పెంపు హరించుఁ
గుల్లావు సాని దానిన్
మళ్ళితనితమిఁ గోరి నీవు - మఱి రతి సలుపన్। 41

క॥ వద్దనుమీ, యిది కూడని
పద్దనుమీ, నాదు మాట - పాలించితివా
ముద్దనుమీయా సానిది
మొద్దనుమీ దాని దెంగు - మోహం బేలా। 42

క॥ జగ్గకవిరాజు చేతం
బగ్గయు సిరి నోవఁ దిట్లు - వడితివి చంద్రిన్
మగ్గము పెట్టిన, మొదలే
నెగ్గవయో! నీలభూప! - నృపసుమచాపా। 43

వ॥ అప్పాడ ప్పలుకులు విని కటకం బడి కట మదరఁ బండ్లు పెటపెటం గొఱికి చటులక్రోధకుటిలారుణలోచనుండై తదీయ ప్రధాన ప్రధానుం డగు నాదు భీమనామమంత్రి యతని కిట్లనియె,

క॥ ప్రభుచిత్త మెఃవ్యధనంబున?
ప్రభవించునో యట్టి నీవుఁ - బలుకక వడి ని
ట్లు భయము మాని పలికెదవు
సభలో వా రెల్లఁ గడు న - సహ్యత పడగన్। 45

క॥ ఓంభూలు చేసికొంచును
జంభంబులు గొట్టుకొనుచు - జడమతి నశుభా
రంభము లరయుచుఁ దిరిగెడి
దంభపు విప్రునకు నీకుఁ - దగ దిది చనుమా। 46

ఆ॥ వె॥ పప్పుదప్పళంబు - లొప్ప దప్పొప్పులు
సెప్పుకొంచుఁ దడక - విప్పుకొంచుఁ
జదువుకొంచుఁ దిరుగ - ఛాందసుల్ మీరలు
రాచకార్యములకు - రాగఁ దగున?॥ 47

క॥ కైశ్యం బేరా విధసకు!
వైశ్యునకున్ సమర విజయ - వాంఛల వేలా?
వశ్య యయి కులికి పైఁ బడు
వేశ్యారతి సుఖము వేద వేద్యున కేలా। 48

వ॥ అనిన నమ్మంత్రిజన పుంగవున కాతం డిట్లనియె. 49

క॥ నిష్ఠాహీనుండవు, ఘన
నిష్ఠురమాయాప్రలాప - నిపుణుఁడ, వీవే
జ్యేష్ఠ వితనిని నియోగి
శ్రేష్ఠుల లోపలను జెప్ప - చెప్పఁగ నేలా। 50

క॥ తిరుమణియు దులసిపేరులు
తిరునామధారియు బెద్ద - తిరుగూడ వెసఁగ
ధరించి ముష్టి కిస్తావె
తరలుము మంత్రాంగ ముడిగి - దాసరి వగుచున్ 51

గీ॥ బంధుడును బండితుడును గూర - పాటిరాయ
మంత్రివర్యుం, డతని దోలు - మడత వెట్టి
కొట్టి సన్యాసి జేసితి, - విట్టివాడ
పితప గుల శేఖరుని జేయు - టెంత నీకు!॥ 52

సీ॥ ఇయ్యనీయవుగదా - యెంత సత్కవి వచ్చి
ప్రస్తుతించిన బూట - బ్రస్తుతైన
నుండనీయవుగదా - చండపండిత రాజ
మండలంబును సభా - మండపమున
నిల్వనీయవుగదా - నిమిషమాత్రం బైన
నాశీర్వదించు ధ- రామరులను
చూడనీయవుగదా - వేడుక నిట బాడు
గానవిద్యాప్రౌఢ - గాయకులను

గీ॥ కూసుమతమార్గరతుడవై - కులము విడిచి
తిరుగు నీ విందు జేరి మం - త్రిత్వ మూని
త్రిప్ప. నీలాద్రిరాజిట్లు - ముప్పయయ్యె,
భీకర వ్యాజ! యాదుత్రి - భీమరాజ!॥ 53

శా॥ సామం బేమియు లేదు. సాంత్వవచ - సందర్భమున్ నాస్తిదు
ర్నామణ్యాం బధికంబు, కాముకతయు - న్నాపత్యము న్నెచ్చగా,
భీమామాత్యుండ వంచుబల్కుదురు ని - న్పృథ్విన్ యదార్థంబహో
నీ మంత్రాంగంబుచేత, నేడు చెడియెన్ - నీలాద్రిరాజెంతయున్।

క। గశిక శ్రేష్ఠుడ వయ్యో!
గణికాంగన పొందు రాజు - గాదికి దగ దం
చణుమా తము జెప్పవు, నీ
గుణము తెలిసివచ్చె. బుద్ధి - కుశలుడవు భళీ। 55

క॥ అని వారిరువురు నిటువలె
ఘనఘనరవసదృశనాద - గద్గదగళులై
కినుక వివాదింపంగా
విని చింతలపాటి నీల - విభు డిట్లనియెన్। 56

క॥ మీ రేటికి వాదించెద?
రూరక యుండుండు, చెలిమి - యొప్పారంగా
గౌరవమున నా మది గల
యారాటము దీర్ప బాప - డనసూయుడుగా?॥ 57

క। రతి చింత చేత నిప్పుడు
మతిపోయిన రీతి నుండు - మాకున్ సుద్దుల్
హితమతి జెప్పెదు, హాహా!
పతిచిత్త మెఱుంగ లేవు - బాపడ వయ్యున్॥ 58

వ॥ అని యతనిమీద కోపసంఘటితచిత్తుం డగుట గనుంగొని తత్సన్నిధి గల వార లేగుమనిన నతం డరిగె నంత భీమరాజుం జూచి యేకాంతంబున నిట్లనియె. 59

క। బాప డని నేను దనియును
నోపిక జేసితిని గాని - యొరులను జుమ్మీ
పాపమున కోడ కిమ్మెయి
బాపన్నను భీమరాజ - పటు కోపమునన్॥ 60

వ। అనిన భీమరా జతని కిట్లనియె, 61

క। అదినైన బంది బోడవో
యెదురించు పులిని బోడవో - యేన్గు బోడవవో
కదనమున శత్రు బోడవో
వదరుచు నెమ రాడు నట్టి - పాము బోడవవో॥ 62

క॥ అని భీమరాజు పలికిన
విని మనమున సంతసించి - వేడుకతో ని
ట్లనియెను జంద్రిని వేగం
బనుకూలము సేయ కున్న - హా! యెట్లోర్తున్॥ 63

ఉ॥ కోకిలకీరశారికల – కూతలకున్ గళహంస కేకినీ
భీకరనిర్భరాగ్బటికి – బెగ్గిలితిన్, మఱి చెప్ప నోప, నెం
దాక సహించువాడ, వెస – దాని త్రికోణముదెచ్చి చూపుమా
నా కెదలోని మన్మథక – నఘ్నన పావకతాప మాఱగన్। 64

గీ॥ మఱి విచారింప నది యాఁడి – మళ్ళ వేంక
టాభిధానప్రజావతి – యంశ బుట్టి,
సకలరతిబంధచాతుర్య – సరణి గనియె,
పూని వర్ణింప దాలి కే – సాని సవతు?। 65

క॥ కావున వేంకటశాస్త్రికి
నా వల పెఱుగంగ జెప్పి – నను, నాతడు తా
నావలి పని సమకూర్చును
వేవేగమే భీమరాజ! – విచ్చేయ వయా। 66

వ॥ అని చెప్పి.

చ॥ పనిచిన, నాత డేగి గనె – భంజితనీలతరాజగాయసం
జనితకరోటికూటము స – పాసఘృతప్లుతసత్ప్రలాశమాం
సనికరవర్ధమానబిల – సత్ప్రుటువహ్నిశిఖాప్రకాటము
త్యనుపమమంత్రతంత్రకర – యాజకఝాటముయజ్ఞవాటమున్

క॥ కనుంగొని తచ్చాలాంతర
మున దక్షుడు బోలె యజ్ఞ – ముగ్రంబున దా
నొనరించు వేంకటముఖిన్
జనవున గని రాజ్యకార్య – సంగతి దెలిపెన్॥ 68

క॥ తెలిపిన, మఖి యత్యంతము
బులకపు వోడము, భీమంత్రి – పుంగవ! వెస దా
దలచిన పని సమకూర్తును
జెలిమి వెలయ. నీ ముఖంబు – తెల్లిన పిదపన్। 69

క॥ దాతయు, దైవము నేతయు
నే తీరున గన్నవతడే – యెప్పుడుగానన్

నీతోడు, భీమరాజా!
యాతని వనిసేయు టుచితి - మగుఁ గద మాకున్! 70

క॥ అని రాజుగారి దంతియు
వినయంబునఁ దెలుపు మనుచు - వేఁడిన, నతఁడున్
జనియట్ల చెప్ప, నీలా
వని విభుఁడుఁ గుడారమునను - వసరుచునుండెన్॥ 71

వ॥ అనంతరంబున నయ్యారామద్రావిడ బాడ బాగ్రగణ్యుం డగు వెంకటసోమపీథి నిరతపర్యుషితాన్నదాన విథానసంక్రుద్ధసుప్రసిద్ధ వృద్ధభూమీసుర వారానివారితభూరితరదారుణభాషా విశేష దోషితం బును, ప్రచండతర చండాలసరోవర పరిసరపరికల్పితానల్పవిశాలశాలా తటతటుల కుటిలాచ్ఛమత్స్య పుచ్ఛాచ్ఛాదిత కృపీట సంపాద్య మానా హీనపురోడాశ ప్రముఖాయోగ్యవస్తుయాగభాగానురాగా రహితవిహిత మహితబృందారక బృందంబును, యథావిధివన్నిర్ఘాగిత దక్షిణాక్షీణ పదార్థపంచనాగుణనిరస్తోత్సాహసాహసధానవ్మహాసోమయాజి విరాజ తంబును, జామాత్యమూర్ఖముఖ కఠినవాక్యతర్జనభర్జనపలాయిత సకల దేశసమాగతవివిధవిప్ర ప్రకరంబును, పరమపరిహాసక పరికల్పిత స్వచ్ఛా చ్ఛాగ నాదానుమోదిత వేదితలాంతరపరిసర్తిత ధూర్తపండిత పామరజనస మూహంబును, బ్రాహ్మణార్థ సంపాదితబహుళసత్ఫలశాక పాకభక్ష్య భోజ్యదధిఘృతగుడాదిక వస్తుసోమచౌర్యక్రియా కౌశలయాత్రాయాతా తతాయి శ్రేష్ఠకుమార నారాయణశాస్త్రి విశ్రుతంబును, సంభావనా సంభ్రమాలోక నార్థసమాగతవితతవారాంగనాభుజంగ పుంగవశృంగా ర కేళీగృహాయమానశాలావమానప్రదీప్తవిశాలకాయమాన నికాయం బును, విపులాపూపక రాపోపమానపీనోపస్థస్థలవికీర్ణానేక దీర్ఘ తరశ్యామలకోమలరోమస్థామోద్ఘాటనపాటవ ప్రోల్లసద్బ్వాల నిధవావి రాజితతాంతగేహంబును. విదార్యమాణపశువిసరకళేబర సంజనితఘన తరక్షరీతక్షతజ ప్రవాహ బిందుసందోహగ్రసనవ్యసన సంభ్రమభ్రమద దభ్రశుభ్రగృధ్రకాకఘూక కంకకౌలేయక గనయగోమాయ ప్రముఖ వన్యఖగమృగజాలకోలాహల బధిరీకృత జనసమూహంబును, పరమ

నిర్భర నిర్భాగ్య దామోదర దుర్మోదర మృగయావినోదామోద ఖేల స్నీలాద్రినృపాల బాలిశదుష్కరకరాగ్ర సమర్పిత యాగఫలదానధారా పూరంబునుం గా, క్రతువు సమాప్తంబు గావించి. "జన్నంబు బన్నంబు లేకుండం గడతేరె, మఱియు పుత్త్రియు నిజముఖకళా విలాస తిరస్కృత చంద్రరేఖ యగు చంద్రరేఖను, గోమలాలంకార భవ్య యగు నా కావ్య కన్యకకును నుత్తముం డగు నీలాద్రి నృపుండు వరుం డయ్యెడు సమయంబు వయ్యె; మామకీ. భాగ్య మహిమంబు చెప్ప దరంబె!; యని సంతుష్టాంతరంగుండై చని చని 72

సీ। పూతిగంధాధార – పురఖాత డిండీర
భరితమైరేయకుం – భవ్రజంబు
గ్రామసూకరమాంస – ఖండశోరణవార
కంక వాయసగృధ్ర – సంకులంబు
మేమురఖాదనా – మోద సంపాదిత
తామ్రచూడాసహ్యా – తటతలంబు
రతిరాజసంగర – త్రుతిషిద్ధజనశుక్ల
మూత్రార్ధగేహాళీ – చిత్రితంబు

గీ। కుటిలవిటీజనసంధాన – విహితవచన
పచన రచనా నిపుణకుట్ట – నీ సహాయ
కరణ కారణ కౌలేయ – కంబు; వేంక
టాభిధా రాతిసేచ వే – శ్యాలయంబు। 73

క॥ ఇటు నటుఁ గనుఁగొని లోనికి
లోటలోటఁ జని మంచ మెక్కి – లోలత సవిత
త్తటమునఁ గూర్చుండిన, న
క్కుటిలాత్ముండు కౌగలించు – కొని యి ట్లనియెన్। 74

తే। గీ। ఎంత భాగ్యంబు చేసితి – మిరుపురమును!
కాను విడకుండ యజ్ఞంబు – కలిగెఁ, జంద్ర
రేఖను దలఁచి నీలాద్రి – ఱేఁడు మిగుల
మోహితుఁ డయ్యె, భాగ్యమా – మోద మొందవె॥ 75

క॥ నీలాద్రి రాజు మిక్కిలి
లాలిత కృశీయించె విరహ - దహనముచే, నీ
వేళం జచ్చును, వేగం
బాలోలతఁ జంద్రి నంపు - మాతని కడకున్॥ 76

తే॥ గీ॥ పూర్వమూఁకులు నీవు నీ - పుత్త్రికయును
చూమువల్ల యెఱింగి బో - జుగుల వలపు
వెల్లి గొలుపుచు బలువుగ - విత్తమెల్ల
లాగుదురు, ధాత్రి మీవంటి - లంజె లేరి?॥ 77

తే॥ గీ॥ నేఁడు నీ కల్లుఁడాయెను - నీలనృపుఁడు
కూఁతురును నీవు నేనును - గొదవ లేని
సిరులఁ బొదలెద మింక, నీ - చిన్నదానిఁ
గడఁక గైసేయు, మని చంద్రి - గాంచిపలికె॥ 78

తే॥ గీ॥ బాలరో! నీవు మిగుల సౌ - భాగ్యవతివి
యొక బోజుఁగు నోవమఱి యొక్కఁ - డుత్తముండు
దొరకె, నీలాద్రిరాజు స - చ్చరితుఁడిపుడు
నిన్ను గోరి పిలువనంపె, - నేఁడు నీవు॥ 79

క॥ ఏలాగున నలయించెదొ?
యేలాగున నీలవిభుని - వలయించెదొ? మ
మ్మేలాగున రక్షించెదొ
బోలెఁ దెగడు నీదు భగము - పుణ్యముచేతన్॥ 80

వ॥ అనిన చంద్రరేఖ యిట్లనియె. 81

సీ॥ చూపుకోపులచేత - జుంబనంబులచేత
దంతక్షత నఖక్ష - తములచేత
తాడనంబులచేత - బిడనంబులచేత
గాఢపరీరంభ - కలనచేత
నుపరతిగతులచే - గపట వాక్యములచే
దాఁబూలదాన వి - ధంబుచేత

కలవంబుఁబూతచేఁ - గారవింపులచేత
గాన నాట్య ప్రసం - గములచేత
సీ॥ మందు మంత్రింబులనీల - మనుజవరుని
లోలుగావించి కలధనం - బోలి లాగి
పిదవ జోగిగఁ గావించి - డించి
తెత్తు మీాసన్నిధికి నాప్త - తిజ్ఞ వినుఁడు॥ 82

ఆ। వె॥ దొడ్డదొడ్డ తురక - బిడ్డల నాతోడ
లందు నిరకఁ బట్టి - యడుగనెత్తిఁ
బెట్టి" లోలుఁ జేసి - వట్టివానిగఁ జేతు"
నీలనృపుఁడు నాకుఁ - జాల గలడె। 83

తే। గీ। అనిన, నీవంత నేర్పిరి - వగుదువమ్మ!
లెమ్మ! ముస్తీబు గమ్మ, శీ - ఘ్రమ్ముగాను
బొమ్మ యారనితమిఁ దీర్పఁ - గమ్మ విల్తు
చేతబంగరుబొమ్మ! యో - చిన్నకొమ్మ॥ 84

క। నావుడల చంద్రి యప్పుడు
భావం బలరార లేచి - పరిపరిగతులన్
వేవేగఁ జేయ దొడగెన్
గేవలశృంగార మొసలఁ - గీలుకొనంగన్ 85

క। నీలాద్రిరాజమోమున
గ్రాలెడుగడ్డంబు రీతిఁ - గనుపట్టి మహా
స్థూలోపస్థా భాసా
భీలతనూరుహము లన్ని - బిరబిర బెఱికెన్। 86

క అతని పెనుబాలీసుల
భాతిన్ గడుపొడవు లగుచుఁ -బ్రబలు కుచము లం
దాతత మలయాచలసం
జాతసుగంధంబు మిగుల - జాతుగ నలఁదెన్। 87

క। ఘుగఘుగసుగంధబంధుర
మగుచుండెడు దూప మింక్రియె - నానందమునన్

నిగనిగ నీలెపు తన ఘన
భగదేవత కాత్మవాంఛ ♦ ఫలియించుటకున్. 88

ఆ. వె. గొఱ్ఱెబొచ్చుకంటె ♦ నెఱసిన్నై చిఱసిలా
కుఱ్ఱ వెంట్రుకలను ♦ గూడదువ్వి
తొఱ్ఱకొప్పు వెట్టి ♦ నఱ్ఱుబిగను జాల
విఱిసిపీకుగొంచు ♦ బిఱ్ఱబిగియ. 89

క. హరి మొగము జెగడు మొగమున
హారిదళమును దళముగాఁగ ♦ నలది మహాసిం
ఘురతర నేత్రయుగంబున
గరమరుదాతంగ మందు ♦ కాటుక వెట్టెన్. 90

క. సక్కగ సింగారించిన
యిత్తడి సొమ్ములనుబోలి ♦ యెర గగ మేనన్
బుత్తడి సొమ్ములు తన కా
వత్తారణ కారణముగ ♦ బాగుగదాల్చెన్. 91

క. కంచెలలోపల గట్టి బి
గించెన్ జనుగట్టుదోయి ♦ గిరినాగులనా
డించక హితుండికుడు వడి
వంచనతో బెట్టిపట్టి ♦ నైఖరిదోపన్. 92

క. ఈలీల నలంకృతయై
యాలోల వెలింగినప్పు ♦ డాశ్చర్యముగా
నీలాద్రిరాజు బట్టం
బోలోలత మెరియు పెద్ద ♦ భూతమొ యనగన్ 93

ఉ. అప్పుడు సోమయాజులు త ♦ దాకృతి వేంకటసానియుక్తుఁడై
తెప్పలు మోడ్ప కర్మిలి న ♦ టించగని, కూతుర! నీకు దుల్యయౌ
నొప్పులకుప్ప నిప్పుడమి ♦ నొక్కెడ జూడము, లోలవయ్యు, బా
గొప్పెదు బాలలీల గడు ♦ నూనితి మెచ్చలి! యంచు మెచ్చగన్.

క. నీలాద్రిరాజు వార
స్త్రీ లోలుండయ్యెనింక ♦ జెడి వైతరిణిన్

గూాలు నిటు లనుచు దెల్పెడి
పోలిక నంభోధి గ్రుంకె । బ్రొద్దు రయమునన్. 95

క. అపకారి నీలభూపతి
యపయశో మల విష్టపముల । నలమె ననంగా
విపుల మగు కటికిచీకటి
విపులాస్థలి సంబరమున । విప్పగ గప్పెన్. 96

శా. అంతన్, దారలు దోచె నంబరమునం । దా నీలభూపాధముం
డెంతే జంద్రిని గూడ దత్తరువునం । దిం జైన సందీయు క
త్యంతంబున్ రసపాక్య లిట్లువాడమున్ । దన్వాం బటుంచున్ నభ
కాంతారత్నము దెల్పెనో యన మహా । గాఢాతిధౌతచ్ఛవిన్. 97

ఆ. వె. తాను జంద్రరేఖ । నా నెసంగుదు నంచు
సాని పుష్పితోత్తు । లోనుబ్బు,
దాని నేతునంచు । దా గోపమున వచ్చె
నో యనంగ జంద్రు । డుదితుడయ్యె. 98

వ. అయ్యవసరంబున

ఉ. వేంకటసోమయాజియును । వేంకటపాసయు శ్రద్ధులై, కడన్
బొంకపుమాటలున్ వగలు । బుద్ధులు దద్దయు జెప్పుకొంచులో
గొంకక నీలభూవిధుని । గొల్లెనలోనికి దాని దూర్చి పూ
కంకటి చెంగట న్నిలువ । గన్గొని యానరపుండు వేడుకన్. 100

ఉ. దిగ్గున లేచి దండ మిడి । ధీవర! యజ్ఞము జేసినావు మున్
బగ్గగ, మేము మన్మథ వి । పద్దశనుండీ తొలంగనిప్పుడీ
సిగ్గరికన్నె దార్చితివి, । చెప్పగ శక్యమ నీ ప్రభావ? మీ
వగ్గవి గాక లాపడవె । యారయ వేంకటసోమ పీథిరో. 101

ఆ. వె. యెద్దుమానసుడవు, । యోదా తడదువు, సో
మాదుగుటవు, నీవు । మామ వైతి,
మాకు బున్నె మెలమి జే కూరె నో! చంద్ర
రేఖ మీరు చంద్ర । రేఖ నలన. 102

క॥ నావుకు నత డిట్లనియెను,
దేవా! తావక కటాక్ష । దృష్టివలననే
కావించితి గ్రతుః; విప్రుడిది
నీవన్నియు జూచి వలచె । నీలనృపాలా॥ 103

సీ॥ కైశ్యంబు కందంబు, । ఘనగోధి చంద్రమః
ఖండంబు, భ్రూద్వంద్వ । కమ్ర ధనస్సు,
చక్షుస్సులు చకోర । పక్షు, లోష్ఠంబు పీ
యూష సరస్సు వ । యోధరములు
మాతంగకుంభముల్, । మలినరోమాళి పి
పీలికాశ్రేణి, గం । భీరనాభి
విషనిధి, కటి మహా । విపులసువేది. వ
క్త్రామరసంబు, మ । దన సదనము

గీ॥ పాండురాశ్వత్థభూరుహ । పత్ర, మిట్టి
సరస సౌందర్యవతి యగు । చంద్రరేఖ
నీకు దొరకెను. సంభోగ । విహితలీల
దక్క నేలుము నీలాద్రి । ధరణిపాల॥ 104

ఆ॥ వె॥ దీని తల్లి యీమె । నా నేరస్తురాలు, మే
మిరువురమును నీకు । హితుల, మెట్లు
సాకెదవో? యటంచు । జంద్రహస్తము దెచ్చి
యాతని చేత నుంచి । యప్పగించి। 105

క॥ ముప్పదియా ఱేండ్లది, ముం
దెప్పుడు నొక్కరుని బొంద । దేలాగున నీ
విపుడు దిద్దుకొనియెదో?
మొప్పెతనము మాన్పవలయు । ముందట పనిలో॥ 106

వ॥ అని మరియును

శా॥ కం పేపారెడు మంచిగంధమును బు । క్కా క్రొత్తపన్నీరు క
ప్రంపువ్వక్కలు నాకులున్ దబుకుతో । బర్యంక మం దుంచి తా

దంపత్యోశ్చిరకాలభోగ్య మను వృ । త్తంబుల్ మహాశస్వరం
బింపారన్ బఠియించి వేంకటమనీ । షీంద్రుండు మోదంబునన్

శా. తారామార్గము జూచి మంగళముహూ । ర్తంబివ్వ డేతెంచెగా?
యో రాజాగ్రణి! పుస్తెకట్టుమిక జా । గూనంగ నేలా? ధ్రువం
తే రాజా నరుణోయటంచు నుడువన్, । దేజంబు దీపింప ద
న్నారీకంఠమునన్ ఘటించెను సువ । ర్ణ ప్రస్ఫూరితసూత్రముగా.

క. తలబ్రాలు నోయ నవి జల
జల జాల్కాని మదనసదన । స్నిగ్ధస్థలిపై
బొలిచెను భావిసురత సం
కలి తేంద్రియ మిల్లుపైని । గప్పు ననుగన్. 110

వ. అనవరతంబున వేంకటశాస్త్రి యిట్లనియె. 111

శ్లో. యభస్యపుషిణీం చంద్రరేఖామలముఖీమిమాం
చంద్రరేఖాం బగవతీం త్వాం నీలాద్రి ప్రజాపతే. 112

శ్లో. త్వన్మందిరే బహుళ కాంచనసిద్ధిరస్తు
వంశాభివృద్ధి రధి కాస్తు శివారవోఽస్తు
బలార్కకోటిరుచి రస్తు మలేత రాస్య!
నీలాద్రిపుణ్యజనవర్య హరిప్రసాదాత్. 113

వ. అని యాశీర్వదించి యిట్లనియె. 114

క. స్మరమందిరాంగణంబున
కరదంతక్షతము లుంచి । గాఢరతుల భీ
కరభంగి జేయ కిప్పుడు
తురతుర న వ్వేనుక మెల్ల । ద్రోయుగవలయున్. 115

ఆ. వె. ఆకు పోక వెట్టి । లోకువగా బట్టి
పూకు మెల్ల నిమిరి । నూకవలయు,
డాక జేసి వేగ । దాకంగ బోవద్దు,
నీకు దక్కె జంద్రి । నీలభూప. 116

వ. అప్పుడు వేంకటసాని యిట్లనియె. 117

క. బాలసుమీ, గోలసుమీ,
బేలసుమీ, గాఢరతులఁ । బెంపేదఁ గడున్
సోలింపక తూలింపక
పాలింపుము, చంద్రి! నీవు । పాలయ్యోసికన్. 118

క. డా సిందు విడెము మరుచే
గాసిం దగ్గఱక మున్న । గా మచ్చికఁగా
జే సిందు పొమ్ము పిదపన్
నీ సేతల కెల్ల నోర్చు । నీలనృపాలా! 119

వ. అని చంద్రరేఖంజూచి యిట్లనియె. 120

క. సచ్చోడా! పబు వీకేఁడు
మెచ్చుమునకు నచ్చుమునకు । యిచ్చల నుడీగా
యిచ్చును, హెచ్చుగఁ గొలువుము,
నచ్చు యిటుల సేరబోక । నందర లేకా. 121

క. దేవేరిఁ గేకదవు స
ద్భావంబున సితేఁడు చేనఁ । బట్టిన నీ, వో
పూవుంబోడిరో! విటసం
భావనపైదలపు విడిచి । బత్తి గొలువుమా. 122

సీ. పాటపాడు మటన్న । బాడక యెలుగెత్తి
పదిరిరోదనము చే । సెదవు సుమ్మ,
కాళ్లొత్తు మని వేడ । గడువడి నొత్తక
నెదురొత్తమని వలి । కెదవు సుమ్ము.
తమలమందిమ్మన్న । దమినీక క్రిమ్మఱి
నా కిమ్మటంచు బె । సగెదవు సుమ్ము
రతికి రమ్మని పిల్వ । రాగిల్లి డాయక
యదనున గడకు బో । యెదవు సుమ్ము,

ఆ. వె. తురక దుండిగాడు, । దూదేకులియుగాడు
పసువులవాడు గాడు । బట్టుగాడు,

మనల నేలునట్టి । మనుజనాథుఁ డితండు
సెప్పినట్లునీవు । సేయు చంద్రి 123

వ॥ నావుడు నతం డిట్లనియె. 124

ఉ॥ పుత్త్రికకీలుబొమ్మ యనఁ । బోలెడు మోని చంద్రిక
హాత్తుకఁ దోడితెచ్చి విర । హార్తి హరింపఁగ జేసినావు
కుత్తమ భూషణాంబరస । ముత్కర మిచ్చెద వేగ నంచు. మో
యత్త్! వలక్షనిర్జితవి । యత్తల వేంకటనాథ జానుగ౯ 125

క॥ అన నవ్వుచు వారిద్దరు
జని రంతట నీలవిభుఁడు । జంద్రిని గని నూ
తన మదనకేళిఁ దేలెద
నని కోపల మోహ మొదవి । హస్తము పట్టన్॥ 126

క॥ తలపంచి పట్టుకంకటి
గల దండము పట్టి పనలఁ । గా నొల్లక తా
వెలవెలఁ బోవుచు సిగ్గుం
గల బాలిక నోటఁ బెనఁగఁగానాతండు౯॥ 127

ఉ॥ ముంగటికుచ్చు పట్టుకొని । మోహమునన్ దఁశయ్యఁ జేర్చి వా
రాంగన వింత సిగ్గుపడ । నర్థామే! యెందఱుఁ జిక్కె నెట్టితో
దొంగతనంపు టీ నగలు । ద్రోచి హసన్ముఖ నయ్యెఁ గౌఁగిలన్
లోంగఁగ బట్టి నమ్ము రతి । లోలువిఁ జేయుము నీకు మ్రొక్కెదన్

ఉ॥ చంద్రుఁడు మింట వంటి సర । సంబుగ నగ్నిశరాళివిస్ఫుర
చ్చంద్రిక౯గా యఁజొచ్చును । చావుఁడు బాణము లేయఁజొచ్చెనో
చంద్రి! విలాసవిభ్రమవి । శాలశరాసలీల మీఱఁగా
సాంద్రకృపాకటాక్షమునఁ । జక్కగ గన్గొని కోర్కెఁ దీర్పుమా

సీ॥ సకలభాగ్యము లిత్తు । చక్కెర కెమ్మోవి
చవులు చూపింపవే । చంద్రరేఖ!
శంబరాంతకు చేతి । శరముల కోర్వను
జక్కఁ గౌఁగిట డాఁచు । చంద్రరేఖ!

చల మేల పూనెదు! । వెంపు నిల్పఁగఁ జాలఁ
జన్ను లంటఁగ నిమ్ము । చంద్రరేఖ!
తాళజాలను నీదు । కాలికిఁ బ్రొక్కెద
స్మరమందిరము జూపు । చంద్రరేఖ!

గీ॥ కడకుఁ బోవక నెమ్మోము । ముడుఁచుకొనక
సిగ్గు విడనాడి నన్నుఁ గటా । క్షించి నీవు
కన్నెపాయంపు రతికేళిఁ । గలియ నిమ్ము
జాగు సేయక కపటపుఁ । జంద్రరేఖ! 130

క॥ నీకు నే దాస్యము చేసెద,
నాకు నె గల ధన మొసంగి, । నానాగతులన్
బైకొని రతి న న్నేలుము
ప్రాకటముగఁ జంద్రసాని! । పల్లవపాణీ! 131

చ॥ సిగ విడి జాఱ, మోమువయిఁ । జెమ్మటబిందువు లూర, గబ్బిచ
న్నొగసలు నిక్కఁదేఱ, దెగి । ముత్తెపుపేరులు శయ్యఁ జేరఁగా,
భగ మతిసార మూర, జల । వంక కళంకత జిలువారఁగా
వగఁ బురుషాయితంబున న । వశ్యము నేలుము చంద్రరేఖనో!

క॥ నా విని శరావసన్నిభ
కేవల సుస్నిగ్ధమదన । గృహము చెమర్పం
గా వాలు బెళుకు జూపులఁ
దా వలనుగ నతని మోము । తప్పక చూచెన్ 133

క॥ ఇటువలెఁ జూచిన నాతఁడు
తటుకున నదె సమయ మనుచుఁ । దమిదీరఁగఁ గౌఁ
గిట నొత్తి మోవి మధు వటు
గుటుకు గుటుకు రనుచుఁ గడుపు । కొలందిన్ గ్రోలెన్॥

సీ॥ బుడ్డికుండలవంటి । బుగ్గలు చుంబించి,
గొఱ్ఱెబొచ్చును గేరు । కురులు నిమిరి,
కప్పచిప్పలవంటి । కన్నులు ముద్దాడి,
యూద బొడ్డున కరం । బూది నిలిపి,

కొలిమి తిత్తులఁ బోలు - కుచములు పీడించి
మరగాళ్ళఁ దెగడెడు - కరములంటి
కొంగకంఠమువంటి - కుతుక గోరులవించి,
పులిబోను బోలెడి - పూకు చమిరి

గీ. వెడద కుంచములో వ్రేలు - వెట్టినట్లు
యోనిలో గాముదండము - నొత్తిదూర్చె
వెనుకకును ముంగలికి నూగు - కొనుచు నీల
ధారుణీశుండుఁ నడి వడి - దాఁక నదియు. 135

క. ములు నల్లమందు మాజుము
తిని యున్నది గాన మేను - తిమ్మిరిగొని యా
తని తాకుఁలకుఁ జలించక
తన నేసుపు కోపు జూప - దలచి కడంకన్. 136

క. భగము వికసింపఁ జేయుచు
బిగ బట్టుచు లోన జొర న - భేద్యంబుగ ద
ప్పగ ద్రోయుచు బెణకించుచు
బిగి తొడలం జుట్టి పట్టి - బిట్టలరించెన్. 137

సీ. పారదోపమపీర్య - ధారపతిత భగం
స్తనచర్మభ స్త్రికా - తాండవంబు
కక్షప్రదేశ ని - ర్గతఘర్మ సలిలంబుబు
చక్రక్రమచపేట - చాలనంబు
భూరితరాపాన - మారుతోద్ధూతంబు
ఘన కేశా దుర్గంధ - గంధిలంబు
శునకబంధ విశేష - వినమిత మేఢ్రంబు
క్రీడారచితపాద - తాడనంబు

గీ. గార్దభస్వరనిస్సర ద్గ్రామ్యవచన
మమితరోదనజలపూరి - తాననంబు
చంద్రరేఖాభిదానవే - శ్యాజలాస్య
ప్రథమ సురతంబు నీలభూ - పతి గరంచె.

వ॥ ఇవ్విధంబున సమరతిం గావించి నప్పుడప్పుడు పుంబో టిమిన్న మున్నెరికంబున నన్నీలాద్రి రాజపుంగవుపై లంఘించి హుంక రించి జంకించుచు నయులేక సంకోచంబు మాని 'ఇంక నాచేతం జిక్కితి' వెక్కడికిం బోయెదవు? నిలు నిలు, నా యువరతి చమత్కారంబు తోరంబుగాం జూపెదం బరాకుగాకు, రాకొమారా మాటాడక నా కేమి మెప్పులిప్పు డిచ్చెదవో మది నెంచుకొమ్ము" అని చెక్కిలి నొక్కి యక్కునం గ్రిక్కునం దన లంబమానపీన స్తనంబులు గది యించి నునుదొడలం గుదియించి సదలని మదంబున మదంబునం దన మదన సదనంబున నతని మేహనంబును నమోఘంబుగాం దగిలిం చుకొని ముమ్మరమ్ముగా దొమ్మరికొమ్మ గడ గడసియాడు చందం బున సంభ్రమించుచు లాగివైచు చందంబున నొత్తుచు మేను మేన హత్తింపుచుం దత్తరింపకం గొంచెపడకం దిట్టతనంబుం దెచ్చుకొని విచ్చలవిడి ముచ్చటలెల్లం నెరం జనుమిట్టల గట్టిగ బిగం బట్టి యిటట్టు బెసంగకం దడంబడక గుట్టు చెడకం జేతులు పట్టువిడక నెదురు కట్టింపు మని చేయి మూర్పు మని. యదుగు తప్పె నని మించం బలుకుచుం గులుకుచుం గోడె పాయంపు సాడింపు సాలెవాండు ఘళుకు ఘళుకు మన బలక చుదలుగ దాటించు వాటంబున నోటుపడక నీటు జూపుచు, బరిభ్రమణ వేగంబునం గరపాదభూషణ విశేషం బులు ఘల్లు ఘల్లు మది భీషణంబుగ ఘోషింప న వ్యారయోషాల లామంబు పెదవి పెదవిం గదియం దనపడుద వాడి మొన పంటం బట్టి పీల్చుచు చిట్టికుట్టు వెంట్రుకల తొట్టకొప్పు వీడి యక్కటి ప్రదేశం బున నటియింప గుండలంబులు గండతలంబునం దాండవింప గోరిద కంప సొంపునం బెంపారు కంపుమేనుల ననూనంబుగా గ్రమ్ము ముమ్మరింపు జెమ్మటసోన లతని దుర్భరతరసంపృథమాన దేహశాల్మ లీద్రుమంబు నందు దిగజారి వీరుల సివం బెత్తిన లాగున నూగు లాడు చందం గని యా ప్రజాపతిసేద దీర్చుకొని క్రమ్మఱ నమ్మరు దురంబున కెదిరించి వలవని చలమ్ము హెచ్చ బెచ్చు పెరుగు మచ్చరంబున సమదమ్ముగ నదుముకొనిన నదియు వదలక పదరుచు

గుది గొన్న తమకంబునం దలంకక నెదురుదాఁకి ధాఁకి నిద్దఱుఁ దద్దయు సంభ్రమంబును జలంబును జయకాంక్షయు మనంబునం బెనంగొన వగ్గలంబుగ నిగ్గుచు వెనుకకుం దగ్గుచు మొగ్గరించుచు బగ్గెలు సెప్పుకొనుచు జెండు చెంటుక బండబండగ దాకులాడు నెడ నచ్చంద్రరేఖ బవిటజనసంయోగ జనితచాతుర్య కళాధుర్య కావున మొగ్గవేసి యోటుపడం జేయ సమకట్టిన నాదిట్ట మట్టితేకును బవాలుగణికా విలాసినీదాసికాసంభోగ సంభృతనైపుణిగుఁ గణ్యుండు గావున వెనుదీయక ననుదొడలం దాని నడుము బిగించి మూఁ ఱొడ్డుచు దెబుకు తెబుకు మను చప్పుడు లుప్పతిల్ల బిట్టట్టుసేతల నెట్టుకొని గుట్టువదలక పట్టువట్టి నూటి దప్పకుండ గండుమీఱి మార్కొన్న మహోమంబుల డంబున, జిత్తకుక్కల విధంబున, చీంబోతుల భాతి, మాలమాసటేండ్లం బోలె, మార్జాలంబుల కైవడి, మరకంపు పెనుబాముల చందంబున, మదించిన కోడిపుంజులమాడ్కి, లకుముకుల లాగున, గొఱ్ఱెపొట్టేళ్ళ భాతి, గుంటుక దోలులీల. కొత్త చేసిన కైవడి, చిట్టాముదము గుమ్మన నేర్పున గొంకుజంకు లేక, పమరతి యుపరతి బంధంబులం దేల జిలజిల మరుజలంబును జాలుకొని తదీయశయ్యాతలంబున బడి వెల్లివిరిసి సెలయేరులై పాఱ మహామైథున సంకల్పసంభోగ క్రీడావినోదంబులు నూపి యలసి సొలసి తొడల తొడలును, బాహువుల బాహువులును, మోవిని మోవియు, మొగంబున మొగంబును, పదంబుల పదంబును. నురంబున నురంబును, భగంబున లింగంబును, గదియ గాగలించుకొని దీర్ఘ నిద్రాసమాయుక్తనేత్రులై పడియుండి రనంతరంబున. 139

క॥ తమ్ముల జక్రమ్ముల నధి
కమ్ముగ బాధించు రాజు ♦ కాంతి దొరగి వే
గమ్మున గ్రుంకెన్ దద్గతి
గ్రుమ్మరు నీలాద్రిరాజు ♦ గ్రుంకక యున్నే॥ 140

క॥ అల నీలాద్రి మహీపుం
డెలమిని జంద్రిని రమించి ♦ యెంతయు దేజో

బలహీను డగుట దెలుపన్
దెలుపు వాడమి నట్లు తూర్పు ♦ తెలతెలవారెన్॥ 141

క॥ ఇనవంశ సంభవుండై
ఘనసన్మార్గంబు దొరగి ♦ కాముకుడో నీ
లనృపతి గా దన గినుకన్
జనుదెంచె ననంగ నపుడు ♦ సవితృడు దోచెన్॥ 142

తే॥గీ॥ అంత జింతలవాటి నీ । లాద్రిరాజు
మొగము నెల వెల బోవంగ । నగుడి లేచె
చంద్రరేఖయు ముఖకాంతి । సడలి కనుల
నుసుముకొంచును మేల్కాంచి । మసలుచుండె॥ 143

వ॥ అత్తరి నా రాజోత్తముండు దానిం గూర్చి యిట్లనియె. 144

క॥ నావంటి రసికు డెందము
గేవలముగ గరగ జేసి । కేరుచు, మిగులన్
భావభవకేళి దానుని
గావించితి, నీకు సాటి । గారే సానుల్॥

క॥ నీ మొగము నీ త్రికోణము
నీ మెఱుగుం గన్నుదోయి । నీ నునుదొడలున్
నీ మోవి నీ కుచంబులు
నా మది నిక మరువ జాల । నమ్ముము బాలా

క॥ సొమ్ములు చీరలును వరాల్
సమ్మతమున నీకు నిత్తు । సత్యం, బిక నా
సొమ్మయి యుండుము విట సం
ఘమ్ములతో జెలిమి మాని । కలికీ! యెపుడున్॥ 147

ఆ॥ వె॥ సానిదానవనంచు । బూని లోలో వెచ్చ
కాంద్ర గూడ నేను । గాంచినపుడె
చన్ను ముక్కు మోవి । నున్న గొల్లియు జిక్కి
కొవ్వు గోసి వెళ్ళ । గొట్టువాడ॥ 148

క. రాయవరంబున నీ క
ల్యాయత గేహంబు గట్టి । యం దుంచెద. నీ
వే యెడకు బోక యుండుము,
నీ యండనె యుండువాఁడ । నే నచ్చోటన్. 149

తే. గీ. నావుఁడు న దిట్టు లనియెను । దేవ! నాకు
నీవు దయ యుండ జిక్కుట । కేవలముగ
సకల సామ్రాజ్య మిచ్చుటె, । సంశయంబు
లేదు. నీదాననై యుందు । మోదమునను. 150

క. నీకంటె లోని చుట్టము
నా కిచ్చెదు నాఁడు గలఁడె? । నానా గతులన్
జేకొని కాపాడుము నను
గాకర! యెవ్వరిని జేరి । నరుగక యుందున్. 151

న. అంత నంతకుమున్నె గోతియొద్ద నక్క చందంబున ద్వార
బంధమ్మునకడ గాచుకొనియున్నవాఁడు గావున వేంకట సోమయాజి
యి దంతయు నాలకించి పక్కన లోనికిం బ్రవేశించి యిట్లనియె.

క, ఇపు వినుము చంద్రరేఖా!
భ్రమరమువలె నిన్ను జేత । బట్టి, యెవనిన్
విమయింప నీయ గట్టిగ
మృష గాదని పలికె మిగుల । బ్రేమదలిర్పన్. 152

వ అయ్యవసరంబున,

సీ. ప్రాతపుట్టము గట్టి । పూత చెందిర వెట్టి
పాగ చెప్పులు మెట్టి । చేత గట్టి
కోలపోలుచు బూని । చాల మధ్యం బాని
ప్రేలుకొంచును, గూను । గ్రాల యోని
పుండ్లు కీగలు వ్రాల । జంఘ్లు బొడ్డున దూల,
గండ్ల వునులు గార, । రొండ్లు ప్రేల,

నోరు దేగుగాఁ ౹ యూరఁబేరము మీఱ,
సారె వయ్యెద జాఱి ౹ యూరఁ జేర,
గీ. దారి నెముకుచు బడబడ ౹ దగ్గుకొనుచు
నప్పుడు వేంకటసాని నీ ౹ లాద్రిరాజు
గొల్లెనకు నాతులటుపాయఁ ౹ గొనుచు లోని
కరిగి చే యెత్తి మ్రొక్కి యి ౹ ట్లనుచుఁ బలికె. 155

క, నీ బాసినతో త్రిది, దయ
చే బాసల విచ్చు చాలఁ ౹ జేపట్టు మింకన్
గాబాగూబిగఁ జేయక
నీ బంతిప కూడు గుడువు ౹ నీలాద్రినృపా! 156

వ. అనిన నతం డత్యంత రంతోషస్వాంతుండై యట్ల చేసెద నని దానికిం బీతాంబరాదికంబు నొసంగి చంద్రిమ లోకంబుగా మెలగుచుండె. 157

సీ. రతిఁ జేసి యలసిన ౹ ధృతి దాని మన్మథా
గార ద్రవం బెల్లఁ ౹ గడిగి తుడుచు,
నాఁకుఁ జుట్టి యొసంగి ౹ లది తమ్మలము సేయఁ
దమ్మగైకొని నోరఁ ౹ గ్రమ్మి నమలు
నది మదిర గొనంగ ౹ నది మంచిదే యని
తచ్ఛేషపాల యో ౹ దమున ద్రాపు
నిదురించు తఱి దాని ౹ పదములఁ దొడలు త్రి
కోణంబు సుఖముగా ౹ గ్రుద్ది పిసుకు
గీ. మెల్లనే దాని మంచము ౹ నల్లిజంపు.
లావు గుబ్బల గంధ మ ౹ లంది, నిడుద

క్రొమ్ముడిని పూవుబుత్తులఁ - గూర్చు, వలపు
గులుక నీలాద్రిభూపాల - మలహారుండు. 158

క. ఇల్లెఱుగక పట్టెరుగక
యెల్లధనము దాని కిచ్చి - యెగ్గును సిగ్గుఁ
జెల్లఁగఁ దత్పాద ద్వయ
పల్లవముల దండ మురిసి - పడి కాపుండెన్, 159

తే. గీ. పుడమిపై గూడలంజెకు - బుడ్డవేడ్క
కాడఁ నెడు మాట చంద్రరే - ఖకును నీల
ధరణీవరునకుఁ జెల్లెను - తత్కథా వి
ధాన మెఱిగించితిని నీకుఁ - దథ్యముగను. 160

తే. గీ. అనుచు దంబళి వీరభ - ద్రార్యమణికి
నంబినరశింహుఁ డతులితా - నంద హృదయు
డమల్కుఁడై చెప్పి యంతట - సముచితగతి
నతని వీడ్కొని చనె దేవ - తార్చనకును. 161

క. వాచాగోచరముగ భువి
నాచంద్రార్కంబు గాఁగ - హాస్యరసముచే
నా చంద్రరేఖ కథయును
నీ చరితయుఁ జెప్పినాఁడ - నీలనృపాలా. 162

క. ఈ కృతికి సమముగాఁ గృతి
నే కవులును జెప్పఁజాల, - రిది బిరుదము, భూ
లోకము రాజుల లోవల
నీకు దొరకె హాస్యలీల - నీలనృపాలా. 163

చ. ధరణియు మేఘమార్గమును - దారలుఁ దామరసాప్త చంద్రది
క్కరటిగిరీంద్ర శేషఫణి - కంధికిటీశ్వర కూర్మనాయకుల్
స్థిరముగ నెంతకాలము వ - సింతురు, తత్క్రియ నీ ప్రబంధ ము
ర్వర సరసోత్తముల్ కవులు వర్ణన సేయఁగనుండుగావుతన్.

క. చేటీవధూటికాకుచ
కోటీసంలబ్ధవిపుల - వంకో
త్పాటనకరఖరనఖర! ని
శాటోపమ ఘోరరూప! - యార్యమపా. 165

స్రగ్విణి. రాచిరాజాన్వయా! రామదావానలా!
యాచకస్తోమ మేఘౌఘఝంఝానిలా!
నీచవారాంగనా నిత్యరత్యాదరా!
పాచకాకార! నిర్భాగ్యదామోదరా. 166

## — గద్యము —

ఇది శ్రీమజ్జగన్నాథదేవ కరుణాకటాక్షవీక్షణానుక్షణసంలబ్ధసరసకవితా
విచిత్ర సలలితాస్థంబసూత్ర కౌండిన్యసగోత్ర కూచిమంచి కుల
పవిత్ర గంగనామాత్యపుత్ర మానితా నూనసమాన నానా
విధరంగత్రిలింగదేశ భాషావిశేష భూషితాశేషకవితావిలా
సభాసురాశిర్వసర్వలక్షణ సారసంగ్రహోద్దామ శుద్ధాం
ధ్ర రామాయణ ప్రముఖబహుళ ప్రబంధ నిబంధన
బంధుర విధాన నవీనశబ్ద శాసన బిరుదాభిరామ
తిమ్మకవి సార్వభౌమ సహోదర గురుయశో
మేదుర వివిధవిద్వజ్జనవిధేయ జగన్నాథ
నామధేయ ప్రణీతంబైనచంద్రరేఖా
విలాపంబను హాస్యరస ప్రబంధ
రాజంబునం తృతీయా
శ్వాసంబు
సంపూర్ణము

కామగ్రంథమాల—నాలుగవ గ్రంథము.

# శృంగారపంచకము

ఇందుగల గ్రంథములు

జాబులు
గ్రంథకర్త
సెట్టి లక్ష్మీనరసింహ్మం

సరసోక్తియుక్త
కృష్ణ శతకము
గ్రంథకర్త
సెట్టి లక్ష్మీనరసింహ్మం

రసికాభిలాషము
గ్రంథకర్త
కవిసార్వభౌమ
శ్రీనాథుఁడు

సరసచాటువులు
గ్రంథకర్త
సెట్టి లక్ష్మీనరసింహ్మం

పూర్వకవులు
చాటువులు



చందాదారులకు మాత్రమే.
పోష్టుఖర్చులు సహా
వెల రు 1-4-0

# భూమిక

మ. రా. రా. శ్రీ సెట్టిలక్ష్మీనరసింహము గారిచే రచింపఁబడిన 1 జాబులు – మొదటిభాగము. 2 జాబులు – రెండవ భాగము. 3 వరసోక్తియుక్త కృష్ణశతకము. 4 వరచాటువులు, 5 కవిసార్వభౌమ శ్రీనాథకృత మగు – రసికాభిలాషము. ఇంక పితరకవులచాటువులు. ఈయైదింటి నిందు ముద్రించి శృంగారపంచక మని నామకరణ మొనర్చి 4వ గ్రంథముగా వెలువరించితిమి. కావున మాచందాదారు లెల్లరు సాదరముగా నాదరింతురని తలంచు చున్నారము. మాకు సర్వహక్కుల నొసంగి యీశృంగారపంచకమును మాచే వెలువరింపఁజేసిన శ్రీ శ్రీ శ్రీ సెట్టి లక్ష్మీనరసింహముగారి కెంతయు కృతజ్ఞులము.

స్వవిషయము:— ఆంధ్రరతిరహస్యము కొఱకు చందాదారులంద ఱాత్రముతో వ్రాయు జాబు లందుకొను చున్నారము. రతిరహస్యమున మేము ప్రకటించిన యర్థచౌశీతి కాక మిగిలిన యర్థచౌశీతి బొమ్మలు మా యశ్రద్ధవలన చెదపురుగుల పాలాయెను కనుక సంభోగసమయమున నిజముగాఁ దీయ బడిన యన్యదేశీయుల ఛాయపటముల నుండి చేయఁ బడిన చిత్రములతో నాంధ్ర రతిరహస్యమును వెలువరింపఁ దలఁచితిమి. ఇంక నారుమాసములలో 5 వ గ్రంథముగా నాంధ్ర రతిరహస్యమును వెలువరింపఁగల మని చందాదారులకుఁ దెల్పుకొను చున్నారము.

10-12-1922 }
పుదుచ్చేరి }

ఇట్లు
యస్ చిన్నయ్య.

శ్రీ ర స్తు.



# జాబులు



## మొదటి భాగము





మద్రమాకుమార స
తీమహితవిలాసవతిని దీర్ఘాయువుగా
ప్రేమంబున దీవించుచు,
ఆమీఁదటఁ బ్రియుఁడు వ్రాయునది యేమనఁగా.

ఉ, ఏనిమిషంబునందు నిను నేఁ గనుఁగొంటినొ యంతనుండి నా
మానసమన్యచింతలను మాని, యదేమి కతంబొ గాని, నీ
పైనె స్థిరంబుగా నిలిచి, వంతము పట్టినయట్టె మాడ్కి నీ
ధ్యానముతప్ప వేఱువిషయంబులు తోఁపగ నీయదో చెలీ. 2

చ, రమణుని నాల్కపై నొకశ సరస్వతిమాత్రమె సంతతంబు వా
సము నొనరించు నందు; రది; సత్యముకాదు, మదీయజిహ్వపై
రమణీ చిరనితనంబుగ నిరంతరమున్ వసియింతు వీవు ధ్యా
నము జపమున్ ఫలించి, మఱి నాకు లభించుత నీదు పొందికన్. 3

ఉ. ఇంగిత యొర్తె తాను హృదయేశుని డెందము పాయ దన్న పే
రొందె నటంచు లోకు లనుచుందురు, నీవును గాపురంబు నా
డెందము నందుఁ బెట్టి కదలింపవు కాలిని నిన్ను నాదు భా
గ్యేందిర వఁదునో, స్మర జయేందిర వందునో! సుందరీమణీ. 4

చ. సగముశరీర మొక్కతె కొసంగ, శిరంబునఁ దాల్చె నొక్కతెన్
తగులము కల్గి యీశ్వరుఁడు తన్వ్యో, నేనును నీ నిమిత్తమై
సగ మయితిన్, భవచ్చరణ సారసముఁ శిరమందుఁ దాల్చ నం
టేఁ గనుకఁ గైకొనంగదవె నీ హృదయేశ్వరుఁగా గృపన్ ననున్

ఉ. కన్నులు వేయి యింద్రునకుఁ గల్గుట నిక్కమొ గాదొ గాని, వే
గన్నులు నేను బెట్టుకొని గౌతమనాతిని బోలు రూపసం
పన్నను, నిన్నుఁ గందుఁ జుమి, భామిని నీ యెడ లెల్ల రాయి గా
కున్నను, నకటా! హృదయ మొక్కటి మాత్రము రాయియై
యగున్. 6

ఉ. చాలరు నీకుఁ గంతు దొరసానియు, మంతన కెక్కినట్టి యా
వేలుపుసానియున్ సరస విభ్రమరూప విలాససంపదన్,
లోలవిలోచనా, జగతిలో దొరసానులు సాను లెల్ల నీ
కాలిని గల్లు గోళ్ళ కెనగారిఁక జక్కనిచుక్క లైననున్ 7

—♦ ( గొలుసు సీసము ) ♦—

సీ. ఔ బళా! యో యబలా నీ కులుకులు! రూ
పునను గోవునను నిన్ బోలరు నర
లోకమున కలుకులును, వేలుపుఁ జిలుక
లకొలుకలు, నహాబళా! మదనుప
దను ములుకు లగుఁ గదా నీ కనుబెళుకు
లు ? బళీబళీ ! నీ జిలిబిలి పలుకు
లు? పులకండపలుకులు, బళీ! నీ మెయి తళు
కులు తొలి మెఱుపులకుం గరపుఁ గ

తే, గీ ళుకులు, మొగము వెన్నెలలఁ జిలుకును, పెదవి
నుండి యొదవి! మధు వొలుకును, ప్రమ్మధివిని వె
ఆకురు లసిత కాంతులతో నలుకును, ముంగు
రు లళికులమునకు సమకూరుచు నళుకును. 8

ఉ, సమ్మ సుమాస్త్రి నానగ ఘనమ్మసుమా నెరవేణి, మేను నూ
నమ్మసుమా, ముఖమ్ము నళినమ్మసుమా, చిఱునవ్వు నవ్య ఫే
నమ్మసుమా, మెఱుంగు రతనమ్మసుమా యధరమ్ము, చూపుమీ
నమ్మసుమా, మృగాక్షి గగనమ్మసుమా నునుగౌను నీ కహా! 9

ఉ. చిల్వలరాయ దూడిగము చేయఁగ వచ్చును నీదు వేణికిన్,
కల్వలవిందు నీ మొగము కన్గొని యంతన జో హుక మ్మనున్
కొ ల్వొనరించు నీదు తళుకుంగనుదోయికి గండుమీలు, నీ
చెల్వము నెన్న నల్వకును చిల్వలతేనికి నౌన చెల్వరో. 10

ఉ. కోకిలకాకలీధ్వనులకున్ గురుపీఠము నీదుకంఠ మిం
తీ, కలహంససంతతికి నీ గమనం బుపదేశకర్త, నీ
యాకృతి మేనకాదిలలతాంగులకున్ బడి పెద్ద, యద్దిరా!
నీకడ నేకదా యొరులు నేర్పులు తీర్పులు నేర్చుకోవలెన్. 11

సీ. కడుపునఁ గన్నట్టి గారాబుబిడ్డలు
మొలకతుమ్మెదలు నీ ముంగురులకు,
దరిఁ జేరి త్రుళ్ళెడి దగ్గరచుట్టాలు
గండుబేడిసలు నీ కన్నుఁగవకు
చెవిలోన మంతనాల్ చెప్పునేస్తంబులు
పదరుకోయిలలు నీ పలుకులకును,
అడుగుల మడుగులొత్తెడి పనికత్తెలు
చిగురుగుత్తులు నీదు చేతులకును,
ఆ. వె. ఒదిగి మెదిగి తిరుగు చున్నట్టి యాశ్రితు
లంచగములు నీదుయానములకు,
జాతిబందుగులు వసంతైనజాజులు
కులుకులాడి, నీదు పలువరుసకు. 12

ఉ. చాన సువర్ణదానమును సల్పును నీదు శరీరకాంతి, భూ
దానము సల్పు నీ కటి, సదా తిలదానముసల్పు నాస, యో
రా! నిరతాన్నదాన మమరాళికి సల్పును నీదు మోవియున్,
నే నిను నీవి వేఁడితిని నీవిఁక లే దనఁ బోకొసంగుమా. 17

చ. రజమును దాల్చు పుష్పనికరంబును, చెమ్మను బూను పల్లవ
వ్రజమును, తేజముం గల సువర్ణము, గాలికి నూఁగు తీఁగ ల
భ్రజనితమైన క్రొమ్మెఱుఁగు పంక్తియు నీ తనువందుఁ గూర్చి ని
న్నజుఁడటు పంచభూతనిచయంబునఁ సృజీయుంచెఁ గోమలీ. 18

ఉ. తేనె యనంటిపండ్లఁ గల తీయఁదనంబల దొండ్లపండ్లలోఁ
గానఁగ వచ్చునేని, యటుగాక యన దొండపండ్ల కెం
పైనను గల్గెనేని, సరియౌ ననవచ్చును మోవికిన్,
మానిని! నీ బెడంగు లసమానములై విలసిల్లు సృష్టిలో. 19

ఉ. తామరతూండ్లటంచును, లతాయుగమంచును, బువ్వుదండలఁ
చీ మొయి నీదు బాహువుల నెన్నుదు రన్నివిధాల నండయున్,
కాముఁడు పీకుండ నను గట్టిగఁ గట్టిన మోహపాశము
ల్గా మది నేఁ దనంచెదను గామిని, గంధగజేంద్రగామనీ. 20

చ. ఇలపయి నీదు కౌను గుఱియించి వివాదము లుద్భవిల్లఁగా,
కలదని, మింటికిం బయిని గ్రాలు నటంచును గొందఱాస్తికుల్
పలుకుదు రద్ధి కేవల మబద్ధ, మొకింతయుఁ గౌను పీకుఁ దో
య్యాలి, సఖీ, లేదు, లేదనుచు నాస్తికవాదము లిను సల్పెదన్. 21

చ. మదనునిదంతి వొటకు సమంబుగ నీవడ లేన్గు నెన్నడల్
గద, తొడ లేన్గుతుండములె, గండరుచుల్ కరిదంతతుల్యముల్
గద, మఱి యొక్క సామ్యమును గద్దది చెప్పితినేని, నీకు సి
గ్గౌవు నటంచు జంకుమొయి నూరకయుందుఁ జకోరలోచనా, 22

ఉ. లేతగులాబిఱేకుల వలెం జెలువాఱును నీ కపోలముల్,
వాతెఱ జాతికెంపననఁగ వచ్చును, సంపెంగ వాస, చంద్రులో
పాతిక నెన్నొసల్, కనులు పద్మదళంబులు. శ్రీలు కర్ణముల్
నాతి, భవన్ముఖంబు నలినంబుల వైరియె యెల్ల రీతులన్. 23

శా. పట్టాకత్తియె సుమ్ము నీదుజడ, యాపై కన్బొమల్ విండ్లె, య
ట్టిట్టుం బర్వెడి చూపులమ్ములె, యయారే! నీయొయ్యారంబులే
కొట్టన్ వచ్చిన యట్టిమాడ్కిఁగను నాకుం జూడఁ జూడంగఁ జా
పట్టెన్. నిన్ శరణంటి నన్ గరుణఁ జేపట్టంగదే యంగనా. 24

సీ. గిరగిర నీదు ముంగురుల సుళ్ళంబడి
మరలలే కుండె నా మానసంబు,
బిరబిర నీదు బిత్తరపుఁ జూపుఁదూపు
గుములు నాఁటెను నాదు గుండెయందు,
గరగర లాడు నీబిగువు పయ్యెదవల
లోఁ జిక్కుపడియె నా లోచనములు,
జరజర నీదు కేశంబులం దొరఁగు చీఁ
కటి నాకు కామాంధకార మయ్యె,
గీ. పరపరన్ గుత్తుకను గోయు కిరుసుకత్తి
ఝూచు నీదు కీల్జడ నాకు దోఁచుచుండె
ముఱుముఱన్ వెన్నెలట్లు నీ చిఱునగవును
సోఁకుచుండె నా మేఁకో సుందరాంగి. 25

చ. దిరిసెనపూవె చానె భవదీయశరీరము, నీదు నేత్రముల్
విరిసిన కల్వపువ్వు, లరవిందము నీవదనంబు, మల్లెపూ
వరుసను బోలుఁ బల్వరుస, వాతెఱ మంకెన, పువ్వుబోఁడి, నీ
దిరిసెన మబ్బు మున్ను సుమధ్యముని బువ్వులఁ బూజచేసినన్. 26

సీ. చక్రసామ్యంబు నీ జఘనప్రదేశ మొ
క్కటికే కా, దింక రెండిటికిఁ గలదు
దాడిమీబీజయము నీ దంతవితాన మొ
క్కటికే కా, దింక రెండింటికిఁ గలదు
కరులతో వాదు నీగమనవిలాస మొ
క్కటికే కా, దింక రెండింటికిఁ గలదు,
బింబరూపము నీ పెదవి చక్కఁదన మొ
క్కటికే కా, దింక రెండింటికిఁ గలదు
గీ॥ తరుణి, సంఖ్యచే రెండని ద్వైతముగను
చెప్పుటే గాని, సరిగ చర్చించి చూచు
వారి కెల్ల నభేదభావంబు తోఁచు
చుంట నద్వైతముగఁ జెప్పు టుచితమే మొ. 23

శా॥ నాగెంబా రత గాలదుద్దులును, సొన్నాటంకపుం బేసు వి
న్నాణంబా పుదుచేరిచేఁత జిగినీ నానుస్ సువర్ణంపు టొ
డ్డాణంబుగా, రకమైన నాగరము మేల్వంకీలునుస్.-కంకగాల్
రాణింపగా మహరాశివాస మన నా రాణీ, విరాజిల్లావే. 24

ఉ. కామిని, పచ్చపట్టురవికస్ బిగి గల్గ ధరించి, మేలి బా
లామణిచీరఁ దాలిచి, తళ తళ లాడెడి దుద్దు లాదిగా
హేమవిభీషణప్రతతు లెన్నియొ మేనున.బూని నట్టి నీ
గోము తలంచుచుస్ మఱపు గొందుఁగదే యితరప్రపంచమున్.

శా. జాకెట్టున్ జలతారుచీరయును భూషల్ దాల్చి, దోషాకరుగా
చేకొట్టం గలమోముతో వెలయు నీ చెల్వంబు వీక్షించినగా
వాకట్టఁ గద యెట్టివారికిని, చెల్వా విల్వకే యిత్తువో,
కాకట్టింతువొ? నీమనంబు వశ మొందం జేయుమా నాకికస్.

చ. విపులము గాఁగ కుచ్చెళులు వీమలమచ్చున శోభుచుండ పైఁ
టవరికిణిం కట్టుకొని, దగ్గఱపింజలు కల్గినట్టి స
న్నపు తెల్లరైకయుం దొడిగి, నాఁడపుగుమ్మటమట్లు నీవు నా
కెపుడును దోఁచుచుందువుగదే జగదేక విలాసినీమణీ. 27

ఉ. జాఱుగ కేశముల్ ముడిచి చక్కనిదొక్క గులాబిపువ్వు పై
జేర్చి, బాగుగా చలువచేసిన తెల్లనిచీరకట్టి, క
బ్బారవికన్ ధరించి, మెయి భారవుసొమ్ములులేని నీదు సిం
గారము కన్నవారలకు కన్నులపండుగ కన్నెమిన్నరో. 28

చ, వదులుగ నల్లినట్టిజడ, వంగి మొగంబున మూఁగుముంగురుల్
నుదుటి సిలాఖుచుక్కయు, కనుగవ కాటుకరేఖ, సన్నవై
పొదలెడి తెల్లపుట్టమును ఫుక్కిటపీడెము చేతనెఱనా
పెనవియు, నీకు పెట్టియును బెట్టనిసొమ్ములు కావెకొమ్మరో. 29

క. బాపురె! నీమొగంబునకు పౌడరు చల్లుటయేల? సబ్బుతో
రాపిడియేలమోవి? కధరంబునకుం దనులంపుఁ గెంజగిం
దోఁపగ జేయనేల? కనుదోయికి కాటుకయేటి? కో వదం
తీ! పునరుక్తిదోషమున కివ్వి యుదాహరణంబులౌఁ జుమీ.

చ. దిటముగనల్లి గుండ్రముగ దీర్చినకీల్జడ యొక్కమారు, వ్రేల్
జడ యొకమాఱు, గుత్తమగు జార్ముడి యింకొకమాఱు, మేలిము
చ్చటముడి యొక్కమారు, కడుచక్కనికొప్పుగ యొక్కమారుగా
కుటిలకచా, భవత్కచము కూర్తువు నామది చిక్కుపొందగన్. 31

చ. విరియని మల్లెమొగ్గ లొకవేళను, వీడిన యుట్టిసంపెఁగల్
మఱియొకవేళ, చక్కలి గులాబులు వేరొకవేళ, గేదగుల్
మఱియొకవేళ గాఁగ కుసుమంబులు వేణినిదాల్చి పువ్వుబోఁ
డిరో, పువ్వువిల్తునారసము కేవను నాఁటెదు నామనంబునన్. 32

చ, సగము సరీరమున్ తలఁపుచాటున దాఁచి, సగంబు వీథిలోఁ
కగపడు నట్లుగా నహరహంబును నిల్చినయట్టి నిన్ను ర
క్తిగఁ గనుచుండుటన్ భ్రమరకీటక నీతిని నాశరీరమున్
ముగుద సగంబె యయ్యెఁ బరిపూర్ణకృపం గనిపింపుమా యిఁకన్ 33

ఉ. పేశలవార్ధి, స్నానమయి పెన్నెరులం దడియార్చి మేడపై
కేశచయంబు చిక్కుతొలఁగించుచు నీవు పచారుచేయుచో,
రాశిగనున్న మబ్బులఁ దొరంగు శశాంకునిబోలు నీ మొగం
బాశ మదీయదృక్కువలయంబులకుం గలిగించు ట్రభమే, 34

శా. డాబామీఁదను సందెచీకటితతిన్ డాబొప్పఁగా నీవు ము
స్తాబై చల్లనిగాలికై దిరుగఁగా, స్వర్లోకమందుండి రం
భాబింబోష్ఠియె యేగుదెంచెనని విభ్రాంతిన్ దలంతుంగదే!
యో బాలా! నినుఁ గోరకుండెడి శుకుం డుర్వీస్థలిం గల్గునే. 35

ఉ. అద్దము ముందుపెట్టుకొని యందముగాఁ గనునీవు పాపటన్
దిద్దుచు నుండగా, తెరువదేయసి చొచ్చిన నాదుచూపులో
ముద్దియ, రెండుచెంపలక మూఁగి నొసంటకిసాఁగి చెక్కులన్
కొద్దిగ, నాఁగి, మోముపంబు గ్రుమ్మరసాగెను జావలంబునన్. 36
ఉ. గానకళావిశారదవు గావున చల్లనివేళ, ముందు హా
ర్మోనియమీవు పెట్టుకొని మోహనగాత్రిరో, జంత్రిగాత్రముల్
వీనులకొకరీతి వినిపింపఁగఁ బాడిన పాటచేత నా
మానసమందు కోర్కె పలుమారుచిగిర్చె, ఫలించుటెన్నడో. 37
ఉ. బాలిక స్నానమున్ సలిపి, పట్టుదుకూలము కట్టి నీవు దే
వాలయ సీమచేర నువవాసముచే పసివాడి ముచ్చటం
జాలఁగ గొల్పు నీ మొగము చందము కన్గొని మోహమొందగ, యా
వేళను నీదుపొందు నొదవింపుమటంచును దేవుఁగొల్చితిన్. 38

ఉ. చేతను బుస్తకంబులను జేకొని మెల్లగఁ బాఠశాలకై
యో తరళాక్షి, నీ వరుగుచున్నడ, మన్మథబాధచేత నా
చేతము వ్రీలుచుండ, నినుఁ జేసియుఁ గుట్టినయట్లు కాదయో
భూతదయాగుణం బెవను బుట్టని నీచదు వేలఁ జెప్పుమా! 39

చ. నెలఁత, కొళాయి కీవరిగి నీళ్ళను బట్టుచు నిల్చియుండఁగా,
బొళబొళ మంచు గొట్టమున బుట్టిననీళులు నీదుబిందెలో
పలఁ బడినట్టిరీతి నుతిపాత్రమవౌ నిను జూచి నామన
స్థలిని ద్రవించుకోరికలు ధారనుగట్టి స్రవించెనీపయిన్. 40

ఉ. బోటిరో, మొన్న నాటకము చూచుటకై చనుదెంచి, యచ్చటన్
బోటులలోల నిన్నుఁగని బుద్ధిమరల్పఁగ లేనివాఁడనై,
నాటక మేమియో యెఱుఁగ, నాయకివీవగు చిత్రనాటకం
బాటగ మన్మథుండు ననువాఁడగ జేసెను సూత్రధారుఁడై. 41

ఉ. సంబరమీవు చూచుటకు చక్కనివేషముతోడ బండిలో
నం బయి కాస్యమించుగ కనంబడునట్లుగ వంగియున్నచోఁ
శంబరనేత్ర. నేత్రములు నావుగవిప్పుచు నిన్నుఁజూచుటే
సంబరమయ్యె నాకు, పయిసంబర మతయు వ్యర్థమీసుమీ. 42

శా. బొట్లంజెప్పఁగ భూమిఁ దాంగి నగుచుం బుర్రెల్తు పట్టపుటే
న్గట్టి వేగుచునుండ. దీపపువెలుగందున్ నినున్ గాంచి, చీఁ
కట్లన్ నీమెఱుఁగారునవ్వులె తొలంగంజేసెనో. లేక గా
స్లైట్లేమూలకుఁ ద్రోసెనో, యెఱుఁగ కాశ్చర్యంబు కంటింజెలీ. 43

ఉ బందుగులింటి పెండ్లికయి బాలరొ నీవును నేనుఁబోయి యం
దరుఁ బెండ్లిసందడుల యందుమునింగి మెలంగఁగా, నదే
సందడియంచు నంటి మదిజ్ఞాపక మున్నదొ లేదొ! నాఁటి యా
నందము నిన్ను నేఁ గలిసినంగద భ్రమ్మరఁ గల్గఁగావలెన్. 44

చ. చిలుకలు పిల్లుగాఁగ రోదసేయుఁ, బికంబులు కూయ, షట్పదం
బులు కడు మ్రోయఁ దీవగమిపూయఁగఁ బూవులు తావులీయఁగన్
గలిసి విహారమున్ సుమవనంబుల సల్పఁగ నేర నేని తో
య్యాలి, మఱి యీవసంతము నిరర్థకమే ఋతురాజమయ్యునున్.

ఉ. ఆతపతాప మొక్కదెస, నంగజతాప మింకొకదిక్కునన్
నా తను వేర్చు చున్నయవి నాతిరో, గంధపులేపపూతలన్
శీతలమైన నీ యెదను జేరిచి తాపము బాపకున్న, నే
రీతిగ నాతెరం బగును గ్రీష్మదినంబుల నెల్ల దాటగన్. 46

చ, జలదము మూసిపెట్టి దివసంబుల రాత్రులఁ జేయుచుండ, లో
పలియదు గించుకేనియును పైకిడ నీయని వాన జోరుగా
ఇలఁబడుచుండ, వెచ్చఁదన మిచ్చెడి యింటను రేపవళ్ళు నిన్
గలిసి సుఖింపగా మదిని గాంక్ష జనించెను గామినీమణీ. 47

ఉ. నీరదపంక్తిలేమిని వినిర్మలమౌ గగనస్థలంబునన్
శారదపూర్ణచంద్రముఁడు చల్లెడి చల్లని చంద్రికల్ భవత్
స్మేరముచే నిరర్థకత చెందుచునుండఁగ, నిన్నుగూఁడి యిం
పాగసుభాంగి, వెన్నెలబయిళ్ళ సుఖించుట యింద్రభోగమే. 48

ఉ. ఇంతయు సందు లేక బిగియించిన గాఢపు కౌగలింతలన్
సంతస మీవు నా కొసఁగ సమ్మతిలన్ వలె నల్లు కానిచో.
కాంతరో. నుంచుచే వడఁకుగల్గగచేసెడి దీర్ఘమైన హే
మంతపురాత్రులం గడప మార్గము లేదు మఱేది యేనియున్. 49

చ. కుటిలశిరోజ, దట్టమగు కుంకుమచర్చలచేత రక్తిమన్
దిటముగఁ బూనినట్టి భవదీయకుచద్వితయంబు తొమ్మురుం
పటులవిధాన కట్టుకొని, మానునో యీశిశిరంబునందు ప్రా
త్పుటముననుండిపుట్టు చలి పోవున యింతుకేపాటుపడ్డటుల్ 50

ఉ. వీధినిబోవ తెప్పలను వేయకవన్ కనుగొంటిగాని, నా
బాధయెఱింగి నీదు మది భావము తెల్ప తెల్పఁ దలంపవేమి? శ్రీ
నాథుని ద్రావిడాంగనల నైజముచూపక, యేసియేసియున్
సాధనముల్ వచింపగదే సారసలోచన, గూడి కేళికిన్. 51

ఉ. ఇష్టము నీకుగల్గినటు లించుకయేసియు నీవుపల్కు ని
స్పష్టము చేయకున్నయెడ, బాకులు కత్తులునై సుమంబులే
కష్టముపెట్టు నామదిని కామిని, నీదుకటాక్షమున్నచో,
ముష్టిశరంబులన్ మరుఁడు మూలకు పాఱఁగవైవఁగావలెన్, 52

ఉ. ఏర్పకజేయకుంటివిక డే భవదీయమనంబు నీదు ని
ట్టూర్పులు, పైఁటజార్పులు నొకొక్కపుడాకనుగొల్పు, నంతటను
మార్పులు నీప్రవర్తనమునం గనుపట్టి నిరాశపుట్టు నే
నోర్పువహింప, దర్పకుఁడిఁకోర్పు వహించునె దర్పహీనుడై?

చ, అడిగినయంత నొప్పుకొనునట్టులె కన్పడి, వేడి నంత ని
య్యెడఁ గడుబెట్టొనర్తు వహా! యియ్యదితొయ్యలి నీకెకాదు, మీ
వడఁతుకజాతికంతకు స్వభావము, భావమెఱింగి నిన్ను నే
విడువకయుంటి, నేలుకొనవే, యిటు బెట్టొనరింప నేటికే, 54

చ. అభిమత మున్న యట్టు లొకయప్పుడు, లేనటులొక్క యప్పుడో
యిభగమనా, కనంబడెద వేటికె? కాంతలచిత్తముల్ జగత్
ప్రభుఁడె యెఱుంగఁగా నలయు తాసకచిత్తము తెల్పకుంట, బె
ట్టో, భయమో? యిట్లుచంపఁగనెటుల్ మనుదున్ మనసిచ్చియేలవే

ఉ. నోటను నాకు తావకమనోవిధముం దెలుపంగ నీకు మో
మోటము కల్గె నేని, మునుమున్ కనుసైఁగలు లేవె? లేనె వ్రేల్
మీటులు? మందహాసములు లేవె! యు వేవియు చేతగానిచో,
చీటులు వేవె? పంపుటకు చేటులు లేరె? యుపేక్ష యేటికే. 56

ఉ. సిగ్గును గొంకునుంగలుగు చేడియ లుండరు? వారు నీవలెన్
దగ్గఱ చెంత చేరఁగనె దాఁగఁగ తుఱ్ఱునఁ పాఱిపోదురే?

ఇగ్గతి యిప్పుడైన, మఱియెట్లుగ కౌఁగిట నుండనేర్తువో?
దగ్గిన నూఁకుముక్క వనితా, యెటుతుమ్మిన నిల్వనేరుచున్ 57

ఉ. సిగ్గునఁ గొంకు చుంటివొకొ చిన్నవయస్సును జేసి వెన్కకున్
తగ్గుచు నుంటివో? చతురతన్, మఱియున్ మురిపించు చుంటివో
బొగ్గును జూపుచుంటివొకొ! ముద్దియ, మత్కృతమైన దెద్దియో
యొగ్గు ఘటిల్లెనో? దయవహింపుము, దోసిలియొగ్గి వేడితిన్ 58

ఉ. గుట్టును నేనుదాచనని కొంకుచునుంటివో? యట్టులైన, నే
నొట్టును బెట్టుకొందు వినుమో చెలి, నామది కాముఁడమ్ములన్
గట్టిగ గ్రుచ్చిచూచినను గన్పడకుండెడి లోతునందు నేఁ
బెట్టి, భవత్స్వభావమును బ్రీతిని గాంచెద దైవసాక్షిగన్, 69

మ. నెలఁతా, కాళ్ళకుగఁగ నేఁ దిరిగితిన్, నిల్వంబడంగా, నదే
నిలజొంటింజుమి నిల్వబత్తెముగ, నే నిద్రింపనే, లేదు రా
త్రులయందిట్లుగ నాశ్రయించినను, నాతోఁ బల్కనుం బల్క, విం
దలిబాధన్ సగమేని వడ్డయెలన్, స్వర్గంబె సాధింపనా. 60

ఉ. రోజనకొక్కరీతిని సరోజముఖీ, చరియించుచుందు, న
వ్యాజకృపావిశేషము నొకప్పుడుచూపెద, నొక్కయప్పుడే
దే జగడంబు పెట్టుకొని యొద్దకునైనను జేరనీయ, వ
న్నా! జవరాండ్రచిత్తగతులన్న, క్షణక్షణముల్ నిజంబుగన్ 61

ఉ, సమ్మతి నీకు లేదని విటమ్ముగఁ దోఁచిన. లేదటంచు స్ప
ష్టమ్ముగఁ జెప్పకుండ ననుఁ జంపగ నేటికి. చెప్పినంత, ప్రే
మ మ్మొదవింపఁగాఁగలుగు మందులు మ్రాకులు నెల్లఁదెచ్చి న
శ్య మ్మొనరించుకొందు వనజాస్య, యవశ్యముగాఁగ నిష్ణితన్. 62

శా. అంగీకారములేనిచోఁ దెలుపరాదా? పామునున్ చావకుం
డగాఁ, గఱ్ఱయు సైతమున్ విరుగకుండగా నిటేలా? ప్రసూ
నాంగీ, నీవిరపేక్ష తెల్పఁగనే, నిన్నర్థించు కష్టంబు నా
కుం గోపంబునుఁ జూపుకష్టమిఁక నీకు, గల్గకుండుంగదా. 63

ఉ. దూతికతోడ నీకడకు తోయ్యలి, నేఁగబురంప. దానిసన్
బూతులుతిట్టి గోలితఁట! బుద్ధిహీనతయే, మఱోకృతో
ఈ తెఱఁగౌ రహస్యమును నేనువచించుట; తప్పువచ్చె నేఁ
జేతులుమోడ్చి మ్రొక్కితిని, జేసినదోసము సైఁచితొలుమా. 64

శా. సంకేతస్థలి కేనుముందుచని, యో ప్రాణా, ఇంకెన్నత్తువో,
ఇంకేవత్తువో?" యందు కాచుకొని, నీవెన్నింటికిన్ రామి "ఆ
టంకంబేదియొకల్గి మానితివో, యిష్టంబుడమిన్ రావో?" యన్
శంకంబొందితి, మాకుకాగకలుని రాశల్ చేయ న్యాయంబకే? 64

ఉ. రాతిరిరాఁగ ప్రొద్దుటను రమ్మని ప్రొద్దుటరాఁగ నింక నే
నీదోతతి రమ్మటంచు, నిటులోతరుణీమణి, నన్నుఁద్రిప్పుటే
తియ్యఁకే! యేదోయొక నిర్ణయమహా సమయంబుతెల్పినన్
చేతులు నేను గట్టుకొని చేరనె, యెట్టియకాలమై న్. 66

ఉ. కోకలుకోరెవో, నగలుకోరెదో, కానుకలేవికోరెదో.
మూకలుఁకోరెదో, చెలియరో, తెలయంగను జేయకీవు న
న్నికరింతిన్ శ్రమంపఁజెచ దేమిటికే? పలిజున్ను నేఁయయున్
శోకములెల్లఁజూచి తృటిలోఁ గొఁవచ్చెద నీవుకోరిఁన్. 67

మ. ఉవిదా, యక్కర తీరునంతవఱ కేవో యచ్చికల్ బుచ్చికల్
చెవికిష్టంబునఁబల్కి, యావెనుక నిఁ చేరంగ నేరానో య
న్న విచారంబును బెట్టుకోవలదు, మేనం బ్రాణముల్నిన్నినా
ళ్ళు విధేయుండనునీకు, నావలపు నేండ్లుంబూండ్లు తగ్గించునే. 68

ఉ. మక్కువనీకు కద్గసన మాత్రముచేత లాభమేసు? నా
యక్కర దానఁదీతెనఁకొ? యక్కట, నీవిదు ముద్దులబ్బెనో?
అక్కవనిన్నుఁ జేర్చుకొనుటబ్బెనో? నీమధురాధరోష్టమున్
నొక్కుట యబ్బెనో! మఱి మనోహారి, పట్టిప్రియం బిదేటికే. 69

ఉ. వారికి వీరికిం దెలియ వచ్చునటంచును జంకుచున్న, నో
నీరజనేత్ర, యెన్నఁటికి నేనియుఁ గార్యము సానుకూలమా

నే? రమణీజనంబులకు నిండుగ సాహసముంచు సందు; తే
దారియొచూపి, నాదుసరదా కొఱ దావడకుండఁ దీర్పుమా. 70

శా. పాతివ్రత్యము కల్గుదానివలెనే భావించుచున్ నిష్ఠలున్
నీతుల్ పల్కిన, ముద్దరాల వనుచున్ నిన్నెంచురే? యెన్నియో
చేతుల్ చూచిన జాణవంచెరుఁగనా? చెల్వా, యిదేరీతిగా
చాతుర్యంబులు చూప కేలుకొనవే సంప్రీతిచేతస్కవై. 71

చ. మగఁడు మనంబునందు ననుమానము పొందెను గాన నన్నురాఁ
దగదని వార్తపంపితివి, తప్పుకొనన్ మిషగాని, నిశ్చయం
బుగ మదిలోననీవు వలపుం గలదానవయేని, భర్తక
న్నుఁగవనుకప్ప నేరవె మనోహరి, యింతటిజాణ వయ్యునున్, 72

శా. గోడల్ గొందులుదాటి, జంకుమటి న్ంకుగొ లేక, కన్దోయికె
వ్వాఁడింపై కనిపించినన్ సరియె యవ్వానిను యథేచ్ఛను రతి
క్రీడం దేల్చిన ప్రౌఢవీవని ధరిత్రిన్ నీదువిఖ్యాతి వి
న్నాఁడను; నేఁడు ననున్ వరింతువని యున్నాఁడను పుపుబోఁడిరో 73

ఉ. చెప్పెద నింటివారి కనిచీకటినన్ బెదరించ దేల? యే
తప్పును మోపి చెప్పెదవు? తావకహాసము చూడఁగూడదో
యొప్పమటంచు వేఁడవగదో? యటు చెప్పెదుగాని, ముందుగా
తిప్పలుపెట్ట కేలుముగదే జగదేక విలాసినీ ననున్. 74

చ. అతివరో. యింటఁదెల్పెదనటంచును నన్ బెదరింపఁబోక, నీ
వు తెలుప, నేనుమాన, తగవున్ వినువారలె తీర్తురుగాక, యె
ట్లు తొలుత నాశపెట్టితివొ, లోఁకువమైతి నటంచు నెట్లునా
హితము దీర్ప మానితివొ, యాసకలంబును బైకి చాటెదన్. 75

శా. పాపంబీవనియంచు నన్నిపుడు చేపట్టంగ రావేమి? నీ
కే పాపంబయి, నాకుకాదె, నరలోకంబీవొంద, నేనొందుదుం
దాపం బచ్చటఁబొందఁగా వలయు నన్నుం దాపమిచ్చోట లే
నే? పూఁబోఁడి భయంబు పోవిడిచి, నన్నేలంగదే సత్కృపన్. 76

ఉ. పాపమటంచు నన్నుఁబరిపాలనచేయు కొప్పవేల! తా
రాపతి నేలినట్టి గురురామకుఁగలగని పుట్టిపాపమున్
గోపకుమారు గోపికలు కూడఁగ కల్గనియట్టిపాప మో
నీ పువుఁబోఁడి నీకొక తెకే యువుకబ్బు నె యబ్బురంబుగన్. 77

మ. అతివా, అంగననమ్మరా, దనెడి పద్యంబెన్నడో మున్ను చి
న్నతనంబందు పఠించినాఁడను, నను నమ్మించి నమ్మించి, యి
ట్లుతుదన్ నీవొనరించు మోసమిప్పుడు డాలోకించుచును, దానికిన్
స్తుతికా, దక్షరలక్షలీయుఁదగునంచున్ నేడునే నెంచితిన్. 78

చ. నెలఁతరో, క న్నెప్రాయమున నీవు మదంకము నెక్కి, నీమచం
కల గిలిగింతగొల్పుచును, కాయము నెల్లస్పృశించి బుగ్గ ము
ద్దులుగొనుచున్, ననున్వలచితివో వగలాడి! యటన్నవ్వి "నా
వలపుల కాంత"నంటి; వల వాక్యమునిక్క-ము సేయుమియ్యెడన్. 79

ఉ. ఈడుకునీవువత్తువన, నింటనుగల్గిన వారు నిన్నుఁగా
పాడుమ చేడియాఁ బయట పాదమువెట్టఁగ నీనివేళ, ఇన్
చూడఁగ నేనుబడ్డశ్రమచూచితివేనియు, నివ్విధైన నా
వేడుకదీర్పకుండుదువె వేవురుకాఁపుగ కూరుచుండినన్. 80

ఉ. ఎన్నటికింక నీవెదిగి యీడుకువత్తువొయన్న వాంఛతో
కన్నులనీదు సొట్టవ మొగాదిగిఁజూచుచు వత్సరంబులే
నెన్నుచునుండ, నిప్పటికినీవు రజస్వలవైతి, వింక నో
కన్నె యుపేక్షమాని వడిగా మదపేక్షను దీర్చిపోవుమా. 81

ఉ. సుందరి, పెద్దదానవయి శోభిలుకాలమునందు నొంటిగా
నందు లభించినంత, కనుసైగలు, నవ్వులు, మేనిరాపులున్
తొందరపాటుముద్దులును దొంగతనంబుగ మాచ్చుకొన్న యా
చందము నీకొకించుకయు జ్ఞప్తియులేనటులుంటి వియ్యెడన్. 82

చ. తెలియఁగలట్టిదారి మనమిద్దఱమొంటిగ తొరసిల్లఁగా,
చిటునగవొప్ప నీభుజముచేననుఁ జెచ్చెరఁ ద్రోసికొంచునీ

వరిగిప నాటిచందమును నందము డెందమునందు నాటుటన్
మఱవకయున్నవాడను సుమా కుసుమాంగి సుమాస్త్రినాగరా

ఉ. అంటెనొ నీకు నూత్నముగ నచ్చట నేదియొ? భాగ్యవత్తవా
రింటికిఁ బోయి వచ్చిన యిటీవల బాల్యపు నేస్తకానిఁన్
కంటను జూడనైతివి, ముఖాముఖమైన, మొగంబు వాల్చుకొం
చుంటివి, బాల్యకాలపుప్రియుల్ కనిపింతురె భర్తవచ్చినన్. 84

చ. పొరుగున కీవువచ్చుటను బుణ్యమువండెను నాకటంచు సం
బరపడుచుండ నన్నుఁగన వైకినిరా, నొకవేళ వచ్చినన్
శిరమును వొత్త, వత్తినను, జేసినసైగకు మారుచేయ, వీ
విరుగునఁ జేరినట్టిఫలమే కనిపింపక యున్నదో చెలీ. 85

సీ. బొట్టు పెట్టమి మచ్చకట్టకుండఁగఁ దేట
వై ముచ్చటం గొల్పు మోముతోడ
నగలు క్రిందను మీఁద దిగవేతుకొనమి వ
ల్పొందక జిగి గల్గు నొడలితోడ
నూని వాడుకను మానుటఁజేసి జిడ్డును
బొరయుకయున్న పెన్నెఱులతోడ
రవికలేమిఁ దెలిచీరను స్పష్టమగా నటు
కనిపించు మేని పొంకంబుతోడ

గీ. తరుణీ, యిప్పటి బాలవితంతురూప
మే! వెనుకకంటె నెక్కువ హితముగొల్పె
భర్తకంటెను నీకువభర్తనాచు
నెక్కువహితంబు కూర్చు నే నింకమీఁద, 86

మ. విధవాత్వంబున కీవు చింతిలకుమీ వీకేళలింగంబుగా
రు ధరన్మీఁకొరకేజనించి రలవారున్ దారిచూపింపకు
న్న,ధృతిన్ మానఁగబోకు, నీకుదయ యున్నంజాలునో బాలికా
వృధగా నీమొల్లప్రాయమును గడవకానీయంజుమీ యెన్నఁడున్. 87

ఉ. బొట్టును బెట్టుకోఁ దగిన పుణ్యము పోయెనటంచుఁ గుందకే,
ఇట్టులు లేఁతప్రాయమున స్వేచ్ఛలభించుట భాగ్యమే గదా!
ఎట్టివిధంపులోప ముదయింపని యట్లుగ, నీకు బొట్టునుం
బెట్టి ప్రియంబునం బిలుఁతు ప్రేయసి, రాఁగదె నాదువ్రక్కకున్.

సీ. ముంగురుల్ నొసటిపై ముసరితుం పెసలారఁ
గను నీవు నాట్య మాడిన తెఱంగు
వీనులఁ దేనెల సోనలఁ గురిపించు
చను నీవు పాట పాడిన తెఱంగు
కరకంకణముల నిక్వాణ మనుక్షణము గ
ల్లనఁగ నీవభినయించిన హొరంగు
తూపుల రూపున చూపఱ హృదయముల్
కలగించు నీదు చూపుల మెఱుంగు

గీ. మేళముల తోడి వారకామినులతోడఁ
గూడి నీవున్న యట్టి యందును గనుంగొ
నంగనె యనంగుఁ డేచఁ గడంగె; నంగ
నామణీ నీమఱుంగు నొందంగ నిమ్ము

శా. కొక్కోకంబును నేర్చి, వాక్కులను టక్కుల్ పెక్కుగా నేర్చి వే
శ్యోత్కర్త్రివ్వతె నీకు సాటియగు నోహో! వేశ్యలందేనియున్
రొక్కం బెంతయునర్ఘ సరే యొసగెదన్ రో చేడగో, నన్నికన్
చొక్కింపంగదె, నేర్పులెన్నికలవో చూపించుచున్ నుక్కువన్. 9

ఉ. కాంతలె మాయకత్తె లనఁగా వెలకాంతయు మాయకత్తె లం 10
చింతరో, వేఱె చెప్పనలెనే? యిది స్పష్టముగా నెఱింగియున్,
స్వాంతము నందు నిన్ వలచి వచ్చితి, తక్కిన వేశ్యలట్లె కా
వింతువొ, నమ్మకంబు నొదవింతువొ యీపయిఁ జూడగా వలెన్.

మ. మగవారల్ వశమౌట కెల్ల గుటికల్ మందుల్ ప్రయోగింతురం
ట! గుణంబిచ్చునటంచు నాకెవియొ పెట్టంబోదు వేమోనుబీ;

వగలాఁడీయటు పెట్టుకున్నపుడె యోర్వఁగ రాని యీ బాళిసిం
డెఁగదా? పెట్టిన, మన్మథుండసువులేనిన్ నిల్వంగానిచ్చునే? 92

సీ. చవిచూపితివెకాని చాన, నీయధరసు
ధల్ పల్మాఱులుఁగ్రుచ్చి త్రావనైతి,
ఆనించితివెకాని యతివ, చెక్కుటమోవి
ననుకొన్నరీతి ముద్దాడనైతి.
స్పృశియించితివెకాని చెలి, నీయురోజముల్
గట్టిగా పలుమారు పట్టనైతి,
తగిలించితివెకాని తరుణి, మేఁ మేను న
ల్లికగొనఁగాఁ గౌఁగలింపనైతి,
గీ. మచ్చుచూచితివెకాని మగువ, ప్రథమ
నిధువనంబౌటఁ దృప్తిజనింపఁగా ర
మింపనైతిని, గాననేయింపుమై పు
నస్సమాగమనంబునకు నింతగఁ దపింతు. 93

ఉ. కౌఁగిట నిన్నుఁజేర్చుకొనఁ గల్గెడిభోగము నింద్రభోగముం
గా గణుతింతు, నెంతనినుఁ గౌఁగిటఁజేర్చినఁ దృప్తికల్గదే.
దో గజరాజయానా? యిఁకనొక్కవరిన్, మఱియొక్కమాఱు, త
ద్భోగము నేనుబొందఁదలఁతున్ వినువుంగవ కట్లొసంగుమా 94

ఉ. కాముకవృత్తిపై రకరకంబుల భామలతోడ నేస్తమో
కామినీ మున్నుసల్పితివిగాని. యొకర్తుకయోని నేర్పునన్,
గోముల, నిన్నుబోలఁగలకోమలి కన్పడలేదు, నేనిఁక
కామునిసాక్షిగాఁగ నినుఁగాక మఱొక్కతె నొల్లనెన్నఁడున్. 95

ఉ, ఓ ఫణిరాజవేణి, మనమొండొరుమోములు చూచుకొన్న వే
ళాఫలమో, మఱేమిరొయొ, బళా! నినుఁ గన్నులఁగన్నదాదిగా
సాపుగ నన్యకామినుల సంగతికిన్ మనసొగ్గదాయె, ద్వై
రేఫము వేఱుపువ్వులఁజరించునె, నీరజమే లభించినన్. 96

చ. జలజదళాయతాక్షి సరసంబునకుం బొలయల్కయుండఁగా
వలయునటంచు నల్గితివొ? వ్యర్థపుఁగోపము తెచ్చుకొంచు, నీ
పులుకకపల్క కీరశరణి యూరకయుండుటనీతికాదు, నన్
సిలిచి. యథాప్రకారముగఁ బ్రేమనుగౌఁగిటఁ జేర్చుకోఁగదే. 97

ఉ. ఇంకొకకామినిన్ మరగి యిప్పుడుపోవుచునుంటివటంచు నో
పంకజనేత్రి! యట్టియపవాదమునాపయి మోఁపెదేల? యి
ట్లింకులుగొన్న మోహమునవిప్పుడెకా, దిఁక నెప్పుడున్ భవత్
కింకరుఁడన్, మఱింకఁ దొలఁగించుకొనంగదె నీదుశంకలన్. 98

శా. ఏమాటంకములెన్నికల్గినను నిన్నే నేను, వన్నీవు కాం
తా! యిన్నాళ్ళును నాశ్రయించుకొని యున్నా, మింతో యంతో సుఖం
బే యెల్లప్పుడుఁ బొందినారముగదా! యిట్లున్న యన్నాళ్ళనున్
హాయింగూర్పఁగ నిన్నవేఁడుకొనెదన్. దైవంబు, ప్రార్థించెదన్, 99

సీ. మంగళం బగుఁగాక మానినీ తారకా
సఖములౌ తావకనఖములకును!
మంగళంబగుఁగాక మగువ, చక్రవతి
బింబమౌ నీదునితంబునకు!
మంగళంబగుఁగాక మహిళామణీ, కోక
రాజములౌ నీయురోజములకు
మంగళంబగుఁగాక మదిరాక్షి. శశికళా
సదనమౌ భవదీయ వదనమునకు!
గీ. మధువుగ్రోలియౌ మోవికి మంగళంబు
మల్లెపువులగు నవులకు మంగళంబు!
మరులు గనులగు కనులకు మంగళంబు!
మధుకరులగు ముంగురులకు మంగళంబు!

ప్రథమ భాగము సంపూర్ణము.

—0—

 # జాబులు 

## రెండవ భాగము



నందన సమసుందరుఁ
డైన మనోహరునకుఁ బ్రియురా లనురాగం
బూని కవుంగిట గాఢము
గా నణఁచుచు మ్రొక్కి, చేయఁగల విన్నపముల్.

ఉ. కంటికి నింపుగాఁగ నినుఁ గన్నది యాదిగ కామబాధచేఁ
గంటసమయ్యె నా బ్రతుకు, కంటికి నిద్దుర రాకయుండె, ఆ
కంటికి నన్నమైనఁ దినఁగా వెగటయ్యెను, నిన్నుఁ గానమిన్
గంట యుగంబు కైవడిని గప్పుచున్నది ప్రాణనాయకా. 2

చ. అల దినమందు నా సమయమం, దల, చోటున, నీటుగోటు, లిం
పులు పలు సొంపు, లందమును బొల్పగు చందము, షోకుఠీకు. లే
పులుబలుకోపులుంగల యపూర్వపు నీ చెలువంబుచూచి, నా
తలఁలు నీవయిన్ నిలిచె, తపవరో! యెటు త్రిప్పుకొన్ననున్.

సీ. లేఁత వెన్నెలవలె బోలిన ఛిఱునవ్వుతో
మెఱియుచునున్న నీ ముద్దుమొగము
కర్ణరంధ్రములద్దుగా రాఁగ నిల్చిన
గతిఁ బొల్చుచున్న నీకన్నుదోయి,

వలరాజు పూర్తిగా వంచిన విండ్లనై
ఖరిఁ జెలువారు నీ కమ్మబొమలు
మోవి తేనియ మీఁద ముసరు తుమ్మెదలల్లు
మిసమిసలాడు నీ మీసములను
గీ. నీవెడఁదఱొమ్ము మఱియు నీనిడుఁదభుజయు
గమ్మ నీవడల్ నీరొయిడల్ గాంచి మది
రించి, తపియించుచుంటి నో ప్రియుఁడ యెట్టి
గతిగఁ బ్రోతువో? యిఁక నాదుగతివి నీవె. 4

ఉ. చక్కదనంబునన్ సరిగ సంపెఁగ మొగ్గయు, తమ్మిపువ్వు, నీ
ముక్కు, మొగంబు వానిఁగని మోహముపొందితి, నాదుప్రాణముల్
దక్కకయుండ, సంపెగఁలుఁ దామరలున్ మదనుండు నాపయిం
గ్రక్కన వేయసాగె, ననుఁ గాపుము నీమనుగిచ్చి నాయకా.

ఉ. సంపెగమొగ్గతో తగవుసల్పెడిముక్కును, మల్లెమొగ్గలన్
చెంపలగొట్టు పల్వరుస, సింగములన్ బెదరించు మధ్యమున్
కెంపును నీరసంబనుచు గేలియొనర్చెడి మోవిదగ్గ, నీ
వింపుఘటింతువోయి హృదయేశ్వర, నాకనుదోయి కెప్పుడున్. 6

ఉ. తుమ్మెదతెక్కుతోడ తులఁతూఁగఁగజాలెడు నీదుమీసమున్,
తమ్మిల నేను నీకనులు, తల్పునుబోలె వెడందమైన నీ
ఱొమ్మునుగాంచి, మోహము నెఱుంగని నామది యిప్పుడక్కటా
కమ్మరిసారెలోపల తగుల్కొనునట్లుగ నాయె నాయకా. 7

ఉ. నాపెనుమోహమంతయుఁ గనంబడునట్లుగ మాటిమాటికిం
జూపులఁ దెల్పుచుంటి, ననుఁజూచుచు నవ్వుచునుంటి వీవునున్
నాపయికూర్మిపుట్టి యటునవ్వితివో, యటుగాక నాదు సం
తాపముగాంచి హేలవని నవ్వితివో, యెఱుఁగన్ మనోహరా. 8

చ. సరిగను, మోడిగాఁగ, సరసంబుగ, తేలికగాఁగ, నోరగా
చుఱుకుగ, నన్నుఁజూతు నల చూపులభావము నే నెఱుంగ; నల్
లెఱవక, యించుకే తెఱచి లేఁతగ పూర్ణముగాఁగ విప్పి సుం
దరముగ నవ్వుచుందు, వలనవ్వులభావము నాకు నేర్పరా. 9

శా. నీవెవ్వఁడవు, నేనెవర్తె? నహహా! నీమీఁదనీమాడ్కి నా
భావంబేటికి నిల్వ, కల్వవిరికిన్ పద్మారిపైరీతి! యా
పూవుంబోఁడిక దూరపుంజెలిమి దాఁ బొందక నాకబ్బునో?
నీవున్ నేనును బూవుఁదావియుబలెన్ నెయ్యంబుమైనుందుమో. 10

చ. ఒకరికిమెచ్చుగొల్పుసొగ, సొక్కరికంటికి నచ్చదోయి నా
యక భవదీయరూపము మదక్షులకుంబ్రియమైనయట్టి పో
లికగనె, నాదురూపమున లేని విలాసము లేని నీదుకం
టికిఁగనిపించుత, న్మరుఁడు నేర్పుమెయిన్ ఘటియించుమాయచే! 11

ఉ. ఒక్కొకకాంత కొక్కొకప్రియుంగనునంతకు లోకమంతయున్
నిక్కముగా నెడారివలెనే కనుపట్టును, కన్నదాదియున్
చక్కని నందనోపవని చందమునంగనుపట్టు, నీవునా
దృక్కులపడ్డయంతటనె, దిక్కులు పుష్పమయంబు లయ్యెరా 12

ఉ. ఓరమణుండ, స్త్రీపురుషులొండొరులన్ సమవాంఛ నేలఁగాఁ
బో "రదిజన్మవాసనయొహో" యని పెద్దలుపల్కలేదె! తా
గోరిన పూరుషుండు తనుఁగోరుటకంటెను భాగ్యమున్నె? నిన్
గోరితి, నీవునాకు ననుకూలుఁడవౌదువొ, లేదొ, యక్కటా! 13

చ. వలపెదలేనియట్టి మగవానిపయిన్ మనసుంచి, వానితోఁ
గలయఁగ గోరుకంటె నరకంబిక స్త్రీలకు వేఱెకల్గునే!
తెలియనినీపయిన్ నిలిపితిన్ మది, నీవయి నీదుచిత్తమో
చెలువుఁడ నాదుభాగ్యమిదె చేతులుమోడ్చితి యేలుమావనన్. 14

మ. వలపుం దాఁతురు గాని, పూరుషులతో వాయెత్తి స్పష్టంబుగం
దెలుపం జూడరు స్త్రీలు, నాదువలపున్ నేనాపుకోలేక, ల
జ్జిలకుండన్ వెలిఁ బెట్టుకొంటి ననుచున్ సిగ్గయ్యె, నెమ్మోమునిం
కిలలోఁ జూపఁగలేను, దాఁచుకొననిమ్మా నాధ నీగుండెపై.

ఉ. కన్యనొ యన్యకామినినొ కావలెనంచుఁ దలంపఁ బోక, సా
మాన్యగ నెంచి ప్రాపకము మాటతలంపుము నన్నుఁ దక్క నే
నన్యుల కంటనైన నరయన్ రతివేళనె వేశ్య నౌచు నన్
ధన్యునిగా నొనర్తుఁ, గులనారు లెఱుంగని యట్టినేర్పుతో. 16

మ. నినుఁ జూడన్ వలెనంచు, వీలయినచో నీతోడ సంభాషణం
బు నొనర్పన్ వలెనంచు, వాకిటనె తేపున్మాపు నేఁ గాఁపురం
బొనరింపం దొరకొంటి, మోహమున నోహో! సాహసం బెక్కువా
యెను: నే నే ననుదెంచి, పైఁ బడెదజుమ్మా నీవు రాకుండినన్.

ఉ. నిన్నుఁ గనంగ, నామనము నిక్కముగా సెగపొంత వెన్నయౌ,
"వెన్నవలెం గరంగు నలవేణుల కౌఁగిటఁ జేర్చుటే సుఖం,"
బన్న వరూధినీ వచన మారసి, నన్ వరియింపు, మట్లుగా
కున్నను, నామన స్సుడుకునో నవమన్మథ, మన్మథాగ్నిచే. 18

మ. మగరాజా, బిగువేల? బ్రహ్మభవదాత్మం జేసెనా సోమరా
యిగ? నేనే మగవాడనై, మఱియు నీవే కాంతవై, నాపయిన్
మిగులన్ మోహముచేతఁ గ్రాఁగుచును నీవే యున్నచో. నూరకీ
వగిదిన్ బెట్టొనరించి నీయునురులన్ బాలాటకుం జూతునే.

ఉ. నమ్మిక మైనదాన ప్రియనాయక, నాహృదయంబు నీకు నే
నమ్మెద రమ్ము నీదయను, నయ్యది చాల ప్రియంబటంచు బే
రమ్మును బెట్టి నీవు కొసరం దొడఁగన్, వయిపెచ్చుగా మఱం
గమ్ము నొసంగెదన్ వదలఁగా వల దింతటి చౌకబేరమున్. 20

చ. అవసరముండి నేఁబలుకుమన్నను బల్కవు. పంచదార చి
ల్క వంటర! నిశ్చయం బగు శుకంబుగ నాభుజపంజరంబునన్
వివిధవినోదవాక్కులను వీనులవిందుగఁ బల్కుచున్ వసిం
తువనిన, నీకు నాపెదవిదొండనుతిండిగఁ బెట్టెదం బ్రియా.

చ. వనిత దనంతఁ దా వలసివచ్చినఁ జుల్కనయంచు. నన్నుఁ జు
ల్కనగను జూడఁబోకుమురా. కాదని చుల్కగఁ జూడ నెంచుకొ
న్నను, పురుషాయితంబులను నామెయిభారముగాఁగనుండఁ బో
దసి యయినన్ ననుం గలయరా వలరాయనికేళి నాయకా.

చ. మగఁడన కంటకింపగుచు మక్కువగొల్పు నతండెయంచు ము
న్నగవును దెల్పెఁదార, యలతారకుఁ జంద్రుఁడునోలె నీవు నా
మగఁడవు త్రాఁడులేని యనుమానము తీఱఁగ, బాహుపాశమున్
బిగువుగ నాగళంబునను బ్రేమను గట్టఁగదోయి నాయకా.

సీ. ముద్దాడెదను రార మోహనాకార నన్
ముద్దాడ నీకు మోమాటమైన,
పెదవి నొక్కెద రార ప్రియనాయకా నాదు
పెదవి నొక్కుట నీకు బిడియమైన,
కౌఁగిలించెదరార కామినీమార నన్
కౌఁగిలించుట నీకు కష్టమైన,
సరస మాడెద రార సరసుఁడా, నాతోడ
సరసిమాడుట నీకు శంకయైన,

కటకటా! నోటవ్రేల్ వెట్ట కఱవలేని
కరణి నున్నావుగాని, యొందఱి పెదవుల
గఱచినట్టి భుజంగశిఖామణి వౌరా!
ఎట్టిపుట్టలో, నేపాము యెవరికెఱుక?

శా. నీసౌందర్యము గాంచి యాశ వడితిన్ నీ చిత్తమేతీరో నీ
మీసం బట్లుప్రిరన్నమై తనరు నో? యారీతిగాఁ గాక, నీ
మీసం బట్టులు వక్రిమో యెఱుఁగ; నీమీసాలలో నవ్వులున్
నా సందేహము వృద్ధిచేసె; నది మాన్పం జిత్తమిమ్మాప్రియా,

ఉ. నాయక, నీవు నన్ వలచినాఁడ వటంచును నాకుఁ దెల్పఁగా
నే, నొడలెల్ల జల్లుమనియెన్, వలిగాలికి తీవకైవడిన్;
కాయము దాల్చినందులకుఁ గల్గె నదృష్టము నేఁటి: కింక నా
ప్రాయము ధన్యమయ్యె; నిటుపై మఱి యే దెటులైననున్ సరే

ఉ. ఎన్నఁడు నీకు మోహముదయించునో నావయినంచు నుండగా
ఇన్నిదినాల కద్ది లభియించెను కాంతల ప్రాయమున్ననో
క్రొన్ననవంటి దోయి 'యిదిగో' యన నాఱునెలల్ గతింప కుం
డ, న్నను ధన్యురాలిఁగ నొనర్పఁగ రాఁగదవోయి నాయకా,

ఉ కోకలు గోర, రూకలును గోరను, సొమ్ముల బెట్టఁగోర, నే
శోకముగోర నీకరుణ సోకుటయే పదివేలు నాకు, నీ
రాకనె కోరుచుండెదను రాకను జెందొవ గోరుమాడ్కి న
వ్రాకలు నన్ను బెట్టకుమురా. కలకాలము నేలరాకృపణ. 28

చ. తనప్రియుఁ గూడకుండ వసుధం గులకాంతకు నత్తయంచు. మా
మని, మఱియాడుబిడ్డలని యడ్డులు గంగకు నొడ్డులట్లుగా
కని కనినాదు కాఁపురము గంగను దింప తెగింపు పుట్టెను, గం
గను శివుఁ డేలుకొన్నటులుగా నను నేలెద వన్నచో ప్రియా.

చ. పురుషవరేణ్య! స్వాతికయి ముత్తెపుఁ జిప్పలరీతి నాకనుల్
త్వరపడుచుండె తావకవిలాపము కన్గొన స్వాతిబిందువుల్.
కురిసినగాని ముత్తియపు కోవ జనింపదు శుక్తులందు ని
న్నరయనికాలమందె యుదయంబగు నాకనులయందు ముత్యముల్

మ. నిదురన్మాని మెఱుంగఁగా నలికికేన్ నీవచ్చుదారుల్ పడిం
బది నాకాలుఁ గన్నులం బఱపి, రమ్మా, నాకు కన్పించుగా,
ఎదురుం జూచుచు నుంటి 'ఇల్లలుకఁగానే పండుగా?' యంచున
వ్వెదవేమో? యొకయిల్లెగా, కలికితేన్ ఫిధిన్, మఱిన్వాడయున్.

ఉ. మందులు మంత్రముల్, వలెనె మా మన చిత్తము మెత్తఁజేయు నీ
సుందరమందహాసములె చొక్కఁగఁ జేసెడి మందులౌ, భవ
చ్ఛందనశీతలోక్తులె ముదంబిడు మంత్రము లౌనుఁ డెందమా
నందముఁ బొందఁ గన్ గలిపి నవ్వుచు కేరుచు నుండరా ప్రియా.

చ. రమణుఁడ. నాదు మానస సరస్సుదరిన్ వలరాజు నీదు మీ
స మనెడి మేలిగాలపుకొసన్ ననుమోవియెరం దగిల్చి నే
ర్పు మెఱుని వేటలాడఁగను. మోసమెఱుంగనిదైదె మదాత్మమ
త్స్యమకట! యందఁ జిక్కువడి యట్టిటు కొట్టుకొనంగఁ జొచ్చెరా.

శా. నాకున్ నీకున్ గొంత యున్నదని నానారీతులం బేసులన్
లోకుల్ వెట్టిరి, వాదు రాఁదగిన డెబ్బల్ వచ్చె, హో దెన్నఁడున్
కాకుల్ లోకులనంగఁ బోకు, జనవాక్యంబద్ది కర్తవ్యమే,
కైకొమ్మా ప్రియకాంత గాఁగ నను నేకాంతంబునం గాంతుఁడా.

ఉ. రోసముకల్గినట్టు లతిరూక్షముగాఁ గను నన్నుఁ జూచుచున్
మీసముద్రిప్పె దేమిటికి? మేటిమగండవె యైన జంకులే
కో సుకుమార, రమ్మ తనుయుద్ధము నందు పెనంగి చూత.మా
యాసమటంచు ముందెవర మందుమొ వారలె యోడినట్లగున్.

ఉ. వ్యాకులమేల? వల్లభ, పరాంగనఁగూడినఁ బాపమంచు తా
టాకులలోన వ్రాసిరనియా? యల వ్రాతలెటున్న, నేమిరా
నీకును నాకు బ్రహ్మమును నిక్కముగాఁగను వ్రాసియుంచె, నే
పోకలఁ బో యినన్ జరుగుఁ బోతుద కాతనివ్రాఁత రీతిగన్.

ఉ. వాసనచూడ నట్టి ప్రవసంబు న టించును గొప్పలేల? వి
న్నాం, సరసాళులకు వలపునం దనియించినదాన; పీవునన్
వాసిగ నిచ్చి పూవులనొ వ్రాలినతేటివి యూటచేత, ఏ
దీ; సరసుడ, నా పెదవితేనెరుచుల్ చవి చూచి చెప్పుమా.

మ. అనురాగం బెదనీకు నావయిని లే దన్నట్టి లోపంపు మా
టను బల్కంగనుబోకు; కుంకుమశోడం గూడి వాసించు చం
దనపుంబూతల నెట్టినైన యురముం దాఁకించిన నిన్ కౌగిలిం
తును ప్రాణేశ్వర, దాన నీ హృదయమందున్ రక్తికల్గుంజుమీ.

శా. ఆకాంక్షన్ నిను నేఁ గనుక వలచి నిద్రాహారముల్ మానుటం
జేకూరెన్ శివరాత్రి జాగరణసంసేవాఫలంబున్, విశు
ద్ధైకాదశుపవాసపుణ్యఫలముం; ప్రాణేశ, కైలాసమున్
వైకుంఠంబునుగాఁగ నీ కవుఁగిలిన్ వాంఛించి నేఁ గాంచెదన్

చ. ముడుపులు గట్టుకొంటి, మఱి మ్రొక్కులు మ్రొక్కితి, దేవుఁడెవ్వఁడె
క్కడఁ గనఁబడ్డ నీ గులిమి కల్గఁగఁ గోరి: లభింపదాయె నా
ముడుపులు నీవె కైకొనుము, మ్రొక్కులుఁ గైకొను, మీవె నాడు దే
వుఁడవు, దయాస్వభావుడవు ప్రోవుము నన్నిక జీవితేశ్వరా.

చ. ఇలవయి నాఁడు దాచు జనియింపఁగరాదు, జనించె నేనియున్
వలపును బొందఁగూడ, దనవా, కలపొందిన, లోనఁ గుళ్లఁగా
నలయునె కాని దాని మగవానికి జూపఁగరాదు; చూపినన్,
చెలువకు రోఁత యై బ్రతుకు ఛీ యనిపించుఁ గదా మనోహరా.

చ. వదనము నైనఁ జూప; విదివాడఁట రా? "యిటరార" యన్న నీ
"నదెయిదె" యందు; విద్దిమరియాడఁటరా? స్ఫుటరాగమూనునన్
కదియవు: భార్యకౌగిటనె కైదటరా? కట! రాతిగుండె దా
ల్చెదవు; మదీయసంగమము చేదఁటరా? విటరాజశేఖరా. 42

సీ. కంటిని కన్నులు కఱవు దీఱఁగ. సుమ
శరు ధిక్కరించు నీ చక్కదనము
వింటిని రతిశాస్త్ర వివిధరహస్యంబు
లెఱింగిన నెఱజాణ వీవ యనుచు
అంటిని "కరుణామయా, నీకు నే దక్కి-
తిని, నీవె నాకిక దిక్క"టంచు
ఉంటిని, "నీకృప యొకనాడు గాకున్న,
నొకనాఁటికైన నాకొదవు" ననుచు,
గీ. వింటిని శరాళిసంధించి విషమబాణుఁ
డొంటిని జూచుక్కసం గొట్టుచుండె, వాలు
గంటి, నిదే కేలుమోడ్చి నేగతుల వేఁడు
కొంటిని, గవుంగిటంగప్పుకోఁడె గాఁడ.

ఆ. వె. నిన్నుఁ గన్న మొదలు నిముసముఁన్ మగనితో
అంకుతన మొనర్చ జంకుపుట్టె
నన్నుఁ జెట్టవట్టె నాదుపాతివ్రత్య
విధిని నిలుపు మయ్యవిటవరేణ్య 44

ఉ. హేయపుమాట లన్యులన నీ, కులబంధువు లెల్లరున్ వెలిన్
వేయగనీ, చెలుల్ విడువనీ, పతి మున్నగువార లల్లరుల్
చేయగనీ, భయంపడను. చిత్తము నీకయి దాఁచియుంచినా
నోయిమగండ, వేరు మనముందను రమ్ము యథేచ్ఛగానికన్.

ఉ. సామి, యిదేమిపాప! మొక జాబునకైన జవాబు వ్రాయ వే
మీ! మృదులాంగుళంబులకు మిక్కిలి కష్టమటంచు వ్రాయ లే
దేమొ? యిదొక్కకష్టమని యింతభయంపడుచున్న నాయుర
స్సీమను జందనద్రవము చిక్కగ రాయుటకేమి యందువో!

ఉ. చిత్తజరూప నీవు కృపనుతను నాకిపుడంపినట్టి నీ
యుత్తరమందినంతనె, ప్రియ నిన్నుఁగన్నటులాయె, జన్మమే
నెత్తుట రిత్తపోక, ఫలియించిన యట్లునాయె, నేలపై
హత్తక మిన్ను ముట్టినటు లాయెను, చింతలన్నియున్.

తే. గీ. అక్షరము లమృతకణంబులౌచు మాట
లమృతపుం దేటలౌచు, వాక్యంబు లమృత
ధారలౌచు, నా జీవనాధారమయ్యె
నీవు వ్రాసిపంపినచీటి నీటుకాడ.

ఉ. కంటిని నీదుజాబు వగకాడ, కనుంగవ కద్దుకొంటి, జె
క్కిటను జేర్చుకొంటి, నలు వ్రేవల ముద్దిడుకొంటి, మానసం
బంటగ నొత్తుకొంటి, శిరమందిడుకొంటిని, దుంటవింటివాఁ
డింటను బంటుగాఁగనిక నేలగ నుంటిని నేఁటినుండియున్.

ఉ. సామిగ, నన్ను రమ్మనుచు జాబును బంపితి, వట్లుసేయ, న
మ్మొమ్మ! మరియింక నేమయిన నున్నదె? యెందఱకైన నేను కన్
బ్రాముదు? నారహస్యమును పైఁబడకుండగ నీవుదాఁచెదో
యేమనియుంట గోర్కెగల దేని దలంపకుమిట్టి కోరికల్.

ఉ. వింటివొ, లేదొ? పైకడుగు పెట్టగఁగూడని క్రొత్తకోడలన్
వెంటనె నీదు కోరికకు వీలొదవించుట కెట్లునేర్తు? పు
ట్టింటికి పోవు నంతవరకించుక యోపికపట్టితేన, నా
వంటిది యాటకత్తెల ధ్రువంబుగ లేదనిపింతు కాంతుఁడా. 51

ఉ. చాలును జాలు పూరుషుల సంగతి, యే సతులేని మీవయిన్
బేలతనంబునన్ మనసు పెట్టిన, వారల గుట్టు వీధిలో
నాలవనాటి కుండుగద! నానదునోటను నూవుగింజయున్
బాలిక, మీక, గోలవగు బాలను గానుర గోతిలో బడన్. 52

చ. సరసుఁడవయ్యు నన్ను వెతసల్పఁగఁ జెల్లునె! చిన్నవాన నే
మెఱుఁగను సిగ్గుదీయు, కవి యెన్ని విధంబుల పాటపాడినన్,
మఱిమఱి ముట్టడించెదవు మామకచిత్తము నీదుపాటలం
గరఁగునొ! నీదు పుణ్యమగుఁ గాని, నను విడుమయ్య జారుఁడా

చ. ఎవరిఁక నిన్ను నమ్మఁగల? ఇంటికి నింటికి ముగ్గువెట్టినా
వవసర మంతయుం గడచి నంతటనే సుడిపెట్టినాఁడ; నె
ల్లవిభులు నూతనప్రియులు లీలాస్థలి న స్నటులే చరించు చుం
టి నవుర! నీదు చెల్మికిని నీకును దండము జారశేఖరా. 54

మ. ఒకరా, యిద్దఱ, ముగ్గురా, మొదట నెంతో నీవు నమ్మించి గొం
తుకలం గోసిన యాఁడువారు! పదులున్ నూర్లుం గదా? వారు చా
లక, నన్గోతిని ద్రోయ నెంచితివొ? బేలం గాను, నా మోహ మా
పుకొనం జాతునుగాని, యెన్నఁడును నీపొత్తొల్ల జారాగ్రణీ

శా. నీపైనే తమయాశలెల్లఁగల కన్నెల్ వేనవేలో ప్రియా!
ఆపై నేనిఁక నేల! మీ చెలిమి కేనడ్డంబుగా వచ్చినన్,
పాపంబబ్బును, వారలన్ వదలి, నాపైనే తమిన్ నిల్పి, న
న్నే పాలింపుమనంగ న్యాయమగునా? నీవైనఁ బాలింతువా?

చ. విభుఁడ ననున్ వరించుమను విన్నప సంగతి, యివ్విధమున్న యీ
రభసము తగ్గినంతటన రాకెడపెట్టితివేని, న్యాయపుం
సభలకు నెక్కనేఁదగవు సల్పక మానను నిశ్చయంబుగా,
ఉభయుల మాప్రతిష్ట పడకుండెడు మార్గము చూడుమిప్పుడే.

శా. న్యాయంబైన తెఱంగు నేఁ దెలిపెదన్, నాకీవు నీమానసం
బియన్ వచ్చును, మానవచ్చు నది నీయిష్టంబె యయ్యాఁ, గాని వి
న్మా, యాదిన్ మనసిచ్చి, యావెనుక మానంబోవ, నేనొప్పుకో
నోయీ నాయక, చక్కగా మొదటనే యూహించి నన్గోరుమా.

చ. పరవశమయ్యె నాయొడలు, భాగ్యవశంబున నిన్నినాళ్ళకున్
దొరకిన నీదుపొందున. మనోహర యయ్యెడనొత్తుకొని మేల్
పరుపున మెత్తనౌవిరుల పైనెపరుంటిమొ, చాపమీద ని
ర్వ్యర మెడమీద గుత్తపుగవంగిట నుంటిమొ నేనెరుంగరా.

చ. ఒడలిని చేతితో నిమిరి, యొయ్యన చెక్కులు ముద్దులాడి, నీ
తొడం వసింపఁ జేసి, తమితోఁ బ్రియవాక్కుల బుజ్జగించి, నా
జడుపుడుగంగఁ జేసి రతిశాస్త్రము నేర్పిన యొజ్జవౌట నీ
కడఁకువతో నొసంగితి ప్రియా గురుదక్షిణగాఁగ గాఁగిలిన్.

ఉ. నీదుకవుంగిలింతలును నీ గిలిగింతలు, నీదు వేసమున్
నీ దరహాసముల్, వగల నేర్పులు దీర్పులు, నీ సయాటలున్
నీ నయగల్లు మాటలును, నీమురిపెంపులు బుజ్జగింపులున్
నేఁ దలపోయుచున్ మఱవనేరనురా ప్రియ, నీదుకూటమిన్.

సీ. కను విప్పి నను నీవు కనుఁగొనం దెలికల్వ
విరులు జల్లునరాలు కరణిఁదోఁచు
మోవి విప్పి యొకింత నీవు నవ్వినఁ బండు
వెన్నెలన్ మునిఁగిన విధము తోఁచు,
పలువిప్పి తీయు పల్కులు నీవు పల్కిన
అమృతధారం రోగినట్లు తోఁచు,
కేల్గన విప్పి కౌఁగిట నీవు నను జేర్ప
స్వర్గంబు నందున్న సరణిఁ దోఁచు,

ఆ. వె. మనసువిప్పి నీవు మన్నింప, నాదు జ
న్మంబు ధన్యమైన మాడ్కిఁ దోచు
నీదు పొందు కంటె పైదలులకు లేదు,
లేదు, లేదుభాగ్యమో దయితుడ.

సీ. నీ పల్కులను విన్న నిమిషమందే నాకు
జల్లునఁ గన్నీరు చిమ్ముచుండు,

నీ కేలుతాకిన నిముసమందే, తను
వెల్లను నాకు జజ్జల్లుమనును
నీవు ముద్దాడిన నిముసంబునందె, చె
క్కులు మిక్కిలిగ నాకుఁ బులకరించు,
నీకౌగిలిం గన్న నిముసమ్మునందె, డెం
దమ్ము దట్టమ్ముగా జెమ్మగిల్లు,
ఆ. వె. నిన్నుఁ గూడి నపుడె నెమ్మేను కంపించు
చేత లుడుగు గనులు మూతవడును.
హృదయ మదరఁ దొడగునది సుఖమో, కష్ట
మో, యెరుంగజాల నోయి సామి. 63

సీ. పలుమారు నిన్ను ముద్దులుఁగొంటి, నీదు చె
క్కిళ్ళు కందు నాశంకింపకుండ,
ప్రియమారగా నీదు పెదవి నొక్కితిని, బ
ల్మీన నాటునంచు మోమోటపడక.
గాఢంబుగా నిన్నుఁ గౌగలించితిని, నీ
యురము నొచ్చునటన్న యూహ లేక,
కసితీర నీతోడ గలిసి పెనంగితి,
నలయుదు వనియును దలఁపబోక
గీ. మున్ను నీ పొందుకై వాచియున్న దాన
నౌట, సివ మెత్తినటుగా నైతిఁ గాని
యింతయొత్తిడు కలిగింప నింక మీఁద,
బెదరు మాని క్రమ్మఱను రాగదర స్వామి. 64

చ. హృదయములోన భావముల నెల్లను దెల్పఁగఁ బోవ, భీతి నా
పెదవులు దాఁచియుంచి మన ప్రేమకు సద్దుగవచ్చె, వాని నీ

పెదవుల బిగ్గఁ బట్టి వలఁపీడ లొనర్చుచు శిక్షచేయరా
యెవరును మానుచుర్ మణితభేదములన్ హితమున్ ఘటించురా,

శా. స్త్రీవశ్యంబు లెఱింగి, నామనను స్వాధీనంబు గావించు నో
న్యాపం చెంచెద? లేనిచో నెచట నైనన్ నావలెన్ సర్వమున్
నీవేయంచు దలంచి, యొక్కమగవానిన్ నమ్మికొన్నట్టి స్త్రీ
లీ విశ్వంబున నుందురా? చెప్పుము, నీవేయోయి ప్రాణేశ్వరా.

చ, తనివి జనింపకున్నయది తావకరూప మదెంత చూచు చు
న్నను, పలుమారు చూతు నవినం, జనుదేఱక యుంటివీవునన్
విను, నదుపాయ మొండు వినిపించెదఁ బూర్తిగ నిన్నుబోలు చ
క్కని మగవాని నొక్కరుని గాంచుము నావలనన్ మనోహరా.

సీ. అల్లంతదూరంబునందుండియే నేను
విన 'ఈలలన్' వేసికొనుచు వత్తు,
వెవరినో పిలిచి బోయెడివారలం బిల్చి
నటు గట్టిగను చప్పటు చఱచు,
వింటిగుమ్మమునకు నెదురుగానిలుచుండి
కేంద్రించి యుమియగా కేకరింతు,
నేను గన్పడినంతనే స్పష్టముగను జే
తులనెత్తి నాకు సైగల నొనర్తు

గీ. వెవరు చూతురో యనియు నూహింపవేర?
మాయురే పండువంటి నా మనువునకును
నీళ్ళుపోయకయున్న చో, నీవు నాకు
రంకుమగడవు కావటర! విటకాడ. 68

చ నలువురిలోన నన్నుఁగని నవ్వుచు నిల్తువు, కంటిసైగలం
దలఁపు లెఱుంగజేసెద వెదం జెయిచేర్చి శిరంబు వంతు, వూ

గ్బులు నిగిడింతు, వోష్ఠమును ముద్దుల కొగ్గెద, విట్టులైన, నె
ట్టులు మనగుట్టు నిల్చు? మగఁడున్ బసివట్టుఁగదా మనోహరా!

చ. గడె కొఁకజాబు నంపెదవు, కప్పడకున్నను మాటిమాటి కి
క్కడ కరుదెంతు, వింతతమకంబున వేగిరపెట్ట నాకెటుల్
గడచును? నీవు కోరిన ప్రకారముగా నను రేబవళ్ళు నీ
కడఁ బడికావులుండుమనఁగా, వశమా? మగనాలరా ప్రియా.

చ. రమణుఁడ, నేను రామికిఁ జిరాకును జెందకు. కత్తికోత కా
డు మగఁడు బ్రహ్మరాక్షసునటుల్ ననుఁ గాఁచియెయుండు నెట్లుగా
సమయము చిక్కునో యెఱుఁగ, సందొకయించుక కల్గెనేని, నీ
సముఖమునందు వ్రాలుదును చప్పున రెక్కలు దాల్చియైనను౯.

ఉ. ఇంచుకయోని పై కరుగ నీయవు. పై మగవారిఁకోడ భా
షించుట కొప్ప, విల్ వెడలఁ జేరవలెన్ నిను, పుస్తెకట్టి పో
షించుమగండు నీ యమలు చేయదలంపడు, నీకు లోఁగినా
నంచును, నింత లోకువటరా యొనరింతువు జార శేఖరా!

ఉ. అమ్మక చెల్ల! కంచు పదునైనది నీ మది యం చెఱింగి, నా
సమ్మతి యెల్లఁ జంపుకొని, సాధ్య మసాధ్యము నెంచ కీవు న
న్నెమ్మెయిఁ ద్రిప్పకొన్న నటులే తిరుగాడుచు నుంటి, నిట్లుగా
నమ్మితిఁగాన, నెన్నడును నన్నెడబాయకుఁ బ్రాణనాయకా.

చ. "వలవదు నీదుచెల్మి, మగవారల నమ్మఁగరా" దటంచు నేఁ
బలుకఁగ, నమ్ముమంచు పలుబాసలుఁ జేయుచు నాదుసమ్మతిన్
బలిమిని బుచ్చుకొంటి, విటు పైఁ గద నీదు నిజం బెఱుంగఁగా
వలె? వగకాడ, "నమ్మి చెడువారలే" రనుమాట నిల్పరా.

ఉ. అసలు పుట్టునట్టులుగ నచ్చికబుచ్చిక లాడి, యెన్నియో
బాసలుచేసి, యూవయి సెబాసు! మొగంబును జావవైతి వో

యీ సరసుండ, మోసము సహింపను నీవిటు కృష్ణవేషమున్
వేసిన, భామవేషమును వేసి జడన్ నినుఁ గొట్టెదంజుమీ 75

చ. సరసుఁడవంచు నిన్ గని పసందొనరించితిఁ గాని, సందులం
దిరుగు పదారవిందములు నీవన, నెందుకు మోహమొందుదున్!
దిరిగెడికాలు నీ దయినఁ దిట్టెదు నట్టిది నాదునోరు, వే
గిరి మరుదెంచి, ముద్దుల బిగింపుము నాపెదవుల్ మనోహరా.

ఉ తప్పిద మీవు చేసియును దప్పులు నాపయి మోఁపి చప్పునం
జెప్పక లేచిపోతి వతిచిత్రము గా! నిను నేను వేఁడుకో
న్నప్పుడె రాఁ దలంచితివొ? నట్టుగ బెట్టుగ కూరుచున్న, నే
నొప్పను నీవె ముందుగఁ బ్రియుండ, ననున్ బ్రతిమాలుకోవలెన్

ఉ. ఏమిటి నేను తప్పు ఘటియించితిఁ గన్నుల నెఱ్ఱజేసి న
మ్మోము ముడించి పోవుటకు? ముక్కున నింతటికోపమా? యిదే
ప్రేమకు లక్షణంబా? యిటు బెట్టొనరించినఁ దాఁళఁజాల, రా
రా మఱి యల్క పెండ్లికొడుకా! బ్రతిమాలితి నేనెముందుగా

ఉ. ఆఁడుది యల్గినం బురుషుఁ డామెను దేర్చుటపోయి. నావయిన్
నేఁ డిటు నీవె యల్గుటయి నేను నిను బ్రతిమాలుకొంటయుం
జూడఁగ వాడవాడలను సుందరు లందఱు నవ్వుకుందురా?
మోడిని మాని రాఁ గదర మ్రొక్కెద నీదు పసిండికాళ్లకున్

ఉ. అట్టి విశేషమోహమున నాఁడుదియు న్మగవాఁడునుండ, గన్
కుట్టును ముండదైవమునకున్ మన యిద్దఱిప్రేమఁ జూచి, యి
ప్పట్టున నన్యదేశములఁ బటఁగఁ జేసెను నిన్ను దేవుఁ! డే
నెట్టు భవద్వియోగము సహింపఁగఁ జాలుదురా మనోహరా!

ఉ. లేచిన దాది నిద్రకయి లేచినగాఁకను నిన్నుఁ గూర్చి యా
లోచనయేకదా? కలలలో నినుఁ జూచుటయేకదా? నినుం
జూఁచిన దాఁక తాళననుఁ జూడగ వీలుఘటిల్లినంతనే
వే చనుదెమ్ము, క్షేమమును వెంటనె వ్రాయుము యోయినాయకా.

చ. ఉదయమునుండి రాత్రివఱకో ప్రియ, నిన్ను గుఱించి నేఁబదిం
బదిగఁ దలంచుచుండెదను, బాపమెటుల్ వలబాఱు మందువో
గద? యొకమారు నే నెటులుగాఁ బలబాఱుట లేను. నన్ను నీ
వు దలఁచు చుండువో, తలఁపవో వయివింతలలోన మున్నుమున్?

ఉ. ఆ వయిచోట కుల్కు జవరాండ్రును జక్కనిమాయలాండ్రునుం
గాఁపుర ముండ్రు, వారలు వగల్ కురియింతురు, లేనిమోహముల్
జూపుదు, రిచ్చకంబులకుఁ జొత్తురు, వారలమాయ లందు నీ
వేపగిదిం దగుల్కొనక యిచ్చటికిన్ మరలంగ వత్తువో! 83

ఉ. ఆ నెన, రా సమాదరణ మానల, హాయభిమాన, మా ప్రియం
బానయ, మిన్నియుఁ సతతములంచుఁ దలంచుచు పొంగుచుంటినే
గాని, హఠాత్తుగాఁగ మన కాఁపుర మిట్టులు తెల్లవారునం
చే నెఱుఁగన్ దినంబులిఁక నెట్టుల దాటుదు నాకువల్లభా 84

ఉ. కన్నులనీటిచే కరఁగి. కాటుక రేఖలు నాదు చెక్కులం
దున్నవి నీవు నిర్దయఁ బ్రియుండ ననున్ విడనాడినంత నుం
డి, న్నిరతంబు నే బడిన నెవ్వగ నియ్యవి లేఖలౌచుఁ దె
ల్పు న్నయనంబులం దెఱచి, పూర్ణకృపం దిలకింపు నాదెసన్

ఉ. కోరినపూరుషుండు సమకూరెను, గోరిన యట్లతండు నన్
గూరిమిఁ జూచుచుండె, రమణుల్ మఱియెవ్వరు నాకు సాటి? యం
చూరక నేను గొండవఱునుండఁగ, నన్ విడనాడి నీవు నా
కోరికలెల్ల నేలకును గూలిచినాఁడవు నిర్దయాత్ముఁడా 86

చ. వలచితి నిన్ను, నీ వలపు వాంఛ యొనర్చి గడించితిన్ నినుం
గలిసితి, నీవు నన్ కలియఁగా సుఖవార్థిని మునిఁ తేలితిం
జెలువుఁడ, జన్మ సార్థకత చెందితి, నీవెడఁబాసి తంచుఁ జిం
తిల, నలనాఁటిసౌఖ్యమె మదిం దలపోయుచుఁ దృప్తిచెందెదన్

చ. [illegible]చితి వారు వీరవక విశ్వము నీకొఱ కట్టి నన్నుఁ బో
పడి[illegible]వా? యొకప్పుడును వీడను టన్న ప్రమాణవాక్యముల్

విడిచితివా? నగరాజసుతులు నిన్నను సిగ్గును నన్నభీతియున్
విడిచితివా? సరే, విడిచిపెట్టము దోసెడు నీళ్లు నాకు నై.

మ. పిటరాయా, మఱుమాయమాటలను వేవేలాడి మున్నీవు న
న్నెటులో రుప్పుఁగఁ జేసినాఁడ, వది నేఁడేమయ్యె? మానాన్నకేము
చ్చటగా నిన్నటు విధిఁ బెట్టితి? వెడఁగ జంకైనను బుట్ట లే
దటరా? యప్పుడె క్రొత్తవింత చెడి యాహా! ప్రాఁతరోతయ్యెనా

ఉ. వేళ లభింపదాయెనని, వీలుఘటిల్లక యున్నదంచు, ని
ల్లాలికి కోపమంచు, మిషలన్ వచియించెద వేర నా పయిన్
జాలి నశించె నన్నదె ని బద్ధిర నీకిపుడొక్కచొక్కపున్
బాలికయే తటస్థ మయినన్ గ్రహింపక మానుకొందువా?

చ. మనసు నొసంగనో మిగుల మక్కున చూపనో! భక్తితోడ నీ
పనుపు లొనర్పనో? హృదయపద్మములోపల నిన్ను దేవుఁగా
ననుదినమున్ స్మరింపనో! ప్రియా ననుఁ బాయుట కేమిదోష మే
నొనరించితిన్ ప్రమాద మొగియో ఘటిల్లిన సైఁపఁజెల్లదే?

చ. కుతుకము గల్గె మున్న ననుఁగూడుట కాతమి యెల్ల నిప్పుడ
ద్భుతముగఁ బోయె నో ప్రియుఁడ! దూరపుకొండలు చేనునై నఖ
క్షతముల నున్నపాయుటనో? కాక తినం దినగారెలందుఁ జే
దు తగులు నట్లుగా నరుచి దోఁచెనో నామధురాధరంబునన్

చ. ఒడఁబడకుండ నే బిగిసియున్న దినంబుల నాదు పొందుకై
పడఁగను రాని పాట్లుపడి వల్మరునన్ బ్రతిమాలుకొంటి. వి
య్యెడ మొగమైనఁజూప విదియేమిఁ యక్కఱ తీరినంత, నె
క్కడప్రియు లన్నపాట వగకాఁడ, యథార్థము చేసినాఁడవా

ఉ. నొచ్చు నటంచు నీ పెదవి నొక్కఁగనైతిని, నొచ్చునటంచు నిన్
గుచ్చి కవుంగిలింప మదికోర్కులుతీఱఁగ కాల మున్న దం

చిచ్చు యడంచుకొంచుఁ జరియించుచు నుండఁగ, నింతలోననే
తెచ్చె వియోగ మయ్యయొ! విధిన్ మఱియెవ్విధిఁదిట్టుదుం బ్రియా

మ. సరసుండై సరిగాఁగఁ బెక్కుసతులన్ సంప్రీతి శ్రీకృష్ణుఁ డొ
క్కరుఁడే నల్వుఁగఁజాలె, తక్కురుల కక్కార్యంబు శక్యంబె! "యు
ద్దఱి పొందేలర? మద్దువ" ద్దనిన, మున్ దర్పంబు వివాడి య
ద్దిర! నేఁడింటిథయంబు నొక్కమిమగాఁ దెల్పంగ నెట్లొప్పుదున్

మ. ఎలమిన్ నీవిటులుండ, నేసవతి యో యేరాలొ యీనూని క
న్నులలో నిప్పులు పోసికొంచు మన పొందుంబాపె, నీకౌఁగిటం
గులుకం గోరియొ? దాని నాయుసు రిఁకం గొట్టన్వలెన్ నాథ! నా
వలెనే యద్దియు నీకు దూర మయి తీవ్రగ్లాని పొందన్ వలెన్॥

శా. నీవింకొక తెమీఁద రంగువడి దానింగూడి యుప్పొంగుచున్
వేవేభంగులఁ గ్రింద మీఁదఁబడ మీస్వేచ్ఛావిహారంబులన్
నేవారింపగనుగాని, యొక్కటి మదిన్ సక్కంబుగా నెంచుకొ
మ్మావంతైనను నీకు నాయుబును లేదన్నటులుండన్ వలెన్

ఉ. వింటెసి వింటి నీకిపుడు వేఁడుకకత్తెయొకర్తు క్రొత్తగా
వంటవమయ్యెనంట! యటులౌటను నన్నెడఁ బెట్టి తంట నా
యింటికి రాకయుండ నవియే మొలలోఁ జెయివెట్టియాఁపెనో?
వెంటనె యాఫలం బనుభవించెద. వుండర నీవుధూర్తుఁడా 98

ఉ, ఓరి, ననుం ద్వజించి మఱియొక్కతెకుం దగులాట మైతివా?
కూరిమి మీరలిద్దఱును గుల్కఁదలంచితిరా? సరే మిమున్
దూరము చేసి, నాసవితి తుళ్ళడఁగించి కలంవకున్న నా
పేరును బెట్టి పిన్నిఁకను బిల్వకురా సరివారి గోపలన్. 99

ఉ. మంగళ మేను నీకుఁ బలుమారును గోరెద, నీవు నన్ను నే
భంగిఁగఁ జేసినన్ సరియె, పాలనుముంపుము, నీళ్ళముంపు, మా
సంగతితోడ నాకొకప్రసక్తియు లేదు, శుభాంగ, నిత్యమున్
మంగళ మౌతనీకు, జయమంగళమున్, శుభమంగళంబునున్. 100

జాబులు రెండుభాగములు సంపూర్ణము.

సరసోక్తియుక్త

# కృ ష్ణ శ త క ము



గ్రంథకర్త:

సెట్టి లక్ష్మీనరసింహ్వాము.

## —• సరసోక్తులు. •—

— (౦) —

'రామాయణము రంకు, భారతము బొంకు'

'బూతుమాటలాడితే, కాని పూకు సంకెళ్ళు పడతవి'

'బూతులేదు; ఆతులేదు; కాలెత్తవమ్మా కఱ్ఱ వెడతాను'

# సరసోక్తియుక్త

# కృష్ణశతకము.

శ్రీరమణీకళత్ర, సర
సీరుహపత్రవిశాలనేత్ర, వి
స్తారకృపారసంబునఁ బ్ర
జాపరిరక్షణ మీవొనర్ప భూ
భారము వృద్ధి కాగ, నది
పాపఁగఁ గృష్ణుడ వై జనింపవే?
'నేరక వచ్చినన్ కఱుపు
నేరుపుతోడనె దించుకోవలెన్',

క. హరిహరి! 'గాడిద మొద్దయె
గరుడస్తంభంబు' గాగ గాడిద కాళ్లన్
శిర మిడె వసుదేవుం డది
యఱచిన నీకారి గల్గ నని శ్రీకృష్ణా.

క. ప్రియమున దేవకి కనె ని
న్నా, యశోదకు నేగతిం దనూజుండవు నీ
వయితో? "దెంగులు గుట్టిము
నియుఁ బిల్ల దివాణము' దను విధమున గృష్ణా. 3

ఉ. అంగన లెల్ల గొడ్డు ముసలమ్మ యశోద కుమారు గాంచె నం
చుంగమలాయతాక్ష, నిను జూడగ పారిరి యద్భుతంబు హె
చ్చంగ 'విచిత్రవిప్రునకు చన్నులు పుట్టగ నివ్వ నందు, వం
చాంగపుబ్రాహ్మణుండు పారులు జూచుచు నవ్వి నట్లుగన్.

ఆ. వె. నీదుబొడ్డు తమ్మివి వికించి యుంట నీ
బొడ్డుకోయ, నతని మొడ్డ తెగునొ?
"బొడ్డుకోయ, బోయి మొడ్డ కోసిన యట్టు"
లనుచు జంకె దాది యబ్జనాభ. 5

తే. గీ. కంసువంపున నిన్ జంప గా దలంచి
యరుగుదెంచిన పూతన యాదిగాగ
నసురవితతి నీచే గూలె నౌర! 'దొంగ
జోము దెగించుకొను' టిదే నోయజాక్ష. 6

తే. గీ. చక్కని యొయ్యారి యై వచ్చి చన్ను గుడుపు
పూతనను నీవు గూల్చ బెన్ఖ్యాతి వాగుచు
మడిసె. 'ఇల్లాలి యొడిలోని మర్మ మంటి,
విప్పిచూడ చుల్లులుగల చొప్పన హా'. 7

మ. ప్రకటంబౌ సుడిగాలి చందమున నీకై త్రెక్కెత్తి కొంపోవుచున్. చం
పకయున్ నొంపకయున్ దురాత్ముడు తృణావర్తుండు నీకై ధూళి
గళముల్ గప్పెను, 'దేంద్రుడనా కొడుకు దొంగన్ లేడు; దొంగన్ లే,
డిక బూ కెల్లను పాడుచేసె' నను టిట్టెకాదే? దామోదరా!

ఉ. బాలుడ వైనకాలమున బల్లను గొల్లనెలందు లుట్టిపై
వేలగ కట్టు చెట్టు గల వెన్నను నింటికి మంద్రచొప్పనం
గ్రోలగ నీకు దృప్తి గలుగుం గద! 'ఇంటికి నొక్క యీక. యి
ల్లాలికి నొక్క గొంగళి' గదా? నవనీతహరా. పరాత్పరా. 9

ఉ. పెట్టిన యట్టి గొండెములు వేసిన బీగము లట్లె యున్న, నె
వ్వట్టున నీవు నీజనని పరిక్కనె యున్నను బాలు మాయ నా
నట్టిని! "మూద్ర ముద్రితాలె నుండగ, ముగ్గురుబిడ్డ లెట్లులో
పుట్టి" రటన్నమాటయిది పోగడు నీధ్వజ. యో యధోక్షజా

చ. దుడుకుదనంబునన్ బడవ దొంతుల మీగడ లీవు పూర్తిగా
గుడిచి పరున్న వేల యగు కోడలిమూతికి దుద్ది, దానిన
వ్వ డడచెనత్త! దొంగకొని పోయిన వారికి దెంగులే, కడం
దడకను దీయు నాతిపిని తప్పను చొప్పద నందనందనా. 11

ఆ. వె. నీదు చిన్ని బొజ్జ నిఖిలలోకము లెట్లు
పట్టె? అత్తపూకు ప్రతిగింజ,
మామమొడ్డ దొడ్డ మంచపుకోడను
నట్లుండె, తల్లి యరయ కృష్ణ. 12

చ. మునులమనమ్ములందు, సిరి మొద్దియునందు కవుంగిటన్ సత

మ్మును మునుకట్టి పొందు నిను మాతతోడ యశోదతోట బం
ధన మొనరింప నెంచెనట దాన భయంపడినాఁడవే హరీ!
"చిరిఁగినపూకు దొంగ యొకఁ సీ జనుపుం గనునే" యొ కప్పుడున్?

శా. రాకాసుల్ నిను వేనవేలు బరిమార్పన్ బృంద యందుంటచే
నీ కేళిసమయంబు లందొకొక్కఁడే నిన్నా ఖలుల్ దాఁకరే?
కాకుల్ గల్గినయూర వేకులను నేకం, గాకియే తెంచి తాఁ
బూకుం బొడ్చె' న టన్న సామెతగతిన్ భూమీదవా, మాధవా

క. నినుఁ బరమాణుసమానుని
జన కుక్షిని నిలుపుకొనఁగఁ దలఁచి జనుఁడు మిం
గె నహా! గం పంతటివృ
షనా గాడిదమొడ్డ చిక్కుకొను నెము రారీ! 15

క. కరంముదిగిన మొడలను
కంఠంబును దెగ దటన్న సామెత యోగ్యై
కుంకా, యేమయ్యె జకుడ
కుంటితగతి నిన్ను (గోల) కూలినవేళన్ 16

చ. మదమున నిన్ను బట్టిపరి మార్చ నెదం దలఁచి కాళియుం
డెమరుగొనంగ, వానితల లెల్లను బిప్పిగ నీవు కాళ్ళతో
జదువగ లేదె నీవు? సర సంబునకున్ సరసుండుగోవ, జ
న్ను దలఁగి కన్న వోపుట కినుంగొన నిట్టిదె? గోపడింభకా. 17

— మత్తకోకిల —

ఊతవండ్లకు బెట్టు నెక్కఁగ, నెత్తుపైములు నాటిన
ట్లీత లాడ గళిందజానది నీవు మున్జగ గాళియుం
డీతముల్ ఎఱుగంగ దెంగఁగ నెంచు నిన్ నడిబట్టి, యా
హా! తుదన్ పగనొంచె శేషశయాన యోగరుడధ్వజా 18

గిలకకు నీకునున్ దిగిన కేవలబాలుని నిన్ను బిల్చి, నీ
తళుకు మెఱుంగు చెక్కిలి ముదంబున నొక్క, స్తనద్వయం బుర
స్థలమునఁ గ్రుమ్మి, రాధ రతి సల్పఁగ, అవ్వకు దూల తీఱిన
ట్టులు, మనుమండు నేర్చిన యటులు గనుపట్టెను గాదె మాధవా?

ఉ. మాధవ, పక్కలో నులకమంచముపై నిను వేసికొంచు తా
బాధలు చిన్నటంబడియె, బాల్యమునం బుప్పఁ బాన్పు మీఁద ని
న్నే తవురేకిఁ జేర్చికొని యోగ్యతయు మున్నగు సౌఖ్యములు గనన్
రాధిక తెచ్చు నుచ్చయును, హైకను జేయు యటన్న నైఖన్
ఉ. కోంచెపుపాల్య మందెగసినుం డగుమం గసి దీప రాధికన్
దంచెను చిన్నికృష్ణుఁడు మునింబోనఁ గూర్చుచు నన్నగార్త చా
టించిన యల్లు ధాత్రిఁ బ్రికటించెను. పూకను చెప్పుచేసి వా
యించుట" యన్నమాట కిదియే యగు కారణ మ్రిధారగా
చ. వలు విరహాంపునొప్పులకుఁ బాల్పడి మోహముగన్న గోపికల్
కటకట! నీవు ప్రక్కఁబడఁ గాఁ గనుఁ గోరియు, వస్త్రహీన లై
తెలుసునఁ పికాఁ గన్పడఁగఁ దద్దయు జంకరి "మంత్రసానిముం
దటనె యుపస్థ దాఁచిన" విధంబున గోపవధూమనోహరా 22
తే. గీ. 'పదివి నెల్లిషి చేయెత్తి నాకు మ్రొక్క,
చేలముల నిత్తు', నని నీవు చెప్ప, గొల్ల
పడఁతులకు "పూకులోఁ బుంకు, బావగారి
నైవ్య" మను సట్టు లాయె నో వారిజాక్ష 23

— ♦ రత్నావళి ♦ —

"అమ్మఘువుజాతరన్ మానినచో నాపద వాటిల్లు నటంచుఁ
నెమ్మది భయపడనేల? "పూకు పెండ్లికి నగరకలకి పుణ్యంబాజా
నుమ్మా, మొడ్డ పెండ్లికి ముఖలింగపుసాన్నాయిను" మ్మనుటయిదియే
నమ్మా." డని నీవు గొల్లలన్ మాన్పు, నగము నెత్తితివే శౌరీ
తే. గీ. వ్రజ సంరంభమున జాల వాన కురిసి
తుదకు. 'నత్త, నీకొడుకు గండోళిగాఁడె,
పత్త మీఁద చేతిని వేసి పల్కకుండు
నను నటులె చేసె, కృష్ణ, నీ వది నత్త! 25
తే. గీ. వనజనాభ నీ మొగముసొంపునకు వలచి,
పడఁతు లెందఱో నీవయిఁ బడిరి "మొగము
తేట పూకుకు చేటను మాట గలదు,
మొగము తేట మొడ్డకును జేటగుట క్రొత్త 26

ఉ. అవ్వలిమాట మాచుకొనరా! మగరాజుల కేమి? మొద్దకుఱ్ఱ
బువ్వులు మల్లెఁ బెట్టుకొని పోదురు ఎన్ జతగూడ యుండినన్
ద వ్వగు కాఁపురంబుఁ సదా తలవంపులు మీకుఁగల్గుకో
జవ్వనులారః" యన్నను భ్రమదల్ వినరా రమావరా! 27

తే. గీ. గొల్లతలు శైశవమున నీ బుల్లిపండు
గుడిచి, ప్రియంబునన్ మోవి కొఱికిరి. యను
శాల. ఆసలున కసగోష పానము, మఱి
వట్టికన్ శిశ్నపాన మన్ నరుస మార్చి 28

చ. గాలు తిమిరెంపుఁ గ్రామమున, నైఁబడ వచ్చిన గొల్లయన్నమి
న్నలఁ గనగూడుచున్. ముదమునన్ యమునాతటభూములందు వ
ద్రిలుదు గావె నీవెప్పుడు? దెంగఁగ నేర్చెనమొడ్డగ్గి శ్వరే
ఖల నిరతమ్ముఁ గాంచు నను పోలిక సుందర గోపబాలకా 29

ఉ. ఉద్ధవసుత్రఁ గొల్లెతల యొద్ద పరుండి, భగంబులం గనన్
బుద్ధియు. ఎంతి వారవలి మోమయినన్ గటు లాటఁగా గుణం.
లిద్దరన్ జడంపఁగని యెప్పుడి నీకహా? వ్రాకఁ జూచినన్
బుద్ధియు, గుద్దఁజూడ గుణయుడె మది కన్నడి టఱ్ఱయించితో
క. పెరిగితి గొల్లల నెన్నను,
మరిగితి నా గోపకులముల! మఱి వే కేలా!
ఇరు గమ్మ నండిపెట్టఁగ,
పోరు గమ్మయు దెంగిపెట్టు గాల్కి యిదె హరీ 31

ఆ. వె. "పత్తి దేవళంబు, పై సిండ లింగంబు,
గంపు లోని సాడె యమ్మ తె' మగను
నాదు శిశ్నభక్తుప" కటంచు గోపకాం
తలకుఁ జెప్పదువుగదా? ముకుందా 32

శా. కాళిందీతట సైకతంబుల రతుల్ గావించి నీవో, వ్రిజ
స్త్రీలెల్లం దుడువంగ నీయరుగదా దేహంబు లందంటు తి
ద్దూళుల్, ద్వద్వమరాంఘ్రిచిహ్నముల నొందుం గావునన్ శ్రీహరీ
బో తే! 'అంకుమగండు వీఁపు తుడువం' డం చుల్లసం బాడుచున్

ఉ. వేణుకగాంచి నీవు వనవీథిఁ జెలంగి చనంగ, గొల్లపూ
బోఁడులు నీదు వేషమున బూనుచుఁ గొందఱుఁ, గొందఱతివులై
క్రీడసెయునప్పుడంటట! హరీ, విరహంబున నేమిలాభమో!
బోఁడియు బోఁడియుం గలియ బూఁడిదరాలు వటం చెఱుంగరో!

ఆ. వె. బృంద యందుఁ దిరిగి పెనుగానిన్ సాధింప
నేగ కారె! కంసి నృపతి చేత
కాని నగఁడు పూతుపైని గృద్ధివయ్యల్లు
నీవు పిలలఁ జెఱచు నిలిపె కృష్ణ 35

చ. అవయము గోపికాజన సహస్రముతోడను రాసకేళిఁ గోఁ
దవరుచు బృంద నున్న నినుఁ దా మధురన్ వధియింపఁ బిల్వ బం
పిన యల కంసుఁ డీల్గె గద! నెంగున గర్వ కొరుని తీసి గు
ద్ధను దిగ గొట్టుకొంటను నీ దర్పన మిద్దె సుదర్శనాయుధా. 36

తే. గీ. అదనువాకు వస్త్రగంధమాల్యాదులు లభి
యింపగ గ్రహించి కుబ్జతో నింపున రమి
యించి, కంసుని బరిమార్చ నేగితి వహో
ఆడవిలో చెంగి యాకున దుడిచి నట్లు. 37

శా. ఓరీ బాలకా, వజ్రకర్కశమదీయోరస్థలం బైన గ
న్గోరా పోరక పోర యంచు మను చాణూరుం డనన్, వానితో
నీరేజేక్షణా, పూకు పూకెదురు, పైనింగ దోసె డన్నట్టులే
రారా రావు లోసర్వ? పోరగను రా రా, యంచిలం గూల్పవా.

తే. గీ. దుష్టులగు వారు నీకు బంధువులెయైన,
నవని గూల్పవె వారి? మేనత్త కొడుక,
మెల్లగా దొంగరా యన్న మిన్న కుండు
నట్టి వెర్రియు గలదె కంసాసురారి. 39

ఉ. గోకులభూమికిన్ మగుడఁగొబ్బున రామిని నీదు రాకకున్
రాకకుఁ గల్వలట్లు ప్రతిరాత్రియుఁ జూచుచు మన్మథజ్వర
వ్యాకులలైన గొల్లజవరాండ్రకు నక్కట! మిక్కుటంబుగా
పూకునఁబోటు, బుఱ్ఱినలువుం" గలిగెన్ మధురాపురీచరా

తే. గీ. మిగల మఱుగుజ్జు గాన నివ్వోలఁత మేన

నగువభాగంబు కంటెను దగువకుబుచ,
నాడె మగువాయరాలికి నడుమ బొక్క-
టంచు నెగనెత్తవేకుబ్జ నబ్జనాభ? 41

చ. ఘనతరులైన మాగధముఖప్రతికూలనృపాలపాళిచే
దినదినగండ మాటను మదింగని, రాధ వరాధరామృతం
బనయము గ్రోలు చుంటువట! అత్తనుదెంగిన నాయువెక్క-వో
నని యెడిమాట నిక్క-ముగ యాదవశేఖర, రాధికావరా. 42

ఉ. "ఇక్క-డయుద్ధమేల, జయ మేటికి? పీనిని నాదువెక్క-నే
కుక్క-ను బోలె త్రిప్పి ముచి కుందుని జేర్చిన జచ్చు, 'గొట్టగా
నక్క-అలేదు, తిట్టుటయు నక్క-అ లే, దని పట్టి వట్టలన్
నొక్కి-నయట్టు కాలయవ నుఁ వదెయింపవె? యో చతుర్భుజా.

తే. గీ. పెంచి యుళను రాధిక నీకు పెండ్లిచేయ నిన్ను; రాధికం,
బాసి యాకన్న నీల్గదొడగె, పెంచుకోదియె యుత్తు
పొడిచి నట్టి లీల దయమాలి, యోవనమాలి మున్ను. 44

చ. రమణుడ, నన్నుజేకొనగ రమ్మని రుక్మిణి వ్రాసిపంప, నా
కమలదళాక్షి నాకరణి గైకొని, యచ్చెలిమిన్నయన్న మీ
సములను నున్నగా గొరిగి సైతము వచ్చితి వౌర పీవు గో
కు మనిన, చన్నుపట్టుకొను కుర్రతనంబునుజూపి కేశవా. 45

ఉ. చేవ దలిర్పఁగా దనదు చెల్లెలిఁ జైద్యున కిత్తునంచు సం
భావన రుక్మి చేసినను, మాగధముఖ్యనృపాలు రడ్డినన్.
కేవలశౌరి పీ వనుటఁ గేవల మిందిర యైన రుక్మిణిఁ
దేవిగఁ గొంటెఁ గాదె హరి! దెంగఁగఁబోయిన, అంతులజ్జనా?

తే. గీ. చాలురా చాలు, బావమీసలను గొఱుగఁగూడదని బలరా
ముందు, కోపపడఁగ అట్టె వదలితి రెండవతిట్టు, సగము
పెట్టి మేనత్తవాపి యన్నట్టు కృష్ణ 47

చ. తమిఁ దనయన్న మీస మొకతట్టునఁ బోయెనటంచు రుక్మిణీ
రమణి విచారమొంద నది క్రిమ్మఱ వచ్చుట యెంత యంచు హా
స్యము నొనరింపవే? మగఁడుచచ్చె నటంచును మొత్తుకోఁగ అం
కుమగఁడు చన్నుఁబట్టి పిసుకుంగదె? యంగజరూప, శ్రీపతీ 48

ఉ. దక్కగపోయె రుక్మిణి వృథాగ నటంచును జైద్యుఁ డేడ్వఁగా,
మిక్కిలి రుక్మిదుఃఖపడె మీసము దక్కక పోయెనే యటం
చక్కట! ఇల్లు కాలిన దటంచు నొకం డొక ప్రక్క నేడ్వ, వే
ఱొకఁడు సుల్లకాలెనని యొక్కెడ నేడ్చినటులు, జనార్ధనా

మ. తనభక్తిన్ దినవాథునిం దనిపి సత్రాజిత్తు మాణిక్యముం,
గొనితే, నయ్యది సత్యకెంబెదవిరంగుం గల్గుటంగోరి, దెం
గును నీవ్వారక తెచ్చుకొంటివిగదా! గూ దెల్లగానున్న గూ
దను దెమ్మం చడుగన్ మఱేమియగు? నో దామోదరా శ్రీధరా

తే. గీ. ఓ హృషీకేశ, దెంగఁగానొప్పకొనెదో, మొడ్డఁగోసికొమ్మనెదో
యన్ పోల్కి సత్య పారిజాతంబు తేకున్న ప్రాణములను
విడుతునన్నఁ, దెచ్చితివది పుడమి కదిర! 51

తే. గీ. తాను వేడఁగా నరకవధం బొనర్చి తనివి మోమోటమును
లేక, యమరతరువుఁగూర్చి వజ్రినితో పోరొనర్చె కృష్ణ
ఒడ్డు గడప మొడ్డనుజూపు టున్నదెగద? 52

తే. గీ. గర్వమున బాణుఁ డధికుతోఁ గలనుకోరు కొనఁగ, నీచేత
బాహువులు కూలెగృష్ణ! గొప్పకుందొప్పికాలుచుకొనఁగ, వేగి
నంతకెరువునుమంటయు వన్నయట్లు

ఉ. చేతులు వేయి నీకగుటచేతనె మేటిమగండ వౌదె? వృ
ద్ధవ్రతల మం దొకించుకయు దెంగఁగఁజాలని యట్టి మొడ్డె యౌ
రా! తెగ బారెడంచు విన వా? యని యుల్లస మాడి సాణుఁడన్
శాతశరాళి నొంచితివి సారసలోచన, పాపమోచనా 53

చ. నినుఁ గని, శంఖచక్రములు నీవలెనే దరియించి, నీగతిం
గొనకను వాసుదేవుఁ డను నామము కద్దను పౌండ్రకుండిలన్
మును తెగటార్చె, నెమ్మివలె పూరుడుపిట్టయు గుడ్డు పెట్టఁ జొ
చ్చినయెడల పూకు బ్రద్దలయి చచ్చుఁ, జచ్చునుగాదె? యచ్యుతా

ఉత్సాహ

బిట్టు భక్తితోడ నిన్ను భీష్మముఖులు కొలచి క
న్నటి మోదమున రవంతయైన దానెఱుంగమిం,
దిట్టె సభను నన్ బురాణపూరుషా

పుట్టుకుంక యే మెరుంగు పోటునందు గల రుచిన్?

శా. పంతంబున్ విడు. నూరుతప్పులను గావచ్చెంజుమా, నిన్నిఁకన్
ద్రుంతున్ వే శిశుపాల హేయ వృత్త కాతులు పీకుకో. కంచెకా
యంతేలు కంతులు పుట్టుఁజుమ్మని యనంతా, నీవె వారించినన్
గంతులు మానని వాని పళ్ళెరమునన్ ఖండింపవే వింతగన్!

చ. మచ్చరమార నిన్ను బలు మాఱవమానమొనర్చు చైద్యుపై
దెచ్చెర పళ్ళెరం బొకటి చేతను గైకొని నీవు వేయగా
నచ్చెను వార జచ్చెనుగదా! గ్రహచారము చాల కున్నచో,
కచ్చను గల్గు మొద్దు భుజ గం బయి చంపును గాదె శ్రీహరి.

చ. మిగులగ గల్మియిత్తు వని మిత్రుడు రాగ, కుచేల, నాకు నీ
యగ గొని తెచ్చితే యడుకు? అంచు భుజించితి వౌర కృష్ణ! ఇ
ట్లొగురుచు దెంగుచుంటి, విపుడేమియొసంగెదొ? యన్న మెప్పుగో
ల్పగ, తలగుడ్డ యిత్తునని భావన చేసితి వన్నయట్లుగన్, 59

ఆ. వె. పిడికె డడుకులిచ్చి యడుగుల నొత్తించుకొని, కుచేలు డొందె
గొప్పతనము "పాత్ర డబ్బునిచ్చి, పత్తను జినుగంగ
దెంగు టిదె, కదా యనంగ జనక? 60

ఆ. వె. అల్ల సురేంద్రఖాండవము నగ్ని దహింపగ గోరి నిన్ను దా
దొల్లి సమాశ్రయించ, నరు తోడను పాయ మొసంగి, ఖాండవం
బెల్లను గాల్చ నీ వతనిని కీయగ లేదె యనుజ్ఞ? అత్త పూ
కల్లుడు దార పోసె నను నట్లుగ నాయె గదా గదాధరా!

ఉ. పుట్టము లొల్వ బుట్టములు పుట్టగ నీకృపచేత గృష్ణ. కిం
కెట్టులు మానభంగ మిపు డీ మెకు నే నొవరింప జాలుదున్!
పెట్టిన యంతయున్న యదె పెండిలి కూతుర, యన్నయట్లు క
ప్పట్టి నటంచు కౌరవు డుపాయము శోచక మానె శ్రీహరీ.

ఉ. హెచ్చుగ వద్దు, పాండవుల కేవురి కొ క్కొకయూర లెక్క నే
యిచ్చిన జాలు కౌరవ పతీ యని సంధిని నీవొసర్పగా
వచ్చిన ధిక్కరించి చెడె వాడు మొకల్ చెడి మొద్దు చేతికిన్
వచ్చినటుల్ ఘటిల్లెను దివాకరవిక్రము, యోత్రివిక్రమా.

ఉ. తల్లి సహోదరుండొకడు తప్పుతుడొక్కడు, నైన లోకమం

అల్లరి బావ గంసు, నరకాసురు, దున్మెంపవె? కృష్ణ, బంధువులం
దెల్లర గూల్చగా నరున విరాగికలు చెప్పుట బ్రహ్మే
తల్లిని దెంగు వట్ల పిన తల్లియు తప్పుసమానయే సుమా.

ఉ. తాతలు తండ్రు లన్నలును, దమ్ములు పుత్రులు తోడివారు జా
మాత లెదుర్చుటం 'దొలిస మర్తనె గూద' య లన్న రీతిగా
చేతుల విల్లు వ్రానుటకె? చిత్తము గొల్లని సవ్యసాచికిన్
గీత లుపన్యసించి మది ఖేదముఁ బాపితి పార్థసారధీ.

ఉ. దొంగతనంబునం బసుల తోఁకలకుం బసివాండ్ర జుట్లు లం
టంగనుగట్టి యల్లరి యొనర్చిన నీకు నృపాలకోటిలో
సంగర ముద్భవిల్లు నటు సల్పుట శ్రోత్రమె? పానిపాపకున్
దెంగులు నేర్పఁగా వలెనె? దీనజనావన, భవ్యజీవనా.

తే. గీ. ఈవు కురుయుద్ధమున జక్రిమెత్తననియు, శాంతవునిమీది
కెత్తితివే చక్రిహస్త? 'మాటలకు నాతుల కభేద' మాట,
మాటమంటివేమొ? నిల్పుకొన. నీకైన వశమె.

శా. "భంగిందెల్పెద ద్రోణుఁగూల్ప 'పడె నశ్వత్థామ' యంచంతమా
తందం బన్నని ధర్మనూనునకు బోధంజేసి, సత్యంబు మా
ర్చంగా నాతిడు బంత, నీవతనికో, శాస్త్రప్రకారంబుగా
దెంగం, బుట్టును గుక్కపిల్ల" లన లేదె? ధూర్తగోపాలకా. 68

చ. గదగొని భీమసేనుడును గాండివముంగొని క్రీడి నిల్వగా;
కదనమునందు నీ వెపుడు గాచెదు పాండవసేన గర్ణు పొం
దొదవుట జేసి గెల్వగ సుయోధను డూహయొనర్చె నద్దిరా!
ఇదె కద, 'బుడ్డనమ్ముకొని యేటను బడ్డ' విధంబు మాధవా.

క. తొలుతటిజన్మమునందుం జెలియలగు సుభద్ర సతిగఁ జేకొంటిగదా
బళిర! మనుమేఁ? నీకుఁ దలతమ్మఁడు, గుద్దబావ, తాండవకృష్ణా

ఆ వె. వనజభవునికైన వర్ణింపరాని నీమహిమయందుమాధమానసుండ
నెంత పొగడ నేర్తునేన్? దోమ దెంగఁగ నెంతపాడు కార నెంత! కృష్ణ

ఉ. నాకొలదిమది వనంతంబై కస్పడు నీదుమహిమ నంతయు నిలువం
జేకురునె, పిల్లిపూకున రోకటిఁ దూర్చి నట్టి రూపునఁ గృష్ణా! 72

క. ఆద్యుఁడ, విశ్వేశ్వరుఁడ, వత్యధికుడవు, నిన్ను గొల్వ బ్ర

పాన్న ద్యము రాళినేర్ప. రటులయ్యనుఁ బూర్వముగానిభక్తితో
ఉద్యమ మే నొసఁగ్చితిని నుల్లము నీకిడ, గొల్లిగిల్లినై
వేద్యము పెట్టికల్లు లరవిందదళాక్ష యెటుల్ గ్రహించెదో

క. ఘనుఁడ వగునీకు నేమదినయంబును సల్పు సేవయల్పమయినఁగై
కొనుమా, కొండంతటి దేవునకున్ సిండంతపత్రి పోల్కినిగృష్ణా

చ. కమలదళాక్ష నీపయిని కాంక్ష మదీయమనోబిసప్రసూ
నము నిపుడే సమర్పణ మొనర్పఁగ వచ్చితిఁ, బాపవాంఛిత
భ్రమరసమాకులం బగుటఁబట్టి గ్రహింపఁగ మానెదేమొ? పు
ణ్యమునకుఁ బూకొసంగునెడ, నాతులుగల్గుట కల్గి నట్లుగా

క. ఆత్మనొసఁగు వాఁడకె పరమాత్మా! మోక్షమని నీకు నర్పించితినా
యాత్మను, హాత్మేపైపా చూత్మేలవడాయటన్న చొప్పిదియెకదా?

క. చేతమున దైవభక్తి ప్రభూతం బగువేళ నిన్ను బోలిన దైవం
బితటి నాకులభించుట, అఁతులలోఁ దేనెపట్టి నట్లయ్యె హరీ 71

తే.గీ. ఎన్నడో నీపదధ్యాన మేను సలుపుచున్న, ప్రతినిమిషంబును
నన్నుఁబ్రోవడాయ రమ్మందు ఇచ్చుట డబ్బుగాని,
ద్రొబ్బుటొక జాము నరయు, నో తోయజాక్ష 78

క. దానతపోజపఫలములు, నెమ్మెనిపవిత్రత, యువస్థ మినహా కన్యా
దానంబు రీతి వ్యర్థములే, నీపదభక్తిలేనియెడలన్ గృష్ణా 79

మ. జనులీలోకపు దుచ్ఛసౌఖ్యముల నిచ్చంగోరి లుచ్ఛాప్రవ
ర్తనులైనన్ మఱవంగ, వాకలకు నంతం బందు రాకుండఁ ద
ప్పను జుమ్మక్షయమోక్షసౌఖ్యచయముల్ మాట్టోలికింబూకునా
కిన ముప్పావల కమ్మి చిక్కెడు భంగిన్ దేవకీనందనా 80

తే.గీ. నీదు సేవచే నాకు జనించుపుణ్య గణము చెడుఁ, జెడుకోర్కెలఁ
గలిగెడిఁ దురితములచే అవ్వతియు గంధంబు తాత
బుడ్డకున్ సరి యనియెడి పోల్కిఁ గృష్ణ 81

చ. అనుపమతావకాంఘ్రియుగళాధికచింతన బాపబుద్ధి నె
మ్మనమున బుట్ట దట్లయిన, మామకచిత్తమఘౌఘు మందునే
మునిగెను, గొడ్డుపోతునకు మొద్దులు దండుగ యన్న యట్టిరీ
తిని, పురుషోత్తమా, నను మదంగరుణించి, యఘాళి బాపమే

మ. "ఇది నాయింద్రియవర్గమట్లగుటచే స్వేచ్ఛన్ మెలంగింతు," నం
చు దలంపగను, బాపురే! విహితు డంచున్నీవు నెక్కించుకో
న్న, దిగంజారుచు గుద్ద దెంగె నను చం దానన్ బడంద్రోసె ను
న్మదలీల నన్నె మదింద్రియంబులు, ముకుందా, రమ్మిక న్దాప్పగన్

— స్వ గ్వి ణి —

దెంగుచున్నన్, సదా దెంగుచే, మాని వే
యంగ, లింగండు తె య్యంచు లొంగం డికే
భంగిగా నిల్చు నీ పైని నాయాత్మ? నే
"దెంగనా, మాననా దేవకీనందనా?

క. ఏటికి నిను దలవగ నఘు
కోటి దొలతు ననెడిబిగుదు గొంటివయో! మో
మోటుమునకు బోవగ, గడు
పౌ లొనుగనె? పాప వే మ దఘముల జక్రి? 65

— ర త్నా వ ళి —

మ. భవబంధంబుల యందు జిక్కువడి నే బాపంబులం జేసినన్
భవదీయాశ్రితరక్షణత్వబిరుదే పాడై చనన్ నీవు పా
పివిశేషంబుగ నంచు వీడకుమి నన్ పెండ్లాముపై గోవము
ద్భవిలన్ చుల్లన్ గోసికొన్నట్లు యశో దా. శ్రీయశో దాత్మజా,

ఆ.వె. "గుడ్డివాని కెపుకు మొడ్డమీదని లోక
మెటులో, యటులె జ్ఞాన దృష్టిలేని
నాకు బాపమంబె లోక మయ్యాంబికే
యునికి బోలెజూపు నొసగు కృష్ణ. 89

యాదవాన్వయాంబోధిచంద్ర, చంద్రాభనిర్మలయశస్సాంద్ర
నాదు మానసంబున బుట్టిన యజ్ఞానము పోవ్రట దుర్లభహా
"గూదకు రాసిన యారికతవుడున్ గుంజినన్ వదల" దనురీతిన్

నీదయాప్రవాహమున నెపుడు నానిచి, యేగతి దోలగించెదవో?

ఉ. చాల నఘాళి నామనము స్వల్ప దొడంగగ, నింద్రియంబులన్
వీలగు నంత దోడుపడి వెంటనె వర్తిలు ఉత్తమంపుటి
ల్లాలెప్పుడైన నూరు వెడ లంగనె, యూరిని గల్లుచుల్ల ల
బ్బాలకు సారికావడుల భంగిని వచ్చును గాదె యచ్యుతా.

ఆ.వె. ఒడలు సోమరితన మొందింప మదిపాప
చింతగొలుప, నీదు సేవ మరతు
కుక్క గూడ పట్టుకొని లాగ, అత్తయు
సిగను బట్టిలాగు పగిది కృష్ణ. 91

ఉ. అంబుజనాభు నందు మన మా, వినయంబునుబూను, మన్న స
త్యంబుగ ధూర్త లక్షణమ దంచును బూనదు డెంద, మేమిక
ర్మంబొకో సాదుతాగ్రిగర సమాదిగ యన్నసహించదమ్మయాం
బం బొవరించు న న్నలు కృ పన్ వినయం బొనగూర్చు శ్రీహరీ.

శా. ఊహాతీతము నీమహత్త్వమది య త్యుత్కృష్టమే యైనను
సాహంకారులు దేవతాధముల మా హాత్మ్యంబె వర్ణింతు రెం
తే హాస్యంబున! మాచకమ్మ చనుదో యిం గాంచి సన్యాసిగా
డాహా! చంకలు గ్రుద్దుకొన్న గతి సత్యాచిత్తసత్యప్రియా. 92

తే. గీ నీకు నన్యదైవతముల కే కరసిని
పోల్క గలుగంగ నేర్చును? బూతుపిల్లి
గడ్డకు మరి గాడిద మొడ్డకు నెట్లు
సామ్యమగు వార్ధిశయన యో జలజనయన. 93

ఉ ఇచ్చనుగోరు వాంఛితములెల్లను దైవతధేనువట్లుగా
నిచ్చలునిచ్చునిన్ విడిచి, నీచులు పైబడి బాధపెట్టగాం
జొచ్చెడి క్షుద్రదేవతల జూచి భజించెద రో ముకుంద, పా
లిచ్చెడి యావు నమ్మి పయికెక్కుచు దెంగెడియెద్దు గొన్నటుల్

ఆ. వె. ఆతనుజనక పాపతతిం బాపుకొన నీదు
సేవలేదె, క్షుద్రదేవసేవ

గాసిలంగ నేల? క త్తిలేదే యీశ
కొలుకు పూకుకాల్చుకొనఁగనేల?

తే.గీ. దేవదేవ, చిన్నాలును లేవు, సాతి
కలుములేవు! సిండను నీళ్ళైకారె నన్న
భంగిక్షుద్రదైవముల గొల్వంగ ముక్తి
యీరు సిరి యీరు మదిక్షోభయే ఫలంబు 96

ఉ. ఏ కడనేనిరౌద్రగుణమే వహియించిన క్షుద్రదేవతా
నీకములన్ భజించినను నిక్కముగాఁ దమరౌద్రభావమే
కాక మ జేమి చూపుదురు? కంసవిమర్దన, యోజనార్దనా
పూకునుబూజసేయుటకుఁ బోయిన నిత్తునెచూపు నత్తఱిన్

చ. అసదృశభక్తిపన్ శ్రితజనాళిని బ్రోచెడి నీకునల్ప పూ
జ సలుపఁ, దృప్తిగాంతు, వుపచారశతంబుల క్షుద్రదేవతల్
పినరును నంతసంపడరు, పెట్టనిపోయని యన్నుగండె పి
త్తసిరుగ చెంగుచుందును గదా! మురళీధర. రామసోదరా

క. నినువమ్మితినావున, నా
మనమున నుగుణములకొలుకు, మాటికి వెదుకం
జన దో కౌస్తుభధర, యా
"స్తసిశల్యపరీక్ష" కాఁగఁ జాలదుటనుమ్మీ. 99

ఉ. నా మన సెట్టి దుర్గుణగణంబులతోడను నిండియున్న, న
న్నోముదు ల క్ష్మి నీవుఁ, దనయుం దలిదండ్రులువోలె నెంతయుఁ
బ్రేతు, స నా ర తంబుమిమువీడకయుండెదఁ "కుక్క టెంక" నాన్
స్వామి, నృ సి ం హ పుణ్యపురుషా, దయాపయోనిధీ.

స ర సో క్తి యు క్త

శ్రీ కృష్ణ శతకము

సం పూ ర్ణ ము

# ర సి కా భి లా ష ము



గ్రంథకర్త:
కవిసార్వభౌమ
నా థుఁ

# పీఠిక

పూర్వకవీంద్రులచే రచింపఁబడిన గ్రంథము లింక నెన్ని యెన్ని యెక్కడ నెక్కడ నడఁగియున్నవో యెవరి కెఱుక! ఈవైశాఖమాసమున మాబంధువులలో నొకరి యింటనైన వివాహమునకు సింహాచలపుటడివారమునకుఁ బోయి యుండి యక్కడనొక శ్రీవైష్ణవ గృహస్థునింట బ్రాఁతతాటియాకుల బొత్తములను దిరుగవేయుచుండ నాకు "రసికాభిలాషము" అను నీచిన్నిపొత్తము లభించినది. కవియెవరో తెలియుట. "వీధినాటకము" కూడ దీనితోఁ గలసి యున్నందున శ్రీనాథుఁడాయని యనుమానించి, కవితాశైలియుఁ గల్పనాప్రౌఢిమయు శృంగారరసవిస్తరతయు నాయనుమానమును బలపఱుపఁగాఁ జివరనుజూచి, గద్యము లేకపోయినను దుదిపద్యము చక్రబంధమగుటఁబోల్చి, యందు "శృంగార శ్రీనాథ" యను పేరేర్పడుటచే శ్రీనాథుని గ్రంథ మేయని సిద్ధాంతము చేసితిని, గ్రంథమంతయు సావకాశముగాఁ జదివిన వెనుక 38, 39, పద్యములవలన మిగిలిన కొంచెము సంశయమును నిర్మూలమైనది. శృంగారమన్న విషప్రాయముగాఁ జూడవలయునని చెప్పు నిప్పటియాంధ్రులకు శృంగార భూయిష్టమగు నీపుస్తకము రుచింపమి విదితమే. కావున దీనిని బ్రచురింపఁగూడదని మొదట నిశ్చయించితిని. శ్రీనాథకవి యంతటివాని గ్రంథముల లోకమున వెల్లడిచేయుటకుఁ జేయకపోవుటకు నొకరియిష్టము కాదనితలఁచి తుదకుఁ బ్రచురింప నిశ్చయించి విశాఖపట్టణమునందలి శ్రీశారదాముకుట ముద్రాక్షర శాలాధికారులగు మ. రా. రా. విన్నకోట అప్పలనరసింహ శ్రేష్టిగారికి జూప వారు దానిని దామే ప్రచురింపఁ గోరి తీసికొనిరి. దీనిని నవీన కవియే యొకఁడు రచించి ప్రచురించినచో విమర్శకు లెట్లు దూషించియుందురో దేవునికే తెలియును!

శ్రీనాథుని వీధినాటకము లోకమునఁ బ్రచురమయ్యు నీరసికాభిలాషము కానందులకుఁ గారణము లేకపోలేదు. ఇందుఁ గవి యుద్దేశించిన నాయిక గొప్పరాజులయింటిదనుట నిశ్చయము. 8 వ పద్యమునందలి "యందని మ్రానిపండు" నను మాటయు, 49వ పద్యమునందలి 'భోగినీముదిత' ననుమాటయు దానికి నిదర్శనములు. శ్రీనాథునికి కోరిక తీఱినట్లు కాని తీఱు ననునాసయున్నట్లు కాని యెక్కడను గనఁబడదు. ఈమె యెవతెయో! యెక్కడిదో? కన్య కాదని 21 వ పదమునదలి "పరకాంత నిన్ను" ననుమాటయు, జారచింత గలదని 19 వపద్యమునందలి "భుజంగుల పాలౌ, ననుమాటయు దెల్పుచున్నవి. రసికుఁడగు శ్రీనాథుని యభిలాషమేమయ్యెనో?

"కవిసార్వభౌముఁ"డని సార్థకబిరుదము గాంచిన శ్రీనాథుని కవిత్వముఁ గూర్చి నేనిక్కడ వేఱుగాఁ జర్చింపవలసిన యవసరము లేదు. అయినఁ గవి దీని నెట్టి వయసున వ్రాసినాఁడో యాలోచింపవలసియున్నది. ఈతఁడు యౌవన దశను స్త్రీలోలుఁడై విచ్చలవిడి దిరిగెనని చెప్పుదురు. ఆకాలమున నే వీధినాటకమునందలి పద్యములఁ జెప్పెననియు వాడుక, రసికాభిలాషముకూడ నప్పటిదే అయినచో నది నూనూఁగు మీసాల నూత్నయౌవనమున"నే విరచింపఁబడియుండును అయిన నొక్క బాధకమున్నది. 89వ పద్యమునఁ " కవిసార్వభౌమని" పదము వాడఁబడి యున్నది. ఈబిరుదము శృంగారనైషధము వ్రాసిన వెనకనే యాతనికి రాయలచేత(?) బాదుకొల్ప బడినట్లువిందుము. ఈపద్యము తరువాతఁ గలుపఁబడినదేమో!

రసికాభిలాషమున శ్రీనాథుడు తెచ్చిన కల్పనలను కొన్నిటిని జూర్వకవు లలోఁ గొంద ఱిటీవల నుపయోగించిరి, అందుచేత వారిలోఁ గొందఱియొద్దనైన నీగ్రంథ ముండెనని తోఁచుచున్నది. ఎందఱు శ్రీనాథుని కల్పనల దొంగలించిరో, యెందఱికిఁ గ్రొత్తగా నాతని యూహాలే తట్టినవో చదువరులే నిర్ణయించుటకు వానినిక్కడఁ జూపిం చుచున్నాను.

i కూచిమంచి తిమ్మకవిని నడివీథిలోఁ గౌగలించిన వృద్ధవేశ్య

"చ. చతురులలోన నెంతయును, జాణ వటంచును నేను కౌగలిం
చితి, నిటుమాఱుమో మిడఁగఁ జెల్లునె యోరసికావతంస!"

యన్నప్పుడు "అ
ద్భుత మగునట్టి బంగరపు, బొంగరపుంగవఁ బోలు నీకుచ
ద్విశయము తొమ్మునాటి యల, కింపున దూసెనటంచుఁజూచితిస్"

అన్న ప్రతి వచనముయొక్క సమయస్ఫూర్తి నెంతమునగదా! ఇందలి 29 వ పద్యముఁ జూడుడు.

ii తాను బ్రక్కనుజేరగా మొగముఁ ద్రిప్పి పన్నుండిన వేశ్యగూర్చి కాములింగఁడన్న

"మ. కరబింబాధరముం బయోధరములు, న్వక్త్రాళికంబు ల్మనో
హరలోలాక్షులుఁ జూప కవ్వలి మొగం, బైనంత నే మాయె? నీ
గురుభాస్వజ్జఘనంబుఁ గ్రొమ్ముడియు మాకుంజాలవే? యంగక
ద్దరి మే లిద్దరిఁ గీడు నుంగలదె?, యుద్యద్రాజ బింబాననా!"

అను పద్యమునందలి భావము దీనిలోని 40 వ పద్యములోనిదే, ఇందు "సౌందర్యం గంగాఝరి, యని చెప్పి యంతకుల కనుగుణ్యముగా భావమంతయు నడు పుట విశేషము.

iii "సీ. బింబోష్టియని నీవు, పెనఁగ రాకు కుశంబ!
సాంకవగంధి యాపంకజాక్షి"

యను రసికజనమనోభిరామమునందలి పద్యము చాలకఱ కిందలి 8 వ పద్యమును బోలును.

iv రంభాద్యప్సరస కాంతలనామములు తారాశశాంకాది ప్రబంధముల శ్లేషింపఁ బడుటకుఁ బూర్వమే యిందలి 46 వ పద్యమున నట్లుపయోగింపఁ బడినవి.

v మనుచరిత్రలోని "మీాటినయంత నిచ్చు చనుమట్టు" లను మాటయు విజయవిలాసములోని "మీాటిన విచ్చు చనుదోయి" యనుమాటయు క్రొత్తది కావని యిందలి 6వ, పద్యము తెలుపును.

vi. ఆలాగున నే "జగతి నెంతటి యుపకారి శంబరారి' యన్న విజయ విలాస పద్యభాగము దీనిలోని 11వ పద్యముననున్న "యుపకారియగుంగద శంబరారి!' యను ।దానిని జూచి వ్రాయఁబడినదా యనిపించును,

నాకు లభించిన ప్రతి మిగులఁ బ్రాఁతదైనందునఁ గొన్నియెడలఁ జినింగి పోయినది అట్టిచోటులఁ బోయిన మాటలను నేనే పూరించితిని. అట్లుకల్పఁ బడిన భాగము లేవో శ్రీనాథవిరచితభాగము లేవో శైలులవలన దెలియుట సులభముగాన వానిని వేఱువేఱుగా జూపలేదు.

దీని ప్రతి మఱియెవ్వరియొద్దనైన నున్నచో నాకు బంపినయెడల రెండవ కూర్పునందైన నిందలి లోపముల సవరింతును.

విశాఖపట్టణము. సెట్టి లక్ష్మీనరసింహము. బి. ఎ.
1. ఆగస్టు 1905 రుక్మిణీకల్యాణ నాటకగ్రంథకర్త.
మిసెస్సీవియన్ కాలేజిలో నుపాధ్యాయుడు.

## కృతివిమర్శనము

రసికాభిలాషము—ఇది యొక్కటే యాశ్వాసముగల చిన్నప్రబంధము. ఈపుస్తకము విశాఖపట్టణనివాసులు రుక్మిణీకల్యాణ నాటకగ్రంథకర్తలు పట్టపరీక్షయందు కృతార్థులు నగు మ.రా.శ్రీ. సెట్టి లక్ష్మీనరసింహముగారి పీఠికతో పిన్నకోటఅప్పలనరసయ్య శ్రేష్టిగారి శారదామకుట ముద్రాక్షరశాలలో ముద్రితమయి ప్రకటింపబడియె. ఆసెట్టి లక్ష్మీనరసింహముగారు కడచిన వేసంగి సెలవులలో బంధువులయింట వివాహము నిమిత్తము సింహాచలపుటడి వారమునకు బోయి యుండగా నక్కడ నొక శ్రీవైష్ణవుని గృహములో నీపుస్తకము వారికి లభించినదట. ఈగ్రంథము శ్రీనాథుని వీధినాటకముతో గలసి యొక్క తాటియాకుల పుస్తకముమీద వ్రాయబడి యుండుటచేతను గ్రంథాంతమున చక్రబంధ పద్యమందు శృంగార శ్రీనాథ యనునామము గనంబడుటచేతను గవిత్వముకల్పనలు రసవంతముగ నుండుటచేతను గద్యములేకపోయినను శృంగార నైషధము, కాశీఖండము, భీమఖండము, హరవిలాసము రచియించిన మహాకవి శ్రీనాథుడే దీనిని రచియించెనని యాలక్ష్మీనరసింహము గారు పీఠికలో సిద్ధాంతముచేసిరి. కాని యాసిద్ధాంతము మాకంత యుక్తియుక్తముగ గనబడలేదు.

మే మెన్నిసారులు వారిపీఠికను మూలగ్రంథమును శ్రద్ధతోఁ జదివినను శ్రీనాథుఁడీగ్రంథమును రచియించియుండఁడనియు విషయాసక్తుడయి పడుచు తనపు గర్వముచేత నోడ లెఱుగక తిరుగు ధూర్తవిటు డెవండో తనదుపాండిత్యము మెరయ నీపద్యముల నల్లియుండవచ్చునినియు మాకుం దోచుచున్నది. ఇట్లు మాకుందోచుటకు గల కారణముల గొన్నింటి నీక్రింద నుదాహరించుచున్నారము. గ్రంథాంతము నందు గద్యముగాని గ్రంథారంభమునందు కవివంశాదులు కాని లేవుగదా? అందుచేత పైన మూహాలుచేసి కవిపేరు కనుగొనవలయు ననుట స్పష్టము- చివర చక్రబంధములో నేర్పడు శృంగార శ్రీనాథ పదముల చేత శ్రీనాథుడే గ్రంథకర్తయని మన మూహింపదగదా? అట్లూహింప వీలులేదు- శ్రీనాథునకు శృంగార శ్రీనాథుడని యొక్కడను ప్రసిద్ధిలేదు- శృంగారమువారు శృంగారకవివారు తెనుగు దేశమందు వైష్ణవులలోను నద్వైతులలోను ననేకులున్నారు- వారిలో నెవరయిన శ్రీనాథనామము గలవాడొకడుండవచ్చును- అతడే తనదునభిలాష బహిరూపకముగా బయటికి వెల్లడించి

యుండవచ్చును. అంతియేకాని కమలనాభామాత్యపౌత్రుడు. మారయామాత్య పుత్రుడు నగు మహాకవి శ్రీనాథుఁ డీగ్రంథకర్తకాఁడు, అదిగాక శ్రీనాథుని గ్రంథము లన్నిటినుండి తన లక్షణగ్రంథమునకు లక్ష్యపద్యములను దీసికొనిన యప్పకవిగాని కూచిమంచి తిమ్మనామాత్యుఁడుగాని యడిదము సూరకవిగాని మఱి యితరలాక్షణికు లెవ్వరు గాని యీగ్రంథము పేరయినఁ దల పెట్టకుండుటకుఁ గారణ మేమి? ప్రాచీన మహాకవుల కెవ్వరికిం దెలియని యీగ్రంథము నేఁడుకొత్తగా శ్రీనాథునిదని యొకరు చెప్పినంతమాత్రమున జను లొప్పుకొన వచ్చునా?

ఆకారణముల నటుండనిచ్చి యిందు ప్రశ్నింపఁబడిన యంశమును విచారింతము. ఒక రసికుడు వివాహితయయి భర్తతోఁ గాపురము చేయుచున్న యొక కులకాంతను మోహించి నఖశిఖపర్యంతము నామె సకలావయవముల వర్ణించి యామెతో గూడినట్లు స్వప్నములఁ గాంచి యాస్వప్నములఁ దలంచుకొనుచు విరహతాపము నొందుచు నామె చక్కఁదనముదలంచి యూట లూరుచుండుటయే యిందలి కథాంశము. పరకాంత, కన్యయైనఁగాదు, వేఱొకనిభార్యయగు దానిని వలచి, వంచినందులకు సిగ్గువడక పైపెచ్చు బూతుపద్యముల వ్రాసి శ్రీనాథుఁడు విరహతాపము పొందెనని చెప్పుట పరమభాగవతోత్తముఁడు నైష్ఠికుఁడు నగు శ్రీనాథునికీర్తి పాడుచేయుట, శ్రీనాథునకే గాదు, ఈపద్యములు తనవని యెవఁడు చెప్పుకొనునో వాని కప్రతిష్ఠయే గాని ప్రతిష్ఠ కాదు, అందుచేతనే కవి గ్రంథమునందు మొదటనైన జివరనైన తనపేరు విస్పష్టముగ వేసికొనుటకు సిగ్గుపడియెను. మఱియుఁ జక్రబంధమునందున్న శృంగార శ్రీనాథపదములు కేవల మొక పురుష నామమును దెలియఁజేయవు శృంగార శ్రీయనగా శృంగారలక్ష్మి. దానికి నాథుఁడు శృంగార శ్రీనాథుఁడు గ్రంథము దుర్నీతిభోధకమగుటచేతనో మఱియెందుచేతనో కవి గద్యవేసికొనుట మానినప్పుడు తనపేరు వేరువిధముగాఁ దెలయఁజేసికొనుట కిష్టపడునా? ఇష్టపడకపోవుటచేతనే తానొక శృంగారనాయకుఁడ ననుమానము మాత్రము సూచించెను. అందుచేత నది యొక మనుష్యునిపేరుగా గ్రహించుటకు వీలులేదు. శ్రీనాథునకుఁ గవిసార్వభౌమ బిరుద మున్నదనియు నాపదమిందుఁ బ్రయోగింపఁబడుటచే నతఁడే దీనిని రచియించెననియుఁ బీఠికలో వ్రాయబడినది. కవిసార్వభౌమ బిరుదమ నేకులకుగలదు. కూచిమంచి తిమ్మనామాత్యునకు లేదా? ప్రతికవియు నాలుగుపద్యము లల్లినతోడనే తాను కవీశ్వరుఁడ ననియుఁ గవిసార్వభౌముఁడననియు బుస్తకములలో బ్రయోగించుకొనుచుండును. కావున కర్తృత్వము శ్రీనాథున కారోపించుట కదియొక కారణముగాదు.

ఇందుపద్యముల శైలియుఁ గవిత్వచాతుర్యము నించుక శోధించిచూతము, కల్పన లెక్కఁడనోగాని తరచుగాఁ బ్రౌఢముగాలేవు శైలియు శ్రీనాథుని శైలితో

నెంతమాత్రముం బోలదు. శ్రీనాథుని గడుసుతనపు పోకడ లిందెక్కడను గాన రావు, అదియునుంగాక యీ గ్రంథ మాధునికుఁ డెవ్వఁడో రచియించెనని స్పష్టముగ చెప్పుటకు తగిన యుదాహరణములు కొన్ని కానఁబడుచున్నవి. పదునేనవ పద్యమునందు "తయారుగానె తగు" నను పదమున్నది. తయారన్నది తురక మాట గాని తెలుఁగుమాట కాదు. ప్రాచీనకవు లెవ్వరును ముఖ్యముగ శ్రీనాథుడు నిట్టి పదముం బ్రయోగించినట్లులేదు. ఇట్లే నలుబదిమూడవ పద్యమున 'ఖయిదు బాహుపాశములఁ గట్టవే,' అని యున్నది. ఇదియును శ్రీనాథాది ప్రాచీనులు ప్రయోగింపని హిందూస్థానీ పదమే. పంతొమ్మిదవ పద్యమునందు 'నాకుంగూడ నాభాగ్యమెట్టుల నేనాఁటికి గల్గునో' యని యున్నది. 'నాకుంగూడ', ఇట్టి ప్రయోగము లాధునికుల గ్రంథములలోనే గాని ప్రాచీనుల గ్రంథమునందుఁ గానఁబడవు. ఇందు 'గూడ' యను పదము సముచ్చయార్థమగు 'ను,' వర్ణకమునకు బదులుగ నాధునికులు ప్రయోగించుచున్నారు. ముప్పదినాలుగవ పద్యములో లజ్జిలినాఁట యని యున్నది, లజ్జిలినాఁడ నని యుండవలయును గాని నాను యని యుండుట పొసఁగదు. ఇట్లు శ్రీనాథుడు ప్రయోగింపడు. ఈ పుస్తకము నందలి నేఁబది పద్యములలో నిట్టి వింకం గొన్ని యున్నవి. గ్రంథవిస్తరణభీతిచేత నిచటను దాహరింపక యుంటిమి, పూర్వోదాహృతము లయిన ప్రయోగములంబట్టి చూడ నీగ్రంథ మెవఁడో నవీనుఁడు రచించి యుండవచ్చును గాని శ్రీనాథాదులగు ప్రాచీను లెవ్వరును రచించియుండరని నిశ్చయముగ తోఁచుచున్నది. సెట్టి లక్ష్మీనరసింహముగారు వ్రాసినపీఠికలో శృంగార మన్న విషప్రాయముగఁ జూడవలయునని చెప్పి నిప్పటి యాంధ్రులకు శృంగార భూయిష్ఠమగు నీపుస్తకము రుచింపమి విదితమే యని యొక చోటను, దీనిని నవీనకవియే యొకఁడు రచియించి ప్రకటించినచో విమర్శకు లెల్ల దూషించియుందురో దేవునికే తెలియునని వేరొక చోటను వ్రాసిరి. ఈనాటి యాంధ్రులలో నెవ్వరు శృంగారమన్న విషప్రాయముగ జూచుటలేదు. శృంగారము పేరుపెట్టి యిచ్చవచ్చినపచ్చిబూతులు వ్రాసినవారి కబ్బముల నీనాటి వారు విషప్రాయములుగ జూచుచున్న మాట నిశ్చయమే. శృంగారరసమునకు నాగరికులు జనువ సిగ్గువడు మృదువు దప్పిన వాక్యమునకు భేదము తెలిసికొనలేక యీ లక్ష్మీనరసింహముగారిట్టి వెఱ్ఱివ్రాతలు వ్రాసినందుకు మేము తద్దయు విచారించుచున్నారము - కాళిదాసాదులగు సంస్కృతకవులు కవిత్రయము నాచన పింగళి సూరన్న మొదలగు తెలుఁగుకవులు శృంగారరసము వర్ణింపలేదా? ఆశృంగార రసము నీనాటి యాంధ్రులాదరించుటలేదా? పురుషులయెదుటం జదివి తలవంచుకొనవలసిన బండబూతులుగల కావ్యము గాని రసము శృంగారరసము గానేరదు- ఇట్టి గ్రంథముల నాదరించుట నాంధ్రభూమిలో విమర్శకులుం జేయరు, ప్రాచీనులు రచియించి

నంతమాత్రమున నిది వంద్యముగాదు. నవీనులు రచించినచో నింద్యముగాదు. బూతు లెప్పుడు నాగరికదూష్యములే యగును. సెట్టి లక్ష్మీనరసింహముగారు తాము పీఠికలో వ్రాసిన యుక్తిప్రతిఘాతము లనుకొని శ్రీనాథుఁడే యీ గ్రంథకర్తయని సిద్ధాంతముచేసి తెనాలిరామకృష్ణుడు, చేమకూర వెంకటకవి, కూచిమంచి తిమ్మకవి, ఆంధ్రకవితాపితామహుఁడు మొదలగు మహాకవులందరు నేబదిపద్యములకంటె నెక్కువలేని యీబూతుల ప్రబంధములోనుండి కొన్నికల్పనల దొంగిలించినారని వ్రాయుక సాహసించిరి. ఈగ్రంథము మూల పడక దొరకక ప్రకటించిన సాహసమే తాము యీసాహసములు గూడ చేయవలయునని తెలియుకున్నయది. ఆమహాకవు లీగ్రంథమునుండి తొలగించినారనుటకంటె నవీనుఁ డెవ్వఁడో యీగ్రంథము రచించి మంచి కల్పనలు తోఁపమి నీగ్రంథచౌర్యమునుజేసి యుండునన్న బాగుండును. గ్రంథము ప్రాఁతదగుటచేఁగొన్నితావులయందు శిథిలము కాఁగా సెట్టి లక్ష్మీనరసింహము గారక్కడక్కడ నాయాభాగములు తాను బూరించితి నని యును శైలులం బట్టి భేదములు తెలియును గనుక నట్టిభాగములకు గుర్తులు వ్రాయలేదని పీఠికలో తెల్పియుండిరి. మాబుద్ధికిఁ జూడ గ్రంథమంతటను నొక్క శైలియే కనబడుచున్నది గాని వేర్వేరు శైలులు కనఁబడుట లేదు. కవిత్వశైలిం దెలుపుట కిం దుదాహరింపవలసిన మృదువయిన పద్యములు లేకుండుటచే మానితిమి.



# ప్రతివిమర్శనము



రసికాభిరామము—శ్రీమనోరమాపత్రిక 1907 సం॥రం ఆగస్టునెల సంచికలో ప్రబంధమునుగూర్చి వ్రాయఁబడినవిమర్శనమందు శృంగారనైషధాదుల రచియించిన మహాకవి శ్రీనాథుఁడు రసికాభిరామము రచియింప లేదని వాదింపఁబడినది. అందులకీఁబడిన హేతువు లెంతయుక్తియుక్తములో యీ క్రిందుగ విమర్శింపఁబడుచున్నవి.

**i** చివర చక్రబంధములో శృంగారశ్రీనాథనామ మేర్పడుచున్నదను మారయామాత్య పుత్రుఁడగు శ్రీనాథునికి శృంగారనాథుఁ డను ప్రసిద్ధి లేదు గనుక నితఁడు వేరు కవి యఁట! చక్రబంధములో నాయక్షరముల నామమే యిముడ్చ వలయును గాని యింతకంటె నెక్కువగాఁ గాని తక్కువగాఁ గాని వలను పడదనుట బంధకవిత్వము చేయు వారికందరకుఁ దెలిసినవిషయమే కావున శ్రీనాథపదమునకు ముందు మూడక్షరములు చేర్పఁబడవలయును. నైషధమునకు శృంగారనైషధమని పేరు పెట్టియుండుటచే శ్రీనాథునికి శృంగారపదముపైగల నభిమాన మైనదని స్పష్టము గదా! అదిగాక తాను వ్రాయుచున్నది శృంగారభూయిష్ఠము తానొక ప్రసిద్ధుఁడగు శృంగార నాయకుఁడు. అందుచేత "శృంగారశ్రీనాథ" మని వాడియుండఁగూడదా? తక్కిన కారణముల వలన శృంగార నైషధ గ్రంథకర్తయే రసికాభిరామ గ్రంథకర్త యని తేలుచున్నదె మొదల శృంగార శబ్దమున్నదన్న హేతువుచేతనే యనుమానించుట కూడునా? శృంగార శ్రీనాథపదమునకు శృంగార శ్రీనాథుఁడు. శృంగారనాయకు డని యర్థము స్ఫురించుచున్నదని విమర్శనమందు సెలవీఁబడినది. అల్లుతన నామమును శ్లేషించుటయే శ్రీనాథుని యభిప్రాయమేమో అట్లయి యుండునవియే శ్రీనాథప్రణీతము మాత్రమే యని కాక ముఖపత్రము మీఁద శృంగారశ్రీనాథప్రణీత మని యచ్చొత్తింపబడినది. అదివిమర్శకులు తిలకించిరా? కారణమేమని యూహించిరి లేక తెనుఁగుదేశము లోని శృంగారమువారు శృంగారకవివారు మొదలగునింటి పేరులవారిని వైష్ణవుల యందు నియోగులయందు నెవరుచుఁ గూరుచుండిరంచున వీరికి ముఖపత్రమును జూచుటకు నావకాశము లేకపోయునా? ప్రౌఢకవి మల్లన్న యన్న పేరు విన్నయెడల వీరలు ప్రౌఢమువారు ప్రౌఢకవి వారు వైదికులయందు ద్రావిడులయందుఁ దెలుఁగు దేశమునందుఁ గానవచ్చుచున్నారని వ్రాయుదురేమో!

**ii** కవిసార్వభౌమ బిరుదము రసికాభిరామమున బ్రయోగింప బడినను

సహితము ప్రయోగింపఁబడినదే. ఈరెండును గలసి యాలోచించినచో నీగ్రంథము శ్రీనాథునిదన్న యూహాపరిరింత బలము కాదా! ఆసంగతిగూర్చి విమర్శకు లేల సన్న సన్నగా నూరకుండిరి! తమవాదమునకు విరుద్ధముగా నుండు దానిని విడుచుటయా విమర్శకలక్షణము! కవిసార్వభౌమబిరుదము మనేకులకుఁ గలదట! శ్రీనాథునికిని గూచిమంచి తిమ్మన్నకవికిని గాక యితరులకెవ్వరి కున్నదో విమర్శకులు సెలవిచ్చిన వినెదము. కవిసార్వభౌమబిరుదమును శ్రీనాథనామమును గలిసి ప్రయోగింపఁబడుటచే మనము కూచిమంచి తిమ్మనను విడిచి శ్రీనాథునినే తీసికొనవలసి వచ్చునుగదా? ప్రతికవియు నాలుగుపద్యము లల్లినతోడనే తాను కవిసార్వభౌముఁడనని పుస్తకములలోఁ బ్రయోగించుకొనుచుండునట? ఈవిమర్శకులు నాలుగుపద్యములు అల్లియుండిరేమో? కవిసార్వభౌములమని పుస్తకములలోఁ బ్రయోగించుకొనిరా! పోనిండు. విమర్శక సార్వభౌములమని యైనఁ జెప్పికొందురా? వారు గాక పోయిన, నట్లు ప్రయోగించుకొనిన వారిపేరులు కొన్ని సెలవిచ్చెదరా! నాగను శాసన ప్రబంధ పరమేశ్వరాంధ్ర కవితాపితామహాది బిరుదములుగూడ నాలాగునే యితరుల నుపయోగింపఁబడెనా! మరియొకటి. గ్రంథము దున్న అబోధకమగుటచేతనో మరియెందుచేతనో కవి గద్య వేసికొనుట మానినందున మరియేవిధముగాఁ గూడ నతని కర్తృత్వమును తెలియఁజేయుట కిష్టపడి యుండడని వీరి నిష్ఠాగా చేయుచున్నారు. కవి గద్య వేసికొనుట మానెనని యెవ్వరికిఁ దెలియును? ఇప్పుడు లభించిన ప్రతిని వ్రాసికొనినవాడు గద్య విడిచిపెట్టి యుండవచ్చును. గద్య వేసికొనలేదు పో, రసికాభిరామము గద్యావసర మున్నంత పెద్దగ్రంథము? వీథినాటకమునకుఁ గవియే గద్య వేసికొనెను! మన్నీలబోధక మని మానెనన్నచో, గూచిమంచి జగ్గకవి తన చంద్రరేఖావిలాపము మన్నీలబోధక మనియే కాబోలు దానియందుఁ గద్య వేసికొనెను.

iii శ్రీనాథుని గ్రంథము లన్నిటినుండి తమలక్షణ గ్రంథములకు లక్ష్యపద్యములఁ గైకొనిన యప్పకవి మొదలుగు లాక్షణికులు రసికాభిరామము పేరైనఁ దలపెట్టి యుండుటకుఁ గారణమేమని విమర్శకులు ప్రశ్నించుచున్నారు. వీరు లాక్షణికుల మూలము గ్రంథములో నెన్నియో తారుమారు చదివినట్లు! అనగా. గ్రుడ్డిసారము డెబ్బదిపదునొకండు మారులు చదివినను తెలివిలేని విద్యార్థికది యెట్లు పనికివచ్చును” శ్రీనాథుని వీథినాటకము లోకమునఁ బ్రచురమయ్యె. రసికాభిరామము కానందులకు గారణము లేకపోలేదు. ఇందుఁ గవి యుద్దేశించిన నాయిక గొప్పరాజుల యింటిదనుట నిశ్చయము” అని పీఠికలో స్పష్టముగాఁ దెలుపఁబడి యుండఁగా. వీరి కుశంకకింక నవకాశమేది? అదియేల వీరుచూడరైరి! చూచినచో నేల ఖండింపరైరి! వ్రాసినది తిన్నగాఁ జూచి యర్థము చేసికొనగలశక్తి వచ్చిన వెనుకనే విమర్శనముల వ్రాయుట మంచిదేమో. పోనిండు కారణము చెప్పఁబడలేదే యనుకొందము

అయినను దశలక్షణ గ్రంథముల చెప్పకవ్యాదులు పద్యము నుదాహరింప మానినంతనే పూర్వగ్రంథముల గూర్చియను మానము పడుటకూడునా! మనుచరిత్ర, పండితారాధ్యచరిత్ర, శాలివాహన సప్తశతి, పల్నాటివీర చరిత్ర, యనుగ్రంథములనుండి మాత్రము నాయుదాహరణముల గైకొని గ్రంథసూత్రము చేసితివని శ్రీనాథునివి కావనుచున్నామా? భోజరాజీయము, విజ్ఞానేశ్వరీయము, మార్కండేయపురాణము, ప్రబోధచంద్రోదయము, కువలయాశ్వచరిత్రము, భానుమతీపరిణయము మొదలగు నెన్ని గ్రంథముల నుండి యప్పకవి మొదలగువారి పద్యము లుదాహరించుట మానలేదు? లాక్షణికులు తమకవసరమైన లక్ష్యముల బూర్వప్రబంధము లన్నింటినుండియు దీసికొన వలయునా?

శైలి శ్రీనాథుని శైలితో నెంతమాత్రమును బోలదట! శ్రీనాథుని యేశైలిని బోలదు? వీధినాటకమందలి శైలితోడనా? శృంగారనైషధమందలి శైలితోడనా, హరవిలాసమునందలి శైలితోడనా? ఒక్కకవియే వేరువేరు ప్రాయములందు వ్రాసినయెడల కవిత్వమునకు వేరువేరు శైలులు వచ్చును. కవిబ్రహ్మయను పేరుతిక్కనకు వచ్చుటకు దగినట్టుగా భారతభాగము నాంధ్రీకరించిన తిక్కయజ్వ సోమయాజి కాకపూర్వము రచించిన నిర్వచనోత్తర రామాయణమును జూచిన, నది యాతనిదా యనుపించును. కవిరాజమనోరంజనము పిల్లలమఱ్ఱిచరిత్రమని పేరు వచ్చునంత ప్రౌఢముగా రచియించిన కనుపర్తి సుబ్బన్న చిన్నతనమునందు వ్రాసిన యనిరుద్ధచరిత్రమును జూచిన, నదియాతనిదాయనుపించుచున్నను, చామకూర మంచి పాకమునఁబడినదని మెప్పుడు గాంచునట్టి విజయవిలాసమును విరచించిన వెంకటకవి యంతకు బూర్వము చేసిన సారంగధరచరిత్ర చూచిన, నది యాతనిదాయనుపించును. ఈసంగతులను మనస్సునందుంచుకొని యుండినచో విమర్శకులు శైలిపోలదని వ్రాసియుండరు. రసికాభిలాషము శృంగారనైషధాదులవలె సంస్కృత భూయిష్టము కాదు గాని కొంతవరకు వీధినాటకకవిత్వమును బోలుచున్నదనవచ్చును, వీధినాటకము వ్రాసినవయస్సునకును భిన్నమైన ప్రాయమున వ్రాయబడి యుండినచో వీధినాటకశైలికంటెం గూడ దీనిశైలి భిన్నమైయుండవచ్చును. శ్రీనాథుని గడుసుదనపుఁబోకడ లిందెక్కడ గానరావట! శ్రీనాథుని గడుసుదనపుపోకడల కేమిగాని నైషధాదులయందున్న గడుసుఁదనపుఁ బోకడలేవో రసికాభిలాషమునందు లేనిచో దృష్టాంతములతోఁ జూపి, తమవాదము హేతువులతో సిద్ధాంతీకరించుకొనక వట్టిమాటలమాత్రముచేత గాలక్షేపము చేసిన యీవిమర్శకుల గడుసుఁదనపుఁ బోకడను మాత్రమెంతైనను మెచ్చవచ్చును. ఆలాగుననే కల్పన లెక్కడో కానితరుచు గాఁబ్రౌఢముగా లేవని …రుమాటమాత్రముచేతనే స్థాపింప జూచుచున్నారు! కాదన్నవాఁడు కరణ, మన్నట్లు వ్రాసిన

యీ వ్రాతలవలనఁ బ్రయోజనమేమి? రసికాభిరామము శ్రీనాథునిదని హేతువులతోఁ జెప్పినను జనులొప్పుకొనఁ గూడదట! కాని యీవిమర్శకులేమి చెప్పినను, చెప్పినంత మాత్రముననే యొప్పుకొనవలయునుగాబోలు! 1. 2. 26. 27. 50. పద్యములు దప్ప రసికాభిరామమునందు గల్పనలులేనిపద్యములు వీరు మరియెన్ని పాదులుమూలములు చదివియైనను జూపగలరా? వానిలోని కల్పనలు మాత్రమే ప్రౌఢముగా నున్నవని వీరియభిప్రాయమా, లెక్కించిన వేలకావో కారణసహితముగా వీరు నిరూపించినగదా తిరిగి యేమి చెప్పుటకైన వీలుండును!

5. రసికాభిరామమునందు శ్రీనాథుడు ప్రయోగించి యుండడనియాధునిక ప్రయోగము లున్నవట! ఈసంగతి పోల్చుకొనుట కుపయోగించిన కుశాగ్రబుద్ధిని మరికొంత యుపయోగించి వీరు నీసంగతి కూడ గ్రహింపలేకపోవుట చిత్రముగా నున్నది శిథిలములైన స్థలముల గ్రొత్తగా బూరింపబడిన భాగములు కుండలీకరింప వలసినయవసరము లేకుండ సులభముగా బోల్చుకొనగలుగుట కచ్చోటుల నెల్ల వీరైనవరకు నాధునికప్రయోగములతో చేయబడియుండగా "మాకునెక్కడ జూడ గ్రంథమందంతట నొక్కటే శైలియే కనబడుచున్నది కాని వేర్వేరు శైలులు కనబడుటలేదు" అని వీరువ్రాసిన నదియెంతహాస్యాస్పదముగా నున్నదో చూడుడు. ఆధునిక ప్రయోగములు జూపగలుటచే శ్రీనాథునిగ్రంథము కాదని స్థాపింపఁగలిగితి మని వీరుసంతోషింతురేకాని. క్రొత్తగ బూరింపఁబడినభాగము లున్నవే, యీ నవీనప్రయోగము లందలి వేమో యనుసంశయము కూడ వీరు పొందరైరే. పాపము, తమయుక్తి యుపహతమగునని వీరియుత్సాహమునకు భంగము కలిగినందులకు విచారింప వలసినదే. " లజ్జలినాను " అనునది కేవలమసాధు వని వ్రాయుచున్నారు. "ఉన్నాడను, అనుదానికి ఉన్నాను,, అనునది రూపాంతరమయినట్లు ,, లజ్జలినాడను, అను దానికి, లజ్జలినాను" అను రూపాంతర మగునట్లు రూపాంతరము గలదు. ఆధునికప్రయోగములు గలవు. కావలసినచో మనోరమాపత్రికాధిపతులచే రచింపబడి మనోరమయందు ప్రచురింపబడిన ప్రసన్నయాదవనాటకమున 21 వ పుట చూడుడు. అందు "బ్రతికినాను" అనురూపము బ్రయోగింపబడినది. ఇది సాధువైన నసాధువైన బ్రకృతాంశమున కొక్కటియే. శ్రీనాథుడిట్లు ప్రయోగించియుండడన్నదానితో నిర్వివాదముగ నేకీభవింపవచ్చును విమర్శకులు కష్టపడి యుదాహరించిన ప్రయోగములం బట్టి చూడ, నీగ్రంథమునందు గ్రొత్తగా బూరింపబడిన భాగములే నవీనుడు రచించినట్లు తోచును కాని గ్రంథమెల్లను శ్రీనాథాదులగు ప్రాచీను లెవ్వరయిన వ్రాసి యుండరని తోచవలసిన యావసరములేదు.

6. శ్రీనాథుడు పరమభాగవతోత్తముడట. నైష్ఠికుడట ఇట్టిగ్రంథమును వ్రాసియుండడట యాత్రకొరకు వచ్చెడి సకలజాతుల నాతులను

వ్రాసిన సంస్కృతాంధ్ర కవులెల్లరు నిప్పటిమనకు బూతుగా దోచు నీమాత్రపు శృంగారమును వాడిచేయున్నారు విమర్శకులు గ్రంథపరిశోధన చాలకయో చదివినది మరచియో కాళిదాసాదులగు సంస్కృతకవులు కవిత్రయమువారు పింగళి సూరన్న మొదలగు తెలుగువారు శృంగారరసము రసికాభిలాషములో నున్న దానికంటె దట్టముగా వ్రాసిరని చెప్ప సాహసించిరి. అయినగాని నాటిలో సయితము నీగుబ్బల నుబ్బించిన నీయౌవన ప్రాదుర్భావముననే నిందించుకొను మన్నమాటలు పెట్టిన కాళిదాసుని శృంగారము వీరికి రుచించినది. పురాణకవులగు కవిత్రయము వారిమాటకేమిగాని ప్రభావతీ ప్రద్యుమ్నుల సమాగమము మొదలుకొని నాటకత్యాగులను విజృంభించి వర్ణించిన పింగళి సూరన్న శృంగారము వీరికి రుచించినది స్త్రీవర్ణనము నఖశిఖపర్యంతము నొక్కయవయవమైన విడువకుండజేసి రతివర్ణనము సయితము మానని తక్కిన శృంగారప్రబంధ కవుల శృంగారమెల్ల వీరికి రుచించినది గాని యేమి హేతువు చేతనో పాప మీరసికాభిలాషము సంగతి శృంగారమున్నమాత్రము వీరికి వదల కంటగించినది పేరు పెట్టుట ఎందులకు గాని నవీనులలో సంఘ సంస్కారులైనవారు సహితముచేసిన శృంగార రసికాభిలాషములోని దానికంటె నేసినారే! గాని నవిమర్శకు లంత నాదరింపరు? పూర్వోదాహృత కవుల గ్రంథములు సర్వకళాశాలాధికారులు పరీక్షలకు గూడ నియమించుచున్నారే. విద్యార్థులు తలవంచుకొనియైన జదువనే చదువుచున్నారే. శృంగారభూయిష్టములని తలపక వైజయంతీవిలాస విజయవిలాస ముఖ్యప్రబంధముల నాగరిక పత్రికాధిపతులును ముద్రింపించి ప్రచురించుచున్నారే. అవిమృశ్యకృత్యముల గూడ నవిమర్శకులేల యూహింపజాలకరు? శ్రీనాథునిదన్న హేతువు చేత రసికాభిలాషమును మూలనడగ ద్రొక్కక ప్రకటించుట యొక సాహసము కాదు కాని. ఈవిమర్శకులకు పేరుపెట్టియు పెట్టని విమర్శనము వ్రాయుట సాహసమే. వెనుకముందు లాలోచింపక తొందరపడి వ్రాసిన యీ విమర్శనమును జూడగా నిది విమర్శనాకౌశలముచేత నొడలెఱుంగక యున్న ధూర్త విమర్శకుడెవ్వడో వ్రాసియుండవచ్చునని తోచుచున్నది. కవిత్వశైలిం దెలుపుటకు నుదాహరింపవలసిన మృదువయిన పద్యములు రసికాభిలాషమున లేవట? యిక నెన్ని మాసారులు చదివినను లాభింపకుండుట కిది నిదర్శనము. లాభించి యుండినయెడల 1. 2. 8. 10. 17. 26. 32. 45. వ పద్యము లుదాహరించిన నష్టములేదని తెలిసికొనక పోయియుండునా? అంతు రెండుశైలి తెలుపుటకీదిగువ నుదాహరింప బడుచున్నవి.

ఉ. మత్సరితాపసాంబుజప • మంచితవక్త్రి • నకోకపల్లవాం
చత్సరిభాసితాంఘ్రిని. ర • సాలసమూహర, మస్తకాంగి. నీ
యుత్పలనేత్ర నిన్నుఁ గను • చున్న కొలదిని హెచ్చుఁ జొచ్చె నో
యుత్పలగంధి! పంచశరుఁ • డూనశరంబులనిష్ఠురోక్తనా! 16

ఉ. నీమొలనవ్వు నాకు విషము • నీ మొయి నాకు యము నాద యంగ గం
గాయము నాసరస్వతులు • గాహృదయంబున నిశ్చయించితిన్
మాయురే! పుణ్యభూమిని సు • మా! నినుఁ జేసిన వారి కెల్లనున్
మాయుమనోజతాపములు • మానిని! నన్నుఁ జేరఁ దీయుమా. 17

విశాఖపట్టణము.
1వ సెప్టెంబరు 1907 సం॥ సెట్టిలక్ష్మీనరసింహము

శ్రీరస్తు.

# రసికాభిలాషము

శ్రీపుత్రసతీసన్నిభ
రూపవతీ! మదవతీ! మ ♦ రుఁడు తనపూవుం
దూపులనా? నీవాలుం
జూపులనా? నన్నుఁగొట్టు ♦ చు న్బాధించున్?॥

సీ॥ కొదమతుమ్మెదచాలు ♦ నదలింపఁగం జాలు
కప్పుదోఁ దనరు నీ ♦ కొప్పుతోడ,
వెన్నెలలం జల్లి ♦ నిలసిల్లుజాబిల్లి
గోముతోఁ దనరు నీ ♦ మోముతోడఁ
బదను వెట్టిన మారు ♦ బాణమ్ముల న్మీఱు
నేపుతోఁ దనరు నా ♦ చూపుతోడఁ
దాఁగను మొండుగఁ బండు ♦ దొండపండును నుండు
కావితోఁ దనరు నీ ♦ మోవితోడ,
తే॥ గీ॥ సందెవేళను మేడపైఁ ♦ జల్లగాలి
కొఱకు విహరించు నిన్ను గ ♦ న్గొన్న యంత
నీపయినె కడు దృఢముగా ♦ నిలిచియుండి
నాకు వశము గాకున్నది ♦ నామనమ్ము॥ 2

ఉ॥ సుందరి! పంట నొక్కఁటను ♦ జొక్కపుమోవి సుధారసంబు, చే
తం దుడుకారఁ బట్టఁ బలి ♦ తంపుఁజను ల్వెలియొగ్గు కుంభముల్,
సందిటఁబట్టి నిల్పఁగను ♦ సన్ననికౌ నల మిన్ను; గాన నీ
'వందనిద్రామానిపండు' వని ♦ యాసను మానను పొంద నయ్యయో!

చ॥ పిడికిటఁ బట్టనిట్టటులు ♦ బిట్టుగ మిట్టిపడంగఁ జొచ్చునీ

దుడుకుఁజనుంగవం బలెనె - తొల్పుచునాహృదయంబు గూడనో
క్కెడను నడంగ కున్నయది;-యియ్యెడ గుబ్బల నాదుఁగొమ్మునం
దడఁగఁగఁ బట్టి యుంచు, తగి - నట్టిదె యాయ్యని జట్టి పట్టఁగన్॥

సీ॥ చెలువ! నీచక్కని - చెక్కిలి నొక్కి మ
క్కువ నేను నొక్కించు - కొనుట యెపుడొ?
రమణి! నీ మధురాధ - రమ్మును గొఱికి మ
క్కువ నేను గొఱికించు - కొనుట యెపుడొ?
కొమ్మ! నీ యొమ్మునా - యొమ్మునం గ్రుమ్మి మ
క్కువ నేను గ్రుమ్మించు - కొనుట యెపుడొ?
కాలత! నీ నెమ్మను - గౌగిటం జేర్చి మ
క్కువ నేను జేర్పించు - కొనుట యెపుడొ?

ఆ॥ వె॥ తెలువ, నిన్ను రతులఁ - దేలిచి నేను దే
లించుకొనుట యెపుడొ? - లేమ, నేను
నీవు ననెడుభేద - మే విధంబున లేక
యుండఁ గలుగు టెప్పు - డొకొ యింక?॥

ఉ॥ కాముఁడు మనస్థలిని -గల్గిన ధైర్యధనంబు నెల్లనో
కోమలి దొంగిలించి యిటు - కుంజనుకొండలసందు నందుఁబా
నీ మెఱుఁబాఁతి పెట్టెనుగ-దే ననుఁ జూచుకొనంగ నీయు మా
నీమను; సంశయస్థలులఁ - జేతులఁ గ్రుమ్మెద, గోళ్ళఁ ద్రవ్వెదన్

మ॥ "అహాహా! నీ కచ పుంగజాతగుణము, - న్హాసంబు చంద్రప్రభ.
స్నేహితాళులు ల్పవనాశ్వముం గెలిచె, 'న - న్నన్, నన్ను బాధింపనా
కుహాను లాస్పని రిదె గిరీశసమన ♦ త్నోజా, తమోవేణి! యో
యహిరోమావళి! ప్రోవరమ్మ, నినుఁజూ-మ్మా నెమ్మదిన్నమ్మితిన్॥

సీ॥ నీ కుచు ల్నిమురనే - నెమ్చ నంతకె హేమ
నాస! తుమ్మెద నన్ను - గాసి పెట్టు;

నీ పల్కుల న్విన - నేర్చుదన్కనె సంకు
మదగంధి, చిలుక న - న్బెదర - జేయు,
నీ గళస్వర మెన్న - నేర్చుపర్యంపమె
రామ, కోయిలనన్ను - రా పోనన్చు,
నీ నెన్నడలఁ జూడ - నేర్చుదాకఁనె ఘన
వేణి, రాయంచ న - న్వోతల ముంచు,

ఆ॥ వె॥ మరునిరాజ్యమునకుఁ ♦ గరుణ న న్పట్టాభి
షిక్తుఁ గాఁగ నీవు ♦ చేయునటకె
మరునిబలఁగ మిట్టి ♦ మాడ్కిని నన్ను బా
ధింప చుండు నో ర ♦ తీ విలాస॥

చ॥ మదనుధనుర్గుణంబు ♦ మార్గణపాళి పయి స్తనుస్సు పై
మది నుదయించునాదుపగ ♦ మానఁగ నంగజసంగరంబున
న్మదవతి, నీదుకొప్పొడిసి ♦ మాటికిఁ బట్టుకొనంగ, నీయెడ
ల్పదిగ నల్కం, నీపెదవిఁ బంటను సారెకు నొక్కఁ గోరితిన్॥

ఉ॥ మత్పరితాపమంబుజస ♦ మంచితవక్త్రి, న్నశోకపల్లవాం
చత్పరిభాసితాంఘ్రిని, ర ♦ సాలసమాధర, మల్లికాంగి, నీ
లోత్పల నేత్ర, నిన్నుఁ గను ♦ మనన కొలందిని హెచ్చఁజొచ్చెనో
యుత్పలగంధి, పంచశరుఁ ♦ డానుశరంబులనిగ్గువో కదా?॥ 10

చ॥ కవు లెటు లన్న నేమి? యుప ♦ కారి యగుం గద శంబరారి? ని
న్గవుఁగిట బిగ్గఁ జేర్చుకొనఁ ♦ గా నుబుకుం కలయట్టి నీదు చ
న్గవ నడిభాగమం దిముడఁ ♦ గాఁ గడుఁ గష్ట మటంచు నెంచియే,
తవురఁగఁ దూపులం బఱిపి ♦ తద్దయు గ్రుచ్చెడు నాయురస్థలిన్॥

చ॥ విరహపువేఁడిచే మిగుల ♦ వేదనఁ బొందుచు నున్న వాఁడ, దు
ష్కరముభరింపఁ స్సనగవుఁ ♦ గప్పురముం, జనుతమ్మి మొగ్గలుం,
గరకిసలంబు, లూర్పువలి ♦ గాలులు, బాహుమృణాళము, ల్నిరం

తరమును నేసఁ జేర్చెన గ - నా ముగుదా, యుపశాంతిగాంచుచున్॥

చ॥ బిగువును బింకముం దనర - బిట్టుగ లోపలఁ గ్రుమ్ములాడుచు, నా

వఁగ మఱియింత ద్రోళ్ళిపడఁ, - బైకిక భేదము లేనియట్టులే

యుగపదు నీదునిబ్బరపు - టబ్బురపుస్నిగుబ్బ; లావనే

నగ నగు? "మిథనంబె గుణ - నథన," మట్టులు చేయనీయుమా॥

ఉ॥ తైకముడి స్సడల్చి కడు - జంపిలు నీ బలితంపుఁజన్నుల

న్నా కర మందుఁ బెట్టుమని - నం, కరమం దవి పట్టు నంపెనో?

శోకముడి స్సడల్చి పలు - పంగవ్రునుం గయికొంట కష్ట మే

మో? కమలాక్షి! "సూక్ష్మమున - మోక్షము" గల్గినరీతిగాఁ గుఱా.

మ॥ కనకాంగీతిలకంబ, కుంభకుపరా - గంబుం బయిం బూసికొం

చును నే లాస్వదన చేయు బ ల్లరిద్రిడెము - చ్చు, గ్గానె నీ నిస్తుల

స్తనము? ల్వాలఁ దయామయాలోనె తగు, జే - తంజిక్కునే? కంచుకం

బును విప్పంగ నొకప్డు పట్టు గల నేమోనే బ్రయత్నించెదన్॥

శా॥ కాంతా! మీటినయంత విచ్చు కటులే - కన్పట్టును న్నీదు చ

న్నంతయు ల్బట్టికొనంగ మిట్టి పడున - న్నా! నాలిముచ్చు ల్గదా?

యేంతో సిగ్గున జాటుగా బయటలో - నే యున్న యట్లుండియు

న్నంతైనం దము నెవ్వరేని గన బి - ల్చుం బట్ట రండం చహా!

ఉ॥ నీ యెలనవ్వు, నీ కచము - నీ మెయిచాయయు నారయంగ గం

గాఘమునానరస్వతులు - గా హృదయంబున నిశ్చయించితిన్,

మాఘము రె! పుణ్యభూమివి సు - మా! నిను జేరినవారి కెల్లను

న్మాయు మనోజతాపములు; - మానిని, నన్నిక జేర దీయుమా!

చ॥ పొలతిరో! నీదు మోవి ఫలి - ము. న్వచనాంబుకణంబు, లూర్పుగా

లు లె నిరతంబు గ్రోలు మను - లోపల చెలువంబి చూచుచు

న్బలితపుగుబ్బగుబ్బలుల - పై దప మే నొనరింతు; గూర్మియ

గ్గలముగ నీవిమోక్షమును - గల్గగ జేయుమ నాకు నీవికన్॥

మ॥ కలికీ! పుష్పవిలుకాని క్రొమ్ములికి, ని-క్కంబిద్దె నాగారుచీ
సౌలభ్యోగ్ర పయి పెట్టుపుట్ట లగు జు-మ్మీ నీ కుచమ్మీ! లబ్బఁగ
గులపాణా సని చెప్పగా వలెనె? నా - కుంగూడ నా భాగ్యమే
ట్టులి కేనాటికి గల్గునో యెఱుగ కి - ట్లు ల్వేదనం బొందెదన్॥

చ॥ అటు నిటు జక్రపాలనము-నందు సితాంబుసుచంబు లున్ననుం
గటకట మధ్యనాభిసుడి - గల్గుటచే నిటుపేద యయ్యె నీ
కిటకట లాడుకొను; పరి - కింపవు కొవ్వుస బాధ బెట్టెదం
గటవెని గుచంబులు. న్మ్రాతియు - గాను సుజ్ఞింపగ ముష్టి బెట్టెదన్॥

మ॥ పరకాంత నిన్నుబల్మి బట్టుకొనగా - భావించుపాపంబు నా
కరము ల్పైకొనంగ దాపకకటా - తూర్మచక్రమం దెల్లడం
గమగ, స్న్ని క్కుచద్వశైలముర పై-నిక జేర, నీసుస్మితా
మరకోల్లాసనో మును గుణా - గ్రంబు గల్గింపుమా॥

సీ॥ గొప్ప దౌ నీ కవ్వు - గొప్పచీకటిని గ-
గమ్ముల కొప్పనగా - రాజనేదు.
గమ్మ నే నీముద్దు - గమ్మానిసుధను బొం
దుట గల్గిన స్వర్గ - సుఖంపు నేదు
గుబ్బ లౌ నీ కుచ - కుంభముల గ్గోళ్ళ
నునిచిరం బుబుషసిం - హుండ నేదు,
సన్నపౌ నీ కౌను - చిన్నను విడువ కె-
న్నండును బట్ట ఘు - నుండనేదు.

తే॥ నీ॥ నింక వేయును నేల? నీ - వెప్పుడు నన్ను
మదనకదనంబున న్మెచ్చి - మనసిరాజ్య
మునకు బట్టంబు గట్టెదో - నొందు నాదు
జన్మ మపుడె సార్థకత ని - శ్చయము గాగ॥ 22

చ॥ భ్రమగొని మోవిబింబమును - బంటను నొక్కఁశుకుంబు, జన్నుకుం

భము లను గోళ్ల నిచ్చెమొయు – వచ్చిన గేసరిడింభకుండు, సం
భ్రమమున వేణిసర్పమును – బట్టుకొనంగ వినాయకుండనుం
జుమి. యిటునీమహాం దొదవు–చో నిరతమ్ము నను బ్రహ్మచారినే॥23

శా॥ ఏలా యో బలుసోయగంబులకు దీ – పీ! జాలముం జేయ? నే
నే లీల న్విరహాబ్ధి నీదుమును? ని – న్నేలాగునం జేకుర్తు?
జాలిం జూపకయున్న మన్మథశరా – సారమ్ముచే మున్గదం?
దేలింపం గదె గుబ్బకుండలను గుం – డె న్నోర్చి పి నన్నీయెడన్॥ 24

సీ॥ నలుదిక్కులం జీక – టులు గ్రమ్మ గబరీభ
ర మ్మను హాలాహ – లమ్ము చెదర.
మిగుల బోంకంబుగా – బిగిగబ్బిగుబ్బల
న్వాలిగాన్గు సంభము – ల్వాలికి దోప,
నడ్డంబుగా బాహు – లను నట్టి వేలుపు
ద్రూకులే గొమ్మలు – పైకిలేవ,
నెల్లెడ న్వెన్నెల – ల్చల్లుమ జెలుసగ–
వనెడు చంద్రప్రభ – జనన మొంద.

తే॥ గీ॥ వసుస నిల్లు నీ సౌదర్య – వారధి రతి
మథనమును నొనర్చి యధర – మధురసుధను
బొందు టెన్నడో? యో జగ – న్మోహినీ! భ
వత్కరుణ లేక యది పొంద వశమె నాకు? 25

చ॥ కనికర మించు కేనియును – గల్గినదానవు కా నటంచు ని
న్ననగ గలనా? దినంబు లల – నా, కల లందున నైన రాత్రులం
గనబడి నన్ను దన్పుదువు – గా? పది వే లదె, "లేని మామక
తన్నుగడు గ్రుడ్డిమామ యయి నన్నయ" మన్నది యున్న దేకదా
సీ॥ ఎదురొత్తు కులుకు గ – ద్గద మొత్తు పలుకును
నలరెడు రతిసమ – యంపువెరవు,

జెలరేగు కురులును – య్యేల రూగుసరులును
నింపాను పురుషాయి – తంపుహాసవు,
నర డిందుచూపు జం –దర చెందురూపును
దనరు చున్న సురతాం – తంపుదేజవు,
పిడశాలు పైకప్పె – మ్మడి జాఱుకోకయు
దగ బాన్పుపై నుండి – డిగెడుమురవు,

తే॥ గీ॥ గలలలోపల బలుమారు – గాంచి కాంచి,
కాంక్షిదీఱ నిన్నాఱేమఱి – కౌగలించి,
యంతలో నిద్రమేల్కాంచి – యెంతో వంత
గాంచుచుందు నిన్నాసకొ – మించు బోణి! 27

చ॥ కలనొకమారు నీవు ఆవి – కధరియింపక జిల్గుబయ్యెదం
దొలగగ ద్రోయ నిక్కజను –ద్రోయి ఖచిక్కసగ్గమ్మనాయుర
స్థలి సపదూఱి చిక్కనడి – చచ్చిన రా నటు! నూత్నపార్వతీ
శులని లెనజ్జియుంపు నట – చోద్యముగా మన మెల్లకాలమున్

చ॥ ఇక మఱియొక్కమారు నిను – నే బిగియారగ గౌగలింపగా
ఎకపిక లాడు నీ చనులు – వీపున దూసిన వంట! నేవికా
సకను 'విచిత్రపుద్విజునే – నీపున జన్నులు పుట్టె!' నంచు దా
నికి నెడనవ్వు నవ్వుచును– నిద్దుర లేచితి, నంద జే మనన్ 29

చ॥ మఱియొకమారు వెల్లకిల మంచముమీద బరుండి వంట! నే
దొఱగగ నీదుపయ్యెదను – ద్రోయగ బుస్సున నూగుటారు పా
ము, రపిక విప్ప వాడిమొన ముక్కులతో జనుజక్కవల్ననుం
గఱవగ వచ్చెనంట! యది – కన్గొని భీతిని మేలు కాంచితిన్ 30

చ॥ ఎలమి మ ఱొక్కమారు మన ♦ మిన్వరముం బసివార మైకలం
బలుమరు నాటలాడు నెడ ♦ బాలరో! నీదు నితంబసైకత
స్థలములమీదికొ ననెడ ♦ సన్నని పుల్లను నేనుగాంచగా

గలుగమి నీవుకోడి యిడ - గల్గినిగ్రుస్సిట చుమ్మి నీచనుల్! 31

ఉ॥ "తీయనిమోవితేనె కసు - బెంచెడు నా రసుచీసుబాగు దా
నో యెలనాగ, దూరమున - నుండగనే కని వెన్కవు న్వడిం
బోయెను భీతిచేత బల - ముం గల దయ్యెను వేణిసర్ప, ము
ట్టో!" యని మేలుకొంటిని సు - ఖోక్కతతి న్వినుచాసినన్వగర్

ఉ॥ వేళ్లోకస్వప్న మందు నిను - వేడుక నేను గవుంగలింప, వే
మాఱును నాశరీరమున-మాయుడు నాటిన మోహబీజము
లీఱనిచెమ్మటం దడిసి - లేచె గడుం బులకాంకురంబు లై,
నాఱును బోసి యమ్మరుడు- నాటినవాడట వాని గ్రిమ్మజెర

ఉ॥ ఇమ్ముగ సవుసాదరస-మెల్లెడ నిండిన నీదు చెక్కుట
ద్దమ్ముల నామొగమ్మె సుర-తమ్మున నేగని, వేళ యెవ్వరో
యు మ్మెయి నిన్ను ము ద్దిడి ర-టంచును బట్టగ బోవ నీకపో
లమ్ములె చేత జిక్కెనట! - లజ్జినా నట నీవు నవ్వగర్!

ఉ॥ "అక్కట! తాము చక్రవిజ-యంబును బొందిన నంచు నీ చను
ల్నిక్కుచు నిగ్గుపీగుచును-నిల్చుచు నున్నవి, చేత జిక్కిన
న్నొక్కుడు" నన్న 'గోళ్ల గద-నొక్కుడు; నాదుతనంబు గాని నీ
గొక్కబలంబె?' యంటి విక-నొక్కకలం గలహంసగామినీ॥

స॥ ఉపరతి నీవు స స్గలసి ♦ యొకకల న్నలుపంగ బూన నా
విపులలువకు మందుగడు ♦ వేడుకతో నలరాచబిడ్డ డె
ల్లప్పుడును ద్రిప్పుబొంగరము ♦ లట్టులనే కనుపట్టె నీదు పొం
కపుజనుదోయి, జాలెవలె ♦ గద్దొన నయ్యెను నాదు మాయురే!॥

శా॥ భామారత్నమ! నీ విశోక్కకల బుం ♦ భానంబు గావించుచో
నా మైనీ జడలోనునుండి సుమనం ♦ తానంబు రాల న్మరు
జ్యాము క్త ప్రసవాశుగంబు లని నే ♦ నాకంపముం బొందగా
ప్రేమన్నీ చనుడాలులం గరములం ♦ బెట్టంగలేదా కలన్?॥ 37

మ॥ మగలా గీ డోకస్వప్న మందు నొనరిం - ప, న్నేను సొంపార బై
కెగయం జేతుల రెంట నీదుచనుదో - యిం గట్టిగా బట్టగా
నగి, గోవర్ధనమందరంబులను శ్రీ - నాథుండు నే డొక్కసా
రిగ మోసెంగమ?, డంచుబల్కితివి సం - ప్రీతాత్మవై నాతిరో 38

మ॥ చెలియా! యెన్నియొ యింద్రజాలముల నే ర్చెన్నీ చనుల్పొందనం
బలదంగా హిమనంతము, ల్పసువు పూ-య న్మేరువు లుక్కుంకుమం
బొలయంగా నుదయంబులు, న్మృగమం - బొప్పారగా నంజనం
బు!, అటుపై, 'గవిసార్వభౌముడ వెయా - బా. మ్మంటివిన న్నంగలన్

మ॥ పొలయల్కంగలతోన నీ నవలిమో-ముం గాగ బన్నుండ, 'నీ
బలుచ న్నిప్పులు మోముదానురయు దిగ్ -ప్వస్సోగ్నులు నైన్యకత
స్థలులుం గొప్పనునాచు లేవె మణీ ?, నీ - సౌందర్యగంగాఝురిం
గలదే యీాదరి మేలటన్న ?, దని ప- ల్కం గోపమున్మానవా? 40

చ॥ పడతిరో! పూవుముల్కులను - బల్మెఱు మారుడలంత పెట్టగా
నడలుచు నిన్ను జేర నను - నద్రిర! నీ బలితంపుగుబ్బలం
బొడుచుచు బాధ పెట్టుటకు - బూనితి. నిద్దియె ముల్లు పుచ్చి కో
ఱడచినచంద,! మన్న నగ - నా? తగవా కలతోన నేనియున్? 41

ఉ॥ చక్కని పెన్గొడ ల్పిగుపు - జన్మొగడ ల్మెరిపెంపునెన్నడ
ల్గ్రిక్కన గాంచి, స్వప్నముల - గంతునిదంతి నటంచు నెంచి నీ
వుక్కరినాకు నోడమని - సోడుటయు న్నమకూను నంచు నో
చక్కెరబొమ్మ! విన్నతమ- సంగర మందు జయింతు వేమఱున్॥ 42

ఉ॥ నీదు శిరోజనీలముల - నీ యధరాధర పద్మరాగము,
న్నీదు నఖాళివజ్రముల - నేను హరింతు న టన్న గూడ నీ
ల్గాదని కర్కశ స్తనశి - లామయ మా బిగువుంగవుంగిటన్
ఖైదుగ బాహుపాశముల - గట్టవె న న్నల లందు సుందరీ?॥ 43

సీ॥ ఘనవేణి! నీ కొప్పు - గగనంబు నం దెల్ల

నున్నది నిండ యటం - చొక్కమాఱు;
శశిముఖ! నీమోము - చంద్రిక ల్పల్లె న
ల్దిక్కులం దంచు వే - ఱొక్క మాఱు;
నగకుచ నీ చను - ల్జగతీతలము మోపి యు
చున్నవి యంచు నిం - కొక్కమాఱు;
సుమగాత్రి! నీ మేను - ప్రమదావనుల నెల్ల
నున్నది యంచు మ - ఱొక్కమాఱు;
ఆ॥ వె॥ మఱియు నింక బెక్కు - మాఱులు నీ బలు
తళుకుగన్ను లెల్ల - కొలకులందు
జెలగు చున్న నంచు - జిత్రంబుగా నేడు
గలల యందు గంటి - గలువకంటి. 44

సీ॥ తొగఱేని గననీదు - నగుమొగం బాదిని
గనిపించి కిసలము - ల్గానిపించు
గమలము ల్గన నీదు - కరముల దొలుతను
గనిపించి కిసలము - ల్గానిపించు;
గిసలము ల్గన నీదు - కెమ్మోవి మొదటను
గనిపించి తేనియ - గానిపించు;
దేనియ గన నీదు తీయపల్కులు ముందు
గనిపించి యమృతంబు గానిపించు;
తే॥ గీ॥ నమృతము గనంగ నీ మంద - హాసముపరిద
మమున గనిపించి తొగఱేడు - మఱల్ల మొం
గమ్ము గనిపించు; నీ రీతి - గలలలోన
నెటుల జూచిన గనిపింతు - వీవె నాకు! 45

సీ॥ రంభ గూడినభంగి - రాగింతు నీ తోడ
లనురక్తి నిమిరిన - యట్లు లైన;

హేమ గూడిన లీల - నెంచెగ నీయొడ
లాసక్తి స్పృశియించి - నట్టులైన;
దార గూడినరీతి - దలతును నీగోళ్ళ
వర్తితో ముద్దిడి - నట్టులైన;
హరిణి గూడినమాడ్కి - సనుకొందు నీచూపు
లనురాగమున జూచి - నట్టులైన;

తే॥గీ॥ స్వప్నములయందుగాన న - చ్చలపొరద
టంచు, పొందు నేను భా - వించుచుందు;
గానిచో నీకు నప్పరః - కామినులకు
"హస్తిమశకాంతమ్ము" సు - మా సుమాంగి! 46

సీ, కూర్మబంధమున - కూడుదునో భామ!
సింహవిక్రమము నా - సింతు లేమ!
గజబంధమున రతి - గావింతు మదవతి!
ద్రోణబంధము మది - నెంతు యువతి!
ధనురాఖ్య బంధంబు - నొనరింతు మరుదంతి!
యర్ధచంద్ర మొనర్తు - నందు నింతి!
భ్రమరబంధంబున - రమియింతు గరియాన!
మాయూరమున నుంతు - మనసు చాన!

తే॥గీ॥ కలలలోపల నీదు మీా - గాళ్ళ గాను
జన్ను గనను, గన్ను గనను - గన్ను బొమల.
నెన్ను దురు, ముంగురుల, బలు - పెన్నె ఱులను
గాంచి యాబంధముల నీకు - గాంతు ననుచు.

చ॥ అబలరో! కామశాస్త్రపుర - హస్యము లెల్ల నెఱుంగువారిలో
ప్రబలుడ నంచు నెంచి బహు - భంగుల నవ్వులతేడు కూడ బూ
గుబురుల బూజ సేసె నిది - గో! మఱినీవును నిస్తులస్తన
స బక యుగంబు నా యురము - దాకగ దండలవేయుమా మొదన్.

### నాగపాశ బంధము

చ॥ అమరఁగ భోగినీముదిత - వైతనుచు న్గడ జూడఁ దోఁచు, మా
న్యముగ భుజంగుడన్, - మది గనంగ దళం దగినారనే చుమీ!
శ్రమ విడ, నింక నోము నను - జానుగఁ జెల్వగునాగపాశబం
ధమున రతుండ నో మహిళ, తాళనె చుమ్మిక నీ భుజం జెలీ.

### చక్రబంధము

శా॥ కన్యా! శృంగిసమానబంధురకుచా! - కల్యాణసుశ్రీరామా!
ధన్యా! గానకళాధురందర! కళా - తంత్రాసమానాచరా,
జన్యేరమ్మదజైత్ర సుందరకటా - తూ, యిద్దియో ధర్మమా?
మాన్యాత్మా! కడు బాధగల్గె, నను లే - మాటన్నరా జూడుమా॥

### ర సి కా భి లా స ము

సమాప్తము.

సెట్టి లక్ష్మీనరసింహ కృత

# సరసచాటువులు:

తే॥ సీ॥ పూర్ణశశిసమమై మోము - పోలిచెనొ?
కుసుల పేరి మబ్బులు దగు - లోకనియె నడ్డు;
స్వాతిమిన్న నాతోఁడ ని - న్న మగలాగు
కృశోకమున సల్ప దానిపై - కొన్నయపుడు॥

తే॥ గీ॥ కను, ప్రియా, తలుపయాళి యీ - యాకలువపూకు
ఱంగటం గని, యందు మ - రందమొడ్డ
గిల్లఁ నెంతొప్ప నం చుల్ల - సిల్లుచు, నది
గ్రోలి నిదుర పొందెం గలు - కుచునచటనె॥

ఉ॥ "ఇంతలు చన్ను లుండ మఱి-యెవ్వరి గూడెదు భాసురాంగి? యే
కాంతమునందు నున్న జవ - రాల; ద్రవం బడి వెక్కతీయులా
గింతయు గాక, నీ వెఱుగ - వే మరు డిచ్చిన దారి చొప్పు? నీ
వింత భయంబుమై నుడుగ - వెల్లిద పాదువు; మాట లేటికిన్॥"

ఉ॥ "సిక్కదు, దోప నేల? తను - లీకులరత్నమ, యింక నీపయిం
జిక్క ఘనంబు నీకు; విను, - చిత్తజుదండము జప్పరించెగో?
చొక్క బరాంగిమధ్యముల - చూఱల బాటిలు వేడిచేత బెం
పెక్కదజేసి, దాని మను - నింటను దూఱిచి యాదరించెదో?"॥

సమస్య:- చన్నుల వంక జూపె జల-జాస్యవిటుండు తొలంగి పోవగన్.

ఉ॥ "క్రొన్ననవిల్తుగేళి గవ - గూడగ నియ్యెలనో టనోనికిన్
నిన్నివు దేగుదె మ్మనుచు - నే గబు రంపితి; సంత, నా చెలుల్
తిన్నగ సిన్నెరంబున క-దే! చనుదెంచుచు నున్నా" రటం
చన్నులవంక జూపె జల - జాస్య విటుండు తొలంగి పోవగన్॥

సమస్య:- యో నిరతంబు జేయు నను - డొందదు పాపము. బొందు
పుణ్యముల్॥

ఉ॥ మానక 'రామ, రామ,'యని - మానసమందు శివుండు నిత్యమున్
ధ్యానము జేయుచుండు; నల - తారక నామము జిత్తమందు శ్రీ
ధ్యానియమంబులొప్ప గను-దాను బునశ్చరణంబు నందొ, వేయో
నిరతంబు జేయునను - డొందదు పాపము, బొందుపుణ్యముల్॥

సమస్య:- 'భగమును నీవు పెట్టగను - బానముచేసినవాడనే' యనన్॥

చ॥ దగ గొని దుస్ససేనుని యె - దం గల నెత్తురు గ్రోలు భీముడం
తఁ గురుపతిం గనుంగొను ను. - 'ప్రాణసమున్, ప్రాణితిన్ మునూ

దీర్ఘ—మిత్రమా! ఇదియేమి?

జంబు—(స్వగతము) ఇంతపని జరుగక మానదని దీర్ఘదంతు డిదివరకే జెప్పియున్నాడు.

కాస—గురువరా! గృధ్రసంగమ మందే రహకందాయములో బట్టుబడితివా యేమి?

వక్ర—

తే. గీ కుంజమున నేను గృధ్రియుఁ—గూరుచుండ
  జేఁడు కనులారఁ జూచి యీ—రీతిఁ జేసె
  నైనపసి కేమిగాని యీ—యగ్రగృధ్రి
  కెంతయో పేరిమ నాపయి—నింతవఱకు

ఇంకను నాసంగతి వినుడు

చ. జనములు నన్ను గొట్టితినిగ—నల్పిన దాసికి లజ్జ లేదు, భూ
  పునికడ నుండి నాకు భయ—ముంగన నన్యాసి మేహానంబునా
  వనితభగంబు జొచ్చె నని—భావనఁ జేయును పండితాళిన
  న్ననయముదూస్తుఁడంచునిక—నాడ దోడఁగుచురంచుఁబొక్కెదన్

దీర్ఘ దంతాదులు—ఒక రాత్రి గడచుటకేగాని కోటి కిది పాతబడిపోదా! దీనికి విచార మేల?

వక్ర—అందువలన నీ చండాలపురాజు దేశము నుండి మఱియొక తోటకు బోవుదము. తరువాత,

తే. గీ. ఏ నగరి నేని యొక్క భూ—మీశుఁ గొలిచి
  గొప్ప శాస్త్రిలు వినుపించి—మెప్పువడసి
  ధనమును గడించి గృధ్రికి—ధార వోసి
  మంచితినమున రావించి—యుంచుకొందు.

అంతవఱకు నిపుణికను జంబుకుడు నేనును నేకముగా విషయించుచున్నాము. తరువాత వానికి నే నడ్డము రాను. కడుపునిండ దినినవానిని నీవు తిన వద్దనినం బ్రయోజన మేమున్నది? కాసరుని భార్య దీర్ఘదంతునకును, కాసరున కలాబూస్తనియు దక్కెగదా! రాజుగారి యెడబాటువలన వానరవేషమున పౌరుల నందఱును వదించుకొని వాడు దక్కినది.

దీర్ఘదంతాయః—కి మితోఽపి ప్రియ మాస్తే భగవతః ?
వక్ర— అత ఏవ నంతామి, తథా పీదం మస్తు భరతవాక్యం,

శ్లో. భూపాః పుణ్యపథే చరంతు భవతు
క్షేమం ప్రజానాం సర్వతః
కాలే ప్రోషధయః ఫలంతు కవయః
ఖేలంతు రాజ్ఞాం ప్రియాః,
విప్రా స్సం త్వథ నిర్భయా శ్చ విధవా
ద్వాహో జరీజృంభ తాం
కామో యేన పుమర్థసార్థ సరణౌ
మోర్ధాభిషిక్తో భవేత్.

శ్లో. హిమాద్రిదర్యాయితయోనిమత్యై
మేరుప్రమాణాధిక మేఢ్ర కాయ,
సుమైథునాయై కృతమైథునాయ
నమ శ్శివాయై చ నమ శ్శివాయ.

శ్రీకాళిదాసకృతం ప్రహసనం
నామ నాటకమ్
సమాప్తమ్.

## —• రాంబోవు గ్రంథ రాజములు •—

ప్రసంగరంగము, నాగరసర్వస్వము, పంచసాయకము,
కామకళ, ఆంధ్రరతిరహస్యము, కామకళావిధి,
మొదలుగా గల గ్రంథము లన్నియు
నొకదాని తరువాత నొకదానిని